# హెచ్చరిక!



## ఈ రోజు మీ బిడ్డ జలుబు రేపు ఫ్లూ, రొమ్ము పడిశము లేదా న్యూమోనియా కావచ్చు!

వ్యాధి ముదరక ముందే మీ బిడ్డ జలుబు బాధను త్వరగా పోగొట్టండి. జలుబులకొరకై ప్రత్యేకముగా చేయబడిన యీ ఘాటైన ఆయింట్ మెంటు రుద్దండి.

మీ బిడ్డ ఆరోగ్యమును గురించి అశ్రద్ధ చేయకండి! జలుబు, తుమ్ములు, రొంప, గొంతు నొప్పి వీటి మొదటి లక్షణములు కనుపించిన వెంటనే విక్స్ వేపోరబ్‌ను గుండెమీదా గొంతుమీదా, వీపుమీదా రుద్దండి. మీ బిడ్డకు ముక్కు, గొంతు, గుండెలలో వెంటనే స్వస్థత చేకూరును. అప్పుడు యీ నమ్మకముగా పనిచేయు ఆయింట్ మెంటు మీ బిడ్డ రాత్రులందు నిద్రపోవు సమయములో జలుబు బాధలను నివారించును. తెల్లవారే సరికి మీ బిడ్డ జలుబు పోయి మరల ఉత్సాహంగా వుండును.

విక్స్ వేపోరబ్ జలుబులను త్వరగా పోగొట్టును.... 2 విధములుగా!

**1** ముక్కు ద్వారా పని చేయును



**2** చర్మం ద్వారా పని చేస్తుంది.



మీరు గాలిని పీల్చునపుడు విక్స్ వేపోరబ్ ఘాటైన వాసన, శ్వాస నాళాలలోనికి పోయి ముక్కు, గొంతులోని జలుబు బాధలను పోగొట్టును.

విక్స్ వేపోరబ్ చర్మాన్ని వెచ్చ పరచి, బాధనుపోగొట్టి, ఊపిరి సలుపనిచ్చును. మీ బిడ్డ త్వరగా ఉత్సాహంగా వుండును!

పెద్దసైజు నీలం బుడ్డి






చిన్న ఆకుపచ్చడబ్బీ






# విక్స్ వేపోరబ్‌ను

రొమ్ము, గొంతు, వీపులపై రుద్దండి! అది అందరు వాడతగినది!

VR 3



**Founder**
**K. Nageswara Rao**

**స్థాపితము**
**1908**





**సంపాదకుడు:**
**శివలెంక శంభుప్రసాద్**

**సంపుటము 55**
**సంచిక 10**

**18-11-59**
**బుధవారం**

**వికారి కార్తిక బహుళ తృతీయ**



**విడిప్రతి వెల 25 న. పై.**
**సంవత్సర చందా 13-0-0**



**ఆంధ్రపత్రిక కార్యాలయము**
**7, తంబుచెట్టివీధి**
**మదరాసు-1.**


ముఖచిత్రం:
భాస్కర్ వారి 'మనోరమ' లో
కృష్ణకుమారి.



## దీపావళి సంచిక

ప్రత్యేకాకర్షణలతో వెలువడిన దీపావళి సంచిక వర్ణంతో అలరించింది. రేలంగిగారి మాట వరుసలను కూర్చి, వ్రాసిన 'శాఖాచంక్రమణం' చమత్కారంగా, థిలేగమ్మత్తుగా వుంది. ఈ వ్యాసంచదివాక నాకెంతో అభిమానం కలిగింది. (అభిమానం రేలంగిగారి సబ్బుల మీద కాదు; రేలంగిమీద అని గ్రహించవలెను.)

రామచంద్ర, కర్నూలు.

* * *

దీపావళిసంచిక, ఆశించిన దానికన్నా, ఎన్నోరెట్లు బాగా ముస్తాబై వచ్చింది. ముఖచిత్రంనుంచి దేశభాషలందు తెలుగులెస్స అనేవాక్యాలతో గొలుసు కట్టువరకూ ప్రతిదీ ఎంతో బాగున్నది. అంజలి, రేలంగి, వ్యాసాలు, జమున రాసిన అలిచిప్పలతో బొమ్మలు వ్యాసంకూడా, ఈ సంచికకి ఒవెలుగునిచ్చాయి. ముఖ్యంగా రేలంగిగారి పండగరోజూ, చదువుకొని పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వుకున్నాము.

శ్రీమతి అబ్బులు,
(ఖరగ్ పూర్.)

* * *

శ్రీమతి అంజలీదేవి, శ్రీయుత రేలంగిగార్ల రచనలుచాలా ఇంటరెస్టింగ్ గా వున్నాయ్. మన నటీనటులంతా తమ తమ జీవితాలలోని విచిత్రాలను భావాలను వ్రాయాలని మా కోరిక. కుమారి జమున వ్యాసం కూడా బావుంది.

తనికెళ్ల రామకృష్ణ,
(విశాఖపట్నం.)

* * *

రేలంగి వెంకట్రామయ్యగారు పండగగురించి చెప్పబోయి 'అర్జంటుగా' కొన్ని స్వానుభవాల్ని చెప్పేసి, గబగబానివ్వెంచేసి, మళ్ళీ అర్జంటుగా పండగగురించి చెప్పేశారు (వారి మిత్రులకు)!

ఏమైతేనా వ్యాసం చదువుతోంటే నిజంగా రేలంగి గారే మా దగ్గరకొచ్చి మాట్లాడుతున్నట్లనిపించింది.

యు. స. ప్రసన్నరావు,
(అనకాపల్లి.)

* * *

జి. సాంబశివరావుగారు వ్రాసిన 'దీపావళి-తోటాలడాయి' చాల చాల బాగుంది. పూర్వం తోటాలడాయి ఎలాజరిగేది బాగా చిత్రించారు.

గోపు శ్రీహర్నాథ్,
(కాకినాడ.)

## స్వరలహరి

'స్వరలహరి' శంకర్ జైకిషన్లనుగూర్చి వ్రాసిన వ్యాసం చాలా బాగుంది. వ్యాసం చదివినప్పటినుండి ఇప్పటివరకూ అందులో ఉదహరించిన పాటలు నా చెవులలో మారుమోగు

(55 వ పేజీ చూడండి)

# దారులకట్టుడి సమస్యలు; సినిమాలో చీకటి; ప్రభాకర జోషికథ

## రాజధాని కబుర్లు
ప్రవీణ్

జీవితం అశాశ్వతం, పుట్టిన ప్రతివాడూ ఎక్కడో అక్కడ, ఎలాగో అలాగ గిట్టక తప్పదు. పుట్టబోయేముందు దేముడు మనల్ని పిలిచి, ఏమివాయ్ వెంకటేశం, (లేక గిరీశం, లేక పార్వతీశం,) నిన్ను లోకంలోకి పంపిద్దామనుకుంటున్నాను, వెడతావా?' అంటే ఏం సమాధానం చెప్పేవాళ్లమో తెలియదు. కాని- 'రేపు నిన్ను లోకంలోంచి పంపేద్దామనుకుంటున్నాను' అని దేవుడు ముందే నోటీసు ఇస్తే?—

—మనలో నూటికి తొంభై తొమ్మిదిన్నర మంది నోటీసు అంగీకరించకుండా ఉండడానికి యత్నిస్తాం. వీలుంటే ప్రయాణానికి ప్రస్తుతం తగను. అని మెడికల్ సర్టిఫికేట్ దాఖల్ చేయడానికి వైద్యుల సలహా అడుగుతాం కూడా.

చావు తప్పదని మనకి తెలుసున్నా, తప్పించుకుందామని యత్నం చేయక మానం. ఈ యత్నం మనం తగినంత శ్రద్ధగా చేయడం లేదని మొగ పెట్టుకుంటున్నారు నగర రక్షక భట శాఖాధికారులు.

ఉదయం లేచి కళ్లు తెరిచేసరికి, పిల్లిలా ఎగురుతూ 'రేపే నువ్వు చచ్చిపోతే, నీ పెళ్లాం బిడ్డలు ఏం కావాలి?' అని గగ్గోలు చేసే భీమా ఏజంట్ల మీద కోపం కొద్దీ, వాళ్ళను కసితీరా కథల్లో ఎక్కించేశాం. భీమా కంపెనీలను ప్రభుత్వం జాతీయం చేసింది. ఏజంట్లు తాత్కాలికంగా తనువు చాలించారు. వారి వారసులు ట్రాఫిక్ నిర్వహణాధికారులు.

ఈ అధికారుల్లో ఒకరిలో కవిగారు దాక్కున్నారు. గతవారం రాజధానినగరంలో ట్రాఫిక్ వారం. (వస్తోంది పోలీసువారం, కబర్దార్!) ఈ ట్రాఫిక్ వారాన్ని పురస్కరించుకొని, ఆ కవిగారు విచ్చలవిడిగా కవిత్వం చెప్పేశారు. నగరమంతా చెట్లమీద, పుట్లమీద, ట్రాఫిక్ ద్వీపాల్లో, పేవ్ మెంటు అంచుల్లో బోర్డులు వెలిశాయి.

"అదృష్టం ఉంటే కొన్ని ప్రమాదాలు నివారించవచ్చు; జాగ్రత్త ఉంటే, అన్నీ నివారించవచ్చు" అన్నారు. "చావు శాశ్వతం సుమా! నీ తలకాయ ఉపయోగించు" అన్నారు. "పబ్లిక్ గార్డెన్స్‌లో వాహ్యాళి మంచిదే; కాని పబ్లిక్ రోడ్ల మీద కాదు" అన్నారు. ఇంకా ఇంకా ఇలాగే, చాలా చాలా అన్నారు.

* * *

అలా ట్రాఫిక్ కవీశ్వరులు అన్న వాటిలో బ్రహ్మాండమైనదొకటి ఉంది. అది 'పేవ్ మెంటు మీద నడు— నీ ప్రాణాలు రక్షించుకో' అన్నది.

రాజధాని నగరంలో కొన్ని కొన్ని పేవ్ మెంట్లు ఉన్నాయ్. వాటిమీద నడిచేటప్పుడు ప్రాణాలు రక్షించుకోడానికి చాలా తాపత్రయం పడాలి.

అసలు నగరపాలక సంఘం ధర్మమా అని రాజవీధుల్లో చాలవాటికి పేవ్ మెంట్లు ఉండవు. ఉదాహరణకి: అబీడ్స్ కార్నర్ తీసుకోండి. కోఠీకి పోయే రోడ్డుపక్కన కొన్ని వందల గజాల దూరంవరకు గేలం వేసి పట్టుకుందామన్నా పేవ్ మెంటు లేదు. నాంపల్లికి పోయే రోడ్డు సరేసరి: మైసూర్ కేఫ్ చేరేవరకు గల్లంతైపోయింది పేవ్ మెంటు. గన్‌ఫౌండ్రీ దిశ పోయే రోడ్డు ఒక చెంప వందగజాల దూరంవరకూ పేవ్ మెంటు లేదు. రెండో చెంప ఉంది కాని అది ఆడవాళ్ళు, హైజంప్ చేస్తే కాని మగవాళ్ళు ఉపయోగించడానికి నిర్దేశించబడింది కాదు. అక్కడ పేరుకుపోయిన సైకిళ్ళు, పేకేజీ పెట్టెలు మరే విధంగా దాటాలో చెప్పండి.

ఇదంతా తెలిసే కవిగారు అన్నారు 'పేవ్ మెంటు మీద నడవ్వోయ్ చూద్దాం వచ్చి, నీ ప్రాణం దక్కించుకో చూద్దాం!' అని

అబీడ్స్‌లో 'సంధి' వద్ద కోఠీకి పోయే బస్సులకోసం నిర్మించబడిన 'స్టేండు' వద్ద రోడ్డుల సగంవరకు ఆక్రమించుకునే కబుర్ల దార్లను కునికిపాట్లు పడుతున్న ఏ పోలీస్ జవాను పట్టించుకున్నాడు ఇంతవరకు? మదీనా బిల్డింగునుంచి హైకోర్టుకి పోయే త్రోవల కార్లు, బళ్ళు, సైకిళ్ళు, రిక్షాలు పోడానికి అనుకూలంగా చేయాలని ఏ జవాన తట్టింది?

ఢిల్లీ వంటి నగరాల్లో పేవ్ మెంట్లు విశాలంగా ఉంటాయి; పేవ్ మెంట్లమీద తారు చారలు వేసి, సైకిళ్ళు పోడానికి అనుకూలంగా నిర్వహిస్తారు. అంతటి ఆలోచనశక్తి మనవారికి లేదు. హైదరాబాదుల పేవ్ మెంట్లు ఇద్దరు లావుపాటి వాళ్ళు గట్టిగా నడిస్తే, ఏం చేయాలో తెలియక తికమక పడిపోతాయ్.

మదరాసు, బొంబాయి వంటి నగరాలతో పోలిస్తే మనకు ట్రాఫిక్ సమస్యే లేదంటారు అధికారులు. మన సమస్యలు వారికున్నాయా? మన మిత్రుడు కుంభకర్ణ పాటి నిద్ర అక్కడి నగరపాలకులకు వస్తుందా? అవధరించండి:



ఈనెల 14 తో 70 వళ్లు నిండి 71వ జన్మదినోత్సవం జరుపుకొన్న భారత ప్రధాని శ్రీ నెహ్రూ

### ట్రాఫిక్ ద్వీపాలు

(1) నగరంలో ట్రాఫిక్ ద్వీపాల నిర్మాణం ఎవరి బాధ్యతో తెలియదు. తారుడబ్బాలనిండా రాళ్ళునింపి రోడ్లమధ్య ఉంచడం వల్ల, సమస్య తాత్



# రాజధాని కబుర్లు



లికంగా పరిష్కారం దొరుకుతుందేమో! బేగమ్ బజార్, ఉస్మాన్‌గంజ్ ప్రాంతాల్లో సరుకులుమోసే లారీలు ఈ డబ్బాలను సరదాగా పక్కకు దొర్లించడం పోలీసు అధికారులకు తెలియని విషయంకాదు. తిలక్ మెమోరియల్ హాల్ ముందు, దారుల్ షఫాలో దర్గా ముందు రోడ్డు మధ్య బండరాళ్లుపడేసి, నెలలు సంవత్సరాలు గడిచినా ద్వీపాలు నిర్మించే అవకాశం ఇంకా అధికారులకు చిక్కలేదు.

## 'ముందుచూపు రహదార్లు"

(2) ట్రాఫిక్ ఒత్తిడి తగ్గించడానికి వన్‌వే ట్రాఫిక్ రోడ్లను కొన్ని నగర పోలీసుశాఖ నియమిస్తూంటుంది. ఈ 'ముందు చూపు' —కాదు, 'హ్రస్వదృష్టి' రహదార్ల పద్ధతి సమస్యను తాత్కాలికంగా పరిష్కరించడమేకాని, అధికారుల దూరదృష్టికి చిహ్నం కాదు. నారాయణగూడా-చిక్కడపల్లి మధ్య వంతెన వెడల్పుచేయడానికి పునాదులుపడి దశాబ్దాలు గడిచినా, ఆ నిర్మాణం జరగడం లేదు. అఫ్జల్‌గంజ్ బస్‌స్టాండు వద్ద బాటను 'ముందుచూపు' రహదారిగా ప్రకటించడం ప్రాణాంతకంగా ఉందని రాజధాని కబుర్లలో మనవి చేసుకొని కొన్ని నెలలైంది. ఆర్. టి. సి. అధికారులుకాని, నగరపాలకులుకాని, రక్షకభటశాఖాధికారులుకాని ఏ చర్యలు తీసుకున్నారో అర్థంకాదు.

'ముందుచూపు' రహదార్ల నిర్ణయం కూడా అవకతవకలతో జరుగుతూంది. ఒక రోడ్డుమీదికి పోకూడదని నిర్ణయించినప్పుడు ఆ రోడ్డుకి అటుదిక్కున 'ఇటురాకూడదు' అని బోర్డు తగిలించవలసిన బాధ్యత అధికారులకు లేదా? మోజంజాహి మార్కెటు నుంచి జాంబాగ్ దిశ సైకిలుమీద వెళ్ళిన ఒక పెద్దమనిషి, తిరిగివస్తూ, పట్టుబడిన విషయం, గత నవంబరు 19 వ తేదీన నగర మేజిస్ట్రేటు ఒకరు ఈ బోర్డు ఉండాలని అధికారులకు తెలిపిన విషయం ఇదివరకొకసారి ప్రస్తావించాను. అధికారులు ఈ విషయంలో ఏం చర్యలు తీసుకున్నట్టు?

మార్కెటు వెనుకనున్న రోడ్డును, ట్రూప్‌బజార్ 'పోలీస్ నాకా' ప్రక్కనున్న సందుని ఏ సూత్రాలననుసరించి 'ముందుచూపు' రహదారిగా ప్రకటించారు? ప్రజల సౌకర్యాలను దృష్టిలో ఉంచుకునే ఈ నిర్ణయాలు చేశారా అధికారులు?

## సైకిళ్ళు, రిక్షాలు

(3) హైద్రాబాదు వీధుల్లో కనపడిన రిక్షాలు, సైకిళ్ళు మరేనగరంలో కనపడవని భారత ప్రధాన నగరాలన్నిటితో పరిచయమున్నవారంటారు. ఈ రిక్షాలవారు ట్రాఫిక్ సూత్రాలు అమలు జరిపేటట్టు చేయడానికి పోలీసువారు తీసుకున్న చర్యలేమిటి? ఇంగ్లీషులో బోర్డులు తగిలిస్తే అవి రిక్షావాళ్ళకు అర్థమౌతాయనుకుంటున్నారా? ట్రాఫిక్ అధికారులకు తెలుగురాదని వినయంగా అంగీకరిస్తాం. అంతమాత్రంచేత-రిక్షావాళ్ళకి ఉర్దూ, ఇంగ్లీషుతప్ప మరే భాషలు రావని అధికారులు ఎందుకు భావించాలి.

## పోలీస్‌జవాన్ల ధ్యానముద్రలు

(4) ట్రాఫిక్ పోలీస్‌జవాన్లను సందరినీ రోడ్లపైనుండి తొలగిస్తే, రోడ్లమీద జరిగే ప్రమాదాలు సగంవరకూ తగ్గవచ్చునేవిశ్వాసం రాజధానిలో ప్రగాఢంగా ఉంది. వాళ్ళు సాధారణంగా నిలబడి నిద్రపోతూంటారు. రోడ్లపైన ప్రమాదాలు జరిగిపిపిమ్మటే తేరుకుంటారు. రక్షకభటశాఖకి చెందిన జవాన్ల సంఖ్య అవసరాలకు సరిపోనిపక్షంలో, సంఖ్యను హెచ్చించవలసిన బాధ్యత అధికారులది. అంతేకాని, ఉన్న జవానులతో తృప్తిపడి, మెలకువగాఉన్న కొద్దిమందిని చూసి సంతృప్తిపొంది, ప్రమాదాలు ఇంతే జరిగాయని భుజాలుతట్టుకొని ప్రయోజనం లేదు.

## సాగరతీరం తీరు

(5) హుస్సేన్‌సాగర్ టేంక్ బండ్ జంట నగరపాలక సంఘాల రెండింటిలో ఎవరి అధీనంలో ఉందో తెలియదు. దానిమీద రిక్షాలు పోకూడదని శాసించారు. మంచిదే! బండ్ క్రిందనున్న అతుకుల గతుకుల రోడ్డు నిర్వహించేదెవరు? ఉదయం ఆరుదాటితేగాని రవాణాసంస్థ బస్సులురావు. సికిందరాబాదులోఉండి, హైదరాబాదులో ఉద్యోగాలుచేస్తూ, ఉదయం ఆరుగంటల ప్రాంతాలకు ప్రయాణం చేయవలసిన స్త్రీలు, పురుషులు రిక్షాల్లో పోవాలి. అంతే- టేంక్ బండ్ దరిదాపులకు రాకూడదు.

ఈ విషయం నగరపాలక సంఘాలుకాని, ట్రాఫిక్ అధికారులుకాని ఎన్నడైనా ఆలో

చించారా? సమస్యలన్నీ సమగ్రంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకునేందుకు, ప్రజల అవసరాలు గమనించి తీర్చేందుకు ఇప్పటికైనా ఒక సంఘాన్ని నియమించు కుంటే బాగుంటుంది. చాకలి పేరిగాడి పాలవకైనా ఎప్పుడో అప్పుడు అంతం ఉండాలిగదా?

## సినీమాహాల్లో చీకటి

పూర్వం రాజధాని నగరంలో తెలుగు సినీమాలకు ఎక్కువగా ఉండేవారు కారు ఆరాధకులు, ఈ దశాబ్దంలో క్రమేణా తెలుగు సినీమాల విలువ హెచ్చింది. డిమాండు ఎక్కువైతే, ధర పెరుగుతుందిట.

కొత్తగా రాజధాని నగరంలో విడుదలైన ఒక తెలుగుసినీమా చూడబోయిన ప్రేక్షకులు ఇరువురు తెలిపిన సంఘటనలు వినండి.

ఒక సినీమాహాల్లో ఒక క్లాసులో 112 స్థానాలున్నాయి. రెండో ఆట తొమ్మిదిన్నరకి ప్రారంభిస్తారనగా, ఎనిమిదిన్నరకే కిటికీవద్ద క్యూ ఏర్పడింది. ఈ కథ చెప్పిన ప్రేక్షకుడు ఎనభయ్యోవాడు, ఒక్కొక్కడికి ఒక్కొక్క టిక్కెట్టు ఇస్తూన్న గుమాస్తా, ఇతనివంతు వచ్చేసరికి కిటికీ మూసేశాడు. మిగిలిన ప్రేక్షకులను ఇళ్ళకు పొమ్మన్నారు.

ఈలోగా అదే క్లాసుకి చీకటి బజారులో టిక్కెట్ల అమ్మకం ప్రారంభం ఐంది. నూటికి రెండు వందలు నిష్పత్తిలో ఖరీదు. చీకటి బజారులో టిక్కెట్లు కొనడం ఇష్టం లేనివారు ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఇతడు ఆ టిక్కెట్టు కొని లోనికిపోయి ఒక గంటసేపు కూచున్నాడట, ఆ గంటలో ఆ క్లాసులో పాతిక సీట్లవరకు ఖాళీగానే ఉన్నాయిట. ఈ సంఘటన నారాయణగూడా ప్రాంతంలో ఉన్న ఒక సినీమాహాలు వద్ద జరిగింది.

మరో హాలులో ఇరువురు స్త్రీలు ఆలస్యంగా చేరుకున్నారు. టిక్కెట్లు అమ్మిన గుమాస్తా చోటుందన్నాడు. లోపలికి పోయేసరికి సీట్లు నిండిపోయి ఉన్నాయి. కావాలంటే-కుర్చీలు తెచ్చి మధ్య ఖాళీలో వేస్తామన్నారట, టికెట్ వాపస్ తీసుకోడానికి నిరాకరించాడు అసిస్టెంట్ మేనేజర్. అడిగితే నేనే మేనేజర్ని పొమ్మన్నాడు. తరువాత మేనేజరు వచ్చి, టిక్కెట్లు వాపస్ ఇప్పించాడు.

మొదటి సంఘటన వంటి సంఘటనలు వల్ల తీవ్రంగా నష్టపోయేవాళ్ళు సినీ నిర్మాతలు, డిస్ట్రిబ్యూషన్ సంస్థలు, హాలు యజమానులు, ప్రేక్షకులు. అన్యాయార్జితం ఒకరిద్దరు వ్యక్తులకు దక్కుతుంది. రెండవ తరహా సంఘటన నగరంలో సినిమాహాళ్ళు నడుస్తూన్న తీరుకి నిదర్శనం ఇది. రెండూ మంచివి కావు; వాంఛనీయమైన పరిణామాలకు దారితీసేవి కావు.

నగరంలో ప్రదర్శనశాలలు ఏవిధంగా నడుస్తున్నాయో మరోసారి పరిశీలిద్దాం.

## శ్రీ కృ. జ. స్థా. [భయపడుతూ] చెప్పినకథ

"....మరోసారి పరిశీలిద్దాం" అని రాసి, ఒక కునుకు తీసేసరికి కల్లో కనపడింది శ్రీ కృ. జ. స్థా. పగలు చూస్తే రాత్రి కల్లోకొచ్చేరకం శ్రీ కృ. జ. స్థా. నేను మాటాడడానికి తెరిపివ్వకుండానే ఇలా ప్రారంభించింది:

"ప్రభాకర కృష్ణజోషీ నాదగ్గర కొచ్చేశాడు, తెలుసా? ఏడాదిపైనా నాలుగు నెలలకు తక్కువ కాకుండా ఉంటాడు నాదగ్గర. ఇరవై మూడేళ్ళకు రాడు. పుష్టిగా వుంటాడు చూడానికి. నాగపూర్ హిస్లాప్ కాలేజీలో ఇంటర్మీడియేట్ వరకూ చదువుకున్నాడు. చూస్తే, 'ఇతనా దొంగతనం చేసింది?' అనిపించింది."

"సరిగ్గా ఒక్క యేడాదినుంచి చిక్కడపల్లిలో నెలకు రు 45లు అద్దెఇచ్చి వుంటున్నాట్ట. 'అతను అక్కడ హోటల్లో కాఫీ తాగుతూంటే చూశాం; చాలా మంచివాడులా కనపడ్డాడు' అన్నారు చాలామంది. 'మాదగ్గరకు టాయ్‌లెట్ పౌడర్ అమ్మకానికి వచ్చేవాడు; మనిషి చాలా మెతకమనిషిలా ఉండేవాడు" అన్నారు వర్తకులు. అదిగో పులి అంటే ఇదుగో తోక అంటారు మనుష్యులు. అద్దదీ సంగతి" అంది శ్రీ కృ. జ. స్థా., అదోలా నవ్వుతూ.

"ఇంతకీ ఏంజరిగింది?" అనబోయా ఇంతలోనే మళ్ళీ ప్రారంభించింది.

ఆర్థిక కార్యదర్శి శ్రీ దామోదర రెడ్డి బర్కత్ పురాలో వుంటారు. క్రిందటి నెల 2 రాత్రి ఆయన రెండుగంటలవరకు చద కుని కన్ను మూసుకున్నారు. నాలుగు ఇ కుక్కలున్నాయి ఆ ఇంట్లో. అవి కూ నిద్రపోతున్నట్టున్నాయి. రాత్రి మూ గంటలకు ప్రవేశించి, రు 27,500 ల వి నగలు, మూడువేల రూపాయల నగదు, దాగా తీసుకుని బయటపడ్డాడు జో ఆయన డ్రైవరు సిగరెట్టు కాల్చుకుందా బయటకు వచ్చేసరికి, జోషీ కనబడ్డా 'కౌన్ రే?' అంటే నిశ్శబ్దంగా నిలబడ్డా పరుగెత్తాడు. 'చోర్, చోర్' అన్నా డ్రైవర్. గేటుదాటి, తనుకూడా "చో చోర్" అంటూ పరుగులంకించుకున్నా జోషీ. నగలతో, నగదుతో గస్తీపోలీసుల చిక్కాడు."

"కోర్టులో నేరం ఒప్పుకుంటానుమొ అంటే వినక పోలీసులు విచారణ ప్రారం చారు. ఇనస్పెక్టరు పుల్లారెడ్డి ఉత్తర యాత్ర ప్రారంభించాడు. యాత్రలో బయ పడ్డ విశేషాలివి: జోషీకోసం బొంబా వాళ్లు వెదుకుతున్నారు. పూనాలో నాల కేసుల్లో ముద్దాయిగా ఉండి, పారిపో చ్చాడు. ఇక్కడ ఇంతకు ముందు మూ ఇళ్ళకు కన్నం వేశాడు. మేజస్ట్రేటుగ మనదగ్గర వుండమని పంపించారు."

"ఈకథ చెబుతానంటే-కృ. జ. స్థా. చో లేదు పొమ్మంది, చూడు. వినేవాళ్ళ కబుర్లు చెప్పేవాళ్ళు లోకువ' అంది శ్రీ జ. స్థా. అని మాయమైంది.

# చైనా పట్ల నెహ్రూ విధానం

ప్రధానమంత్రి ఈ మధ్య మళ్లీ ఒకసారి పత్రికలపై ఆగ్రహం వెల్లడించారు. రామలీలా మైదానంలో జరిగిన సభలో మాట్లాడుతూ ఆయన, తన మీరట్ ప్రసంగం నుంచి అక్కడో ముక్కా, ఇక్కడో ముక్కా తీసుకుని కొందరు గౌరవనీయులు ఇష్టం వచ్చినట్లు వ్యాఖ్యానాలు చేశారు. "పత్రికలలో వ్రాస్తున్న ఈ గౌరవనీయులు నేను మాట్లాడే పద్ధతిని, ఎవరిని ఉద్దేశించి మాట్లాడానో వారిని, గుర్తులో పెట్టుకుని మరీ వ్యాఖ్యానిస్తే బాగుంటుంది. ఎప్పుడూ అసలు గుర్రాలను ఎక్కి ఎరగని వారు కొయ్యగుర్రాలను రంగంలోకి దింపారు. రంగంలో ఏవేవో వ్రాశారు," అని ఆయన అన్నారు.

మీరట్ చుట్టుప్రక్కల గ్రామాలనుంచి వచ్చిన రైతులను ఉద్దేశించి తాము ప్రసంగించామనీ, లడక్ వద్ద జరిగిన సరిహద్దు సంఘర్షణను గూర్చి వివరించి చెప్పటానికి తాము ప్రయత్నించామనీ ఆయన అన్నారు.

"నేను వెల్లడించిన భావాలు పాతవే. కాని అతిక్లిష్టమైన ఈ సమస్యను రైతులాది ప్రజలు అర్థంచేసుకోవటానికి వీలుగా నేను మాట్లాడే పద్ధతిని, స్థాయిని మార్చాను," అన్నారు.

మొదటిది:— కాంగ్రెసువారికి ఉత్సాహపు గుర్రాల మీద స్వారీ చేయటం బాగా అలవాటు. అంతకంటే కొయ్యగుర్రాల మీదనైనా స్వారీచేయటం మంచిది కాదా? అసలు గ్రీకులకు విజయం తెచ్చిపెట్టింది కొయ్యగుర్రమే గదా?

రెండోది:— దేశంలో కాస్త వ్యక్తిత్వం ఉంటూఉన్న ప్రతి పత్రికా విమర్శించింది ప్రధాని మాటల పద్ధతిని, స్థాయినీ, కాదు. ఆయన భావాలనే. మీరట్ లో తాము సంబోధించినది రైతులనని ప్రధాని అన్నారు. అయితే రామలీల మైదానంలో ఆయన మాట్లాడింది రాజకీయవేత్తలను ఉద్దేశించా? కాదే? అయినా ఆ ప్రసంగం భారతప్రజల భావాలను ప్రతిబింబించి ఉండకూడదా, దాన్ని అందరూ సమర్థించాలా? అసలాయన మీరట్ రైతులను ఉద్దేశించి ప్రభుత్వ విధానంమీద ఎందుకు మాట్లాడవలసివచ్చింది? ఆయన ఆధ్వర్యంలో ఉన్న విదేశాంగశాఖ పబ్లిసిటీ డిపార్టుమెంటు ఎంత అసమర్థంగా పనిచేస్తున్నా, మీరట్ ప్రసంగానికి అమెరికా, బ్రిటన్, చైనాల్లో బోలెడంత ప్రచారం చెయ్యబడినసంగతి ఆయనకు తెలీదా? యావత్ప్రపంచపు కళ్లూ, చెవులూ అన్నీ న్యూఢిల్లీమీద, ప్రధానమంత్రిమీద కేంద్రీకృతులై ఉన్నాయి. ఆయన ఆఖరికి పాకీ పనివారిని ఉద్దేశించి మాట్లాడినా అది ప్రధానవార్తే. అక్టోబరు 30 వ తేదీ లండన్ "టైమ్స్" పత్రికలో మీరట్ ప్రసంగ సంగ్రహం ప్రముఖంగా ప్రచురింపబడింది. ఈ ప్రసంగంపట్ల భారతీయుల అభిప్రాయాలనుకూడా ఆ పత్రిక ఒకటిన్నర కాలమ్ జాగాలో ప్రకటించింది. లడక్ సరిహద్దు పోరాటను నేక్లిష్టసమస్యను సామాన్యరైతులకు వివరించి చెప్పాతున్నారనేఅనుకున్నా, మొత్తంమీద భారతదేశం లడక్ వివాదం మీద చైనాతో యుద్ధానికి తలపడదనే విషయాన్ని, ప్రధానమంత్రి స్వయంగా చైనావారికి చెప్పినట్లయింది. సరిగ్గా చైనా వారు తెలుసుకోగోరుతున్న విషయం ఇదే!

## న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

### ఎడతెగని ప్రసంగాలు

ప్రధానమంత్రి నిరంతరంగా ఎందుకు ప్రసంగాలు చేయవలసి వస్తోందో తెలియటంలేదు. కలకత్తా వెళ్లారు. పత్రికలవారితో మాట్లాడారు. విషయం? చైనా! మీరట్ వెళ్లారు. మాట్లాడారు. విషయం? చైనా! రామలీలా మైదానం సభకు సందర్భంలేదు. అయినా ఆదివారంనాడు ఆ సభ ఏర్పాటు చేశారు. దేనికి? స్వరపేటికలకు పని చెప్పటానికి! ఈనెల 8 వ తేదీన పార్లమెంటు సభ్యులను సమావేశంచేసి ఒక ప్రసంగం; తరవాత పత్రికా విలేఖరులతో ప్రసంగం; పార్లమెంటు సమావేశమైతే అది ఆయనకు మళ్ళీ ఒక ప్రసంగ రంగం!

భారతదేశపు బలహీనతను గూర్చిన కట్టుకథలను పత్రికలు ప్రచారం చేస్తున్నాయని ప్రధాని నిందించారు.

అయితే—లడక్ కు 90 మైళ్ళ పొడుగున రోడ్డు వేయటానికి ఆరేళ్ళక్రితం సంకల్పించారు. దీనిమీద ఇప్పటికి 16 లక్షల రూ. లు ఖర్చయింది. ఇంతవరకూ పని ప్రారంభమే కాలేదు. ఈ సంగతి ప్రజలకు తెలియజెప్పవలసిన బాధ్యత పత్రికలకు ఉందా, లేదా? లడక్ లో చైనావారు ఏంచేస్తోందీ మనకు కాస్తయినా తెలియలేదూ అంటే, సెంట్రల్ ఇంటెలిజెన్స్ డిపార్టుమెంటు ఏంచేస్తోం దనుకోవాలి?

ఎప్పుడో ఏ రైలుపెట్టెలోనో ఒంటరిగా ఆడది కనిపిస్తే హత్యో చెయ్యటం తప్పిస్తే, భారతదేశంలో సాధారణంగా అహింసయే ప్రవర్తిల్లుతోంది. భారతీయులు సహజంగా అహింసావాదులు. వీరికే గదా ఇంతకాలం అహింస అహింస అని ప్రధాని చెవినిల్లుకట్టుకుని చెబుతోంది?

తాము చైనాపట్ల అనుసరిస్తున్న బలహీన విధానానికి ప్రతిపదిక అయిన పంచశీలను ఏదోవిధంగా కాపాడుకోవాలని ప్రధాని తాపత్రయం. అయిన చైనా విధానం విఫలమైందని ప్రజలకు పత్రికలు చెప్పాయంటే అది నిజంగా గొప్ప విషయం. ప్రధానిచేసిన మీరట్ ప్రసంగం భారతీయుల భావాలను ప్రతిబింబం కాదని విమర్శించాయంటే ఎంతో మెచ్చుకోవలసిన విషయం.

### రష్యా వైఖరి

సోవియెట్ శాసనసభ సమావేశంలో కృశ్చేవ్ చేసిన ప్రసంగాన్ని కొందరు ఆకాశానికి ఎత్తేశారు. కృశ్చేవ్ అన్నదిది — "ఛేదించరాని సోదర మైత్రీబంధంతో మనం చైనావారు కట్టుబడి ఉన్నాం. భారత రిపబ్లిక్ తో స్నేహ సంబంధాలను విజయవంతంగా అభివృద్ధి చేసుకుంటున్నాం. మన మిత్రదేశాలైన ఈ రెంటికీ ఇటీవల జరిగిన



ఈనెల 2 వ తేదీన, 73 వ ఏట కీర్తిశేషులైన భారత మాజీఆర్థిక మంత్రి, ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త జాన్ మత్తయ్

పరిహద్దు తగాదాలు మనకు చాలా ఖేదం కలిగిస్తున్నాయి.

ముఖ్యంగా ఈ సంఘర్షణలు ఉభయ పక్షాలలోనూ మరణాలకు కారణం కావటం విచారకరంగా ఉన్నది. చనిపోయినవారి తలిదండ్రులకు, బంధువులకు కలిగిన నష్టం తీర్చరానిది. భారత చైనా సరిహద్దులలో ఇట్టి సంఘర్షణలు మళ్ళీ జరగకుండా, ఉభయ పక్షాలకు తృప్తికరంగా స్నేహపూర్వకమైన సంప్రదింపులద్వారా సరిహద్దు వివాదం పరిష్కారమైతే మనం సంతోషిస్తాం."

చైనా గూర్చి కృశ్చేవ్ ఇంకా ఇలా అన్నారు:

"చైనా అగ్రరాజ్యం కాకుండా చెయ్యాలని పశ్చిమ రాజ్యాలు ప్రయత్నిస్తున్నాయి. కాని చైనా నిస్సందేహంగా అగ్రరాజ్యం. దీన్నెవరూ కాదనలేరు. చైనా, రష్యా మిత్రదేశాలు. ఫార్మోజా చైనాకే చెందాలనే కోరికను రష్యా సమర్థిస్తోంది."

"ఉభయ పక్షాల" మనుషులు మరణించినందుకు కృశ్చేవ్ విచారం వెల్లడించారు. చూడండి. చైనాతో తమకు సోదర మైత్రీ బంధాలున్నాయట. భారతదేశంతో స్నేహ సంబంధాలు అభివృద్ధిచేసుకుంటూ మాత్రమే ఉన్నారట. చైనా అప్పుడే అగ్రరాజ్యమైపోయిందట. రష్యా చైనా మిత్రదేశాలట. చైనాను సమర్థిస్తోందట. భారత చైనాలకు యుద్ధమే వస్తే రష్యా ఏ పక్షాన ఉంటుందో వేరే చెప్పనక్కర్లేదు.

న్యూఢిల్లీలో ఆశ్చర్యం కలిగించిన విషయం ఒకటుంది. ఈజిప్టు పరిపాలకుణ్ణి, అల్జీరియా, బర్మా, ఇండోనేషియా, ఇంకా ఇతర తటస్థ విప్లవకారులను సమర్థించి, శ్రీ నెహ్రూ పశ్చిమరాజ్యాలను శత్రువులు చేసుకోవటానికి శంకించలేకుండా కనపడ్డారు. కాని వీరిలో ఏ ఒక్కరూ ఇప్పుడు భారత దేశాన్ని సమర్థిస్తున్నవారు కనబడటంలేదు.

* * *

కమ్యూనిస్టుపార్టీలో చీలికనుగూర్చి పత్రికలు ఏవో వ్యాఖ్యానం చేస్తూనే ఉన్నాయి. మచ్చుకి:

హిందుస్థాన్ టైమ్స్-కమ్యూనిస్టుపార్టీలో విభేదాలను పరిశీలనగా చూస్తే చెప్పుకోదగినంత ఏమీలేదు. డాంగే మొదలైనవారు చైనాను ఖండిస్తూ ఇంతవరకూ ఒక్క ముక్క అనలేదు.

శ్రీ నెహ్రూ, చౌఎన్‌లై ముఖాముఖి స్నేహపూర్వకంగా సంప్రదింపులు జరిపి వివాదం పరిష్కరించుకోవాలని కమ్యూనిస్టులు చేస్తున్న సూచననుగూర్చి ఆ పత్రిక, "కేరళలో ఎన్నికల ఎత్తుగాను, మహారాష్ట్రలో ఇతర రాజకీయుల మైత్రికోసమూ కమ్యూనిస్టులు ఈ దేశభక్తి ప్రదర్శించక తప్పలేదు. ఆ అవసరాలు తీరిపోగానే సమ్మతిగా తప్పుకోటానికి వీలుగా ఉండేందుకే నెహ్రూ-చౌ సంప్రదింపులు అంటూ వీరు సూచిస్తున్నట్లున్నారు.

ఫ్రీ ప్రెస్ జర్నల్ :-కమ్యూనిస్టుపార్టీలో చీలికనుగూర్చి ప్రజలెవరూ పట్టించుకోవటం లేదు. ఆందోళన కలిగించే విషయమేమిటంటే- ఇంత విషమపరిస్థితి ఏర్పడినప్పుడు కూడా, సరిహద్దులో చైనా శాంతియుత ఉద్దేశాలుఅంటూ కమ్యూనిస్టులు కబుర్లు చెబుతున్నారు.

యుద్ధ ప్రమాదం ఏర్పడినప్పుడు ఏ దేశమైనా, తన సరిహద్దులలో దొంగ ప్రజలు దురాక్రమణ చేస్తున్న సైన్యంతో బహిరంగంగా చేతులు కలపటం ఎలా సహించగలదు?

పయొనీర్: కమ్యూనిస్టులలో చీలిక గాఢంగానే ఏర్పడింది. దీన్ని అతకటం కష్టం. అమృత్ సర్ సిద్ధాంతానికీ, తెలంగాణా సిద్ధాంతానికీ మధ్య యుద్ధం రగులుతుంది. తెలంగాణా సిద్ధాంతవాదులు, కేరళ పోతే పోయింది. భారత సరిహద్దులలో చైనాలాంటి పెద్ద కమ్యూనిస్టు దేశం ఉండగా కేరళ పోతే ఒక లెక్కా అని భావిస్తున్నట్లున్నారు.

కాని కమ్యూనిస్టు పార్టీలో అసలు చీలిక వచ్చిందా? అని అమృత్ బజార్ పత్రిక సందేహిస్తోంది.

చైనీస్ కమ్యూనిస్టులతో స్నేహం చెడగొట్టుకోకుండా ఉండటంవల్ల కేరళ ఎన్నికలలో విజయావకాశాలను త్యాగం చెయ్యాలని శ్రీ నంబూద్రిపాద్ భావిస్తున్నట్లయితే అది ఆయనా, ఆయన పార్టీ చూసుకోవలసిన విషయం. కాని శ్రీ డాంగే వైఖరి చూస్తే, రాబోయే ప్రత్యేక మహారాష్ట్రలో తమ విజయావకాశాలను జారవిడుచుకోరాదని పట్టుదలగా ఉన్నట్లు కనిపిస్తోంది.

చైనా దురాక్రమణపట్ల ఏ వైఖరి అవలంబించాలి అనే విషయమై భారత కమ్యూనిస్టు పార్టీలో ఏర్పడిన చీలిక గాఢమైనదనీ, ముందు ముందు ఈ పార్టీ ఈ దేశంలో ఉంటుందా, ఊడుతుందా అనేది తేల్చివేయుదనీ "హిందూ" అభిప్రాయ పడుతోంది. చైనా చర్యలు ఆమోదయోగ్యంగా లేని మిగతా కమ్యూనిస్టు దేశాలలోకూడా భారత కమ్యూనిస్టుపార్టీలో ఏర్పడిన చీలికలవంటివి ఏర్పడవచ్చునని ఆ పత్రిక భావిస్తోంది.

శ్రీ డాంగే, నంబూద్రిపాద్ వాస్తవిక వాదులని ఇక్కడ కొందరు అభిప్రాయపడుతున్నారు. చైనాకు అనుకూలమైన వైఖరి అవలంబిస్తే ఎన్నికలలో పరాజయం తథ్యమని వారు గ్రహించారు. అయితే మిగతా వారుకూడా వాస్తవికవాదులే. రష్యావైఖరికి భిన్నమైన ఏ వైఖరి అవలంబించినా దెబ్బ తినకతప్పదని వారికి తెలుసు. కృశ్చేవ్ వారికి దారి చూపించనే చూపించారు. భారత చైనా వివాదాన్నుగూర్చి విచారం ప్రకటించవచ్చు. జనస్థానికి ఉభయపక్షాలను మందలించవచ్చు. దూరదృష్టితో ఆలోచిస్తే చైనాకంటే రష్యాయే భారతీయ కమ్యూనిస్టులకు ఎక్కువ విశ్వసనీయమైన ప్రాపు.

కాని రష్యావైఖరినే భారతీయ కమ్యూనిస్టులూ అనుసరిస్తే, అది భారతీయులకు సంతృప్తికరంగా ఉంటుందా అని ప్రశ్న. భారత చైనా తగాదాలో ఏదో ఒక దృక్పథం అంటూ అవలంబించటం జరిగిందనుక, కమ్యూనిస్టులు ఏం జరిగినా, జరగక పోయినా దాన్ని వదలకూడదని కొందరు ఇక్కడ భావిస్తున్నారు. కొద్దిరోజుల్లో ఈ విషయం తేలిపోగలదు. ★

'ఎఱ్ఱనకు ప్రబంధపరమేశ్వరుడనీ, శంభుదాసుడనీ పేర్లు - కాని నాకు మూడు బిరుదులున్నాయి, అంటూ సగర్వంగా ఒక శతాధిక గ్రంథకర్త చెప్పుకోగా 'సదరు తమ పేర్లు వివరించ'మని ఒక అభిమాని అడిగాడు.

'ఇంట్లో నైవేద్యసృష్టి, క్లబ్‌లో విగ్రహపుష్టి, దేశంలో వాఙ్మయపరమేష్ఠి'అని ఆ గ్రంథకర్త ఏకరువుపెట్టాడు.

# అసంబంధ యాత్రికులు

శేషి కృష్ణమూర్తి



గాలప్ తీస్తున్న టాంగాలో వెనకవైపున కూర్చుని, ముందుకుచూస్తూ, యమునానదిగట్టుపైనుండి ప్రయాణిస్తూ, సంగమ స్థలాన్నీ, అపురూపంగా ఉన్న యమునానదీ జలాన్నీ, దూరంగా దానితో సంగమిస్తున్న గంగానదినీ, చీమలబారుల్లా సంగమంవైపు మెల్లిగా కదుల్తున్న నావల్నీ, బ్రిడ్జి మీంచి పోతున్న కాశీ ఎక్స్‌ప్రెస్‌నూ చూస్తూ గొప్పఅనుభూతిని పొందుతున్నాడు హరికృష్ణ. యమునానదిలో ప్రతిబింబిస్తూ కనులకు పండుగ చేస్తున్న అలహాబాద్ కోట అశోకుడి కాలానికి అతని మనస్సుని మళ్లించి, పాతజ్ఞాపకాలను తోడి, మనస్సును సౌందర్యపిపాసతో నిలుపుతోంది.

"మీరు పిండాలు, అవీ వదుల్తారా బాబూజీ?" అన్నాడు టాంగావాలా హిందూస్తానీలో ఏదోమాదిరిగా దీర్ఘం తీస్తూ.

తీయని పానకం త్రాగుతుంటే గొంతుకు ఏదో పుల్ల అడ్డుపడినట్లనిపించింది. అయినా ఓర్చుకుని:—"పిండం లేదు; ఊరకే చూడ్డానికి వచ్చానంతే," అన్నాడు నిర్లిప్తతలో—తను అనుభవిస్తున్న ఆనందానికి ఆ క్షణమైనా విఘాతం కలిగించడం ఇష్టంలేక.

దారిలో కొంతమంది బ్రాహ్మణులు అతని టాంగావాలాతో ఏదో అరుస్తూ అంటున్నారు...

"అయితే పండాల గొడవ లేదన్నమాట" అన్నాడు టాంగావాలా—మళ్ళీ అనుకుని.

హరికృష్ణ దాన్ని వినిపించుకోలేదు. తన ఆలోచనల్లో మునిగిఉన్నాడు. ప్రయాగని గురించి అతనెంతో వినేవాడు. త్రివేణి సంగమంలో ఆ 'త్రివేణి' అనే పదంమీద అతనికెంతో అభిమానం. యమున, సరస్వతి అనే పేర్లుకూడా ఇష్టమే. గంగ అనే మాట మీద అంత మోజు లేదు. అయినా గౌరవం లేకపోలేదు. ఉత్తరాదిని సుభిక్షంచేసే నది అని. గంగపేరు విన్నప్పుడు శంతనుడి కథ గుర్తొచ్చింది. కాశీవద్ద వరుణానదితీరాన తను కొంతమంది గ్రామీణుల్ని చూశాడు; ముఖ్యంగా స్త్రీలను—వాళ్ళు అంతే! మత్స్యగంధుల్లా జాకెట్లు ధరించక, నునుపైన భుజాలను, దండలనూ ప్రదర్శిస్తూ, ఆకర్షణీయంగా కనుపించారు.

ఎందుకో ప్రవరుడు గుర్తొచ్చాడు. పాదలేపనం కరిగి, వరూధిని చిక్కులో పడ్డప్పుడు: "గయా, ప్రయాగా మొదలైనవి చూస్తాననుకోక ఈ హిమాలయాలెందుకు చూడాలని నాకు బుద్ధిపుట్టింది" అని వాపోతాడు. అతనికి పట్టని అదృష్టం తనకి పట్టింది.

అదీగాక అతనికి స్త్రీలమీద అమితమైన గౌరవం; స్త్రీలూ స్వంతపట్నంలో ఉన్నాననే భావం అతనికి కొంత గర్వాన్ని కలిగించింది. ఈ నదీతీరాన స్త్రీలూ స్వైరి

చేసి ఉంటాను. ఈ నదిలో అతను ఈతలాడి వుంటాడు—ఎగ తెగని ఆలోచనలు!

టాంగా ఆగడంతో బాహ్యలోకస్ఫురణ కలిగింది.

"ఇక్కడే దిగండి బాబూజీ. ఇక్కడ నావలు దొరుకుతాయి. అందరికోసం ఆగకండి. అయిదు రూపాయలిస్తే మీకు ప్రత్యేకంగా నావ కిస్తారు. సంగమం చూపిస్తారు" అన్నాడు టాంగా వాలా నురుగు కక్కుతున్న గుర్రాన్ని తడుతూ.

హరికృష్ణ టాంగా దిగేడు. అంతలోకే ఒక రిక్షా ఆగడం, ఒక అందమైన యువతి అక్కడ దిగడం జరిగింది. ఆ అందానికి అతడు నిశ్చేష్టుడయ్యాడు. అసలే అతని హృదయం ఆనందానుభూతి అంచులను చేరుకుంది. ఆమె దర్శనం ఆ అనుభూతిని అధికం చేయసాగింది.

"సంగమం చూడ్డానికి వచ్చారా?" అన్నాడు.

"అవును."

"ఎక్కడ్నుంచి."

"పూనా."

"మహారాష్ట్రులా."

"క్రిస్టియన్ను."

"పేరు?"

"సరస్వతీ ఫిలిప్స్."

అతని తల తిరిగినట్లయింది. త్రివేణి సంగమంలో గంగా యమునలే గాని సరస్వతి కనపడదంటారు. అది అంతర్వాహినిగా ఉంటుందని విన్నాడు తను. ఆ సరస్వతే మానవరూపం పొంది తనకు సాక్షాత్కరించినట్టయింది. అతని ఆనందం మిన్నుముట్టినట్టయింది.

"నడవండి" అన్నాడు రేవులోకి దారి తీస్తూ.

"త్వరగా రండి" అన్నారు రిక్షావాడూ, టాంగా వాడూ.

"వాళ్ల కా మాటలు వినబడలేదు. యమునా నదిపైనుండి వస్తున్న వాయు తరంగాలలో లీనమైపోయాయి.

"దిగుతూ మీరెక్కడ్నుంచి వచ్చారు?" అంది సరస్వతి.

"హైదరాబాద్"

"ఎక్స్‌ప్రెస్‌కు వొచ్చారా?"

"అవును."

"హిందువులు మత సంబంధంగా వస్తుంటారుగా. మీకట్లాంటి పనులు లేవూ?"

"నాకు నమ్మకాలు లేవు."

కళ్ళు పెద్దవిచేసుకు చూసింది. అన్నిమెట్లూ దిగిన మూలాన అలిసింది కొంచెం. అక్కడ నావలవాళ్లు చేరేరు.

అతనో నావను మాట్లాడేడు. "మనం ఇతరులకోసం చూస్తే ఆలస్యమౌతుంది. ప్రత్యేకించి ఓ నావ మాట్లాడాను" అన్నాడు.

ఆవిడ "సరే" అన్నట్లుగా తలను వేగ త్రిప్పింది—నిజంగా చదువుల సరస్వతే! ప్రకృతి సౌందర్యాస్వాదన మరిచిపోయి సరస్వత్యుపాసనలో పడ్డాడతను. లేక బహుశా ఆ పరిసరాలు ఆవిడ సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేసి వుంటాయి. అతడు అచేతనుడైనట్టు, ఏదో స్వప్నాంతరతన్మయత్వంలో ఉన్నట్టున్నాడు.

"ఈ నీళ్లు చూడండి—ఎంత ఆకుపచ్చగా ఉన్నాయో?"

"ఆ కోట నీటిలో ప్రతిఫలించడం చూడండీ"

"ఈ నీరు రుచి చూడండి" ఏమేమో సరస్వతి అంటూంటే వింటూ మందస్మితవదనంతో, చూపులతో, జవాబియ్యసాగేడు.

నావ వాళ్లు తెడ్లు వేస్తూ చెప్పసాగేరు.

"ఇది అశోకుడు కట్టించిన కోట."

"ఈ ద్వారాన్ని ఔరంగజేబు మూయించేడు."

"దీని ద్వారానే అంతర్వాహిని సరస్వతి వస్తుండేదంటారు."

"ఇది ఆంజనేయస్వామి గుడి"

"ఇది రాణులు స్నానానికి వొచ్చే ద్వారం."

"అక్కడ్నుంచే రాజపరివారం సంగమాన్ని చూస్తూ వుండేవారు."

"ఇప్పుడిది మిలటరీవాళ్లకిచ్చేరు."

అతని కన్నీ లీలగా వినపడుతున్నాయి. తనూ సరస్వతీ రాజూ, రాణీలా ప్రక్క ప్రక్కగా కూర్చున్నట్టూ, ఎన్నాళ్ళుగానో పరిచితులైనట్టూ దివాస్వప్నంలో తేలుతూ, సరస్వతి బంగారపు హస్తాలో నదీజలాన్ని తోడుతూ, మధ్యమధ్య ముంగురుల్ని సర్దుతూ తనకేసి ఓరగా, అసంబంధంగా చూస్తుం తన్మయుడవసాగేడు.

ఎవరు తను? ఎవరు సరస్వతి? తను నా కుడు? ఆవిడ క్రిస్టియన్? ఏమిటీ తీర్థయాత్ర నమ్మకంలేని తను—నమ్మకం ఉండడాని ఆకారంలేని అన్యమతానికి చెంది ఆవిడా? ఇద్దరికీ పరిచయంలేదు—అసంబం యాత్రికులే!

పక్క నావలో పోతున్న బెంగాలీ ఆవి తడి నైలాన్ చీరతో కూచుని, జుత్తు గాలిలా ఆరబోసుకుంటోంది— శరత్ పాత్రలు గుర్ కొచ్చాయి తనికి.

"మీరు క్రిస్టియన్నుకదా! ఈ హిందు యాత్రాస్థలం చూడ్డానికెందుకొచ్చారు?" అన్నాడు—అడగదల్చుకొని ప్రశ్న! ఆవి రాకపోతే తనయాత్ర ఇంత ఆనందదాయ మయ్యేదా? ఏమి మాయోగాని జీవితంలో ప్రతీదానికి ఆఫెమినైన్ టచ్ లేకపో చప్పగా ఉంటుంది.

"కల్చరల్ ఇంటరెస్ట్" అంటె చప్పు విశాల నయనాలలోంచి ప్రశ్నార్థకంగ చూస్తూ:

"మీరు నా సికులమన్నారు కదా వి రెందుకొచ్చారు?" అంది కొంటె ప్రశ్న తనలోనే నవ్వుకుంటూ—సెల్కూరుమా అడ్డుపెట్టుకుంది, నవరత్నాలు రాలుతా యనేమో.

సంగమం సమీపించారు. నావవాళ్లు "ఇదుగో, ఇదే సంగమం. ఆ గంగ నీళ్లు చూడండి ఎట్లా ఉన్నాయో, ఇవుగో, ఇ చూడండి ఎట్లా పచ్చగా ఉన్నాయో" అ అరుస్తున్నారు.

"ఇక్కడ చూడండి ఎంత స్పష్టంగా కనబడుతున్నాయో" అంది సరస్వతి అత భుజంమీద చెయ్యివేస్తూ. అతను ఆమె చూడాలో సంగమాన్ని చూడాలో తెలీక తబ్బిబ్బవుతున్నాడు.

వాటర్ బాటిలిచ్చి "దీంట్లో నీళ్ళు పట్టండి" అన్నాడు. ఆమె దాన్ని తీసుకుంటే వేళ్ళు కలిశాయి. అతనికి వొళ్లు గగుర్పొడిచింది. ఆమె మామూలుగా వుంది. తనంటె అసహ్యంమాత్రం లేదనుకున్నాడు. అదే పదివేలు! మూత పె వాటర్ బాటిల్ అతనికిచ్చింది.

"ఇక్కడ చూడండి మోకాలులోతే.

"స్నానం చేస్తారా?"

"ఊహూ"

"ఏం?"

ఎంతో విచారిస్తూ అడిగేడు.

"ఏమో?" చప్పరించింది. అతనికి బ కోపంవచ్చింది. కాని ఆవిడ్నేమి చే గలడు? తనకేమీ కాదుగా? అయి మరో పదిహేను నిమిషాల్లో ఈ తీయని కరిగిపోతుంది. ఎవరిదారిన వాళ్ళుపోతా

---

గోపీ : ఒకరి తప్పులు ఒకరు చెప్పుకుంటూ ప్రవర్తన దిద్దుకోవాలని నేను రామూ అనుకున్నాము.

రఘూ : చాలా బాగుందిరా బ్రదర్ —

గోపీ : పూర్తిగా వినరా బాబూ. మీ ఆవిడ అలా విచ్చలవిడిగా తిరగటం బాగులేదురా అన్నాను. అప్పట్నించి అయిదేళ్లయింది మాట్లాడి వాడు నాతో—

---

# ★ అసంబంధ యాత్రికులు ★

నావదిగేక ఎవరికెవరూ కారు.

నావవాళ్లంతమడుగితే అంతా ఇచ్చి ఆ నావలో అక్కడే ఉండిపోతేనో అనుకున్నాడు. 'ఆవిడ వెళ్ళిపోకుండా వుంటుందా? నా పిచ్చిగాని' అని తిరిగి సముదాయించుకున్నాడు.

'ఎప్పటికీ వెన్నెల రాత్రి మంచిది కాదోయ్' అనే హిందీపాట అతనికి గుర్తొచ్చింది. ఆశిస్తాంకాని ఎప్పటికీ అమితమైన ఆనందాన్నీ, అందాన్నీ భరించగలమా విసుగురాదూ? తేనెనొక్కి కూడా వస్తుందేమో? తాజ్ మహల్లో కాపరం పెడితే ఆనందం కలుగుతుందా? అజంతా ఎల్లోరాల్లో నివసిస్తే అనుభూతి శాశ్వతంగా ఉంటుందా? నయాగారా జలపాతం దగ్గరుంటే ఆ చప్పుడుకు మెదడు బద్దలుకాదూ? అట్లాగే ఎప్పటికీ వెన్నెలలో వుంటే చీకటి కోసం పరుగు లెడతామేమో!— అంతెందుకూ? 'వెలుగులో నీ మీద నిలుపలేనే మనసు' అనలేదూ నాయుడుబావ.

ఏదో నావవొచ్చి ప్రక్కనే ఆగింది. అక్కడ కొబ్బరికాయలూ, పూవులూ అర్పించి, బ్రాహ్మడికి ఒప్పూట భోజనానికి సంభావన ఇవ్వాలిట. అతను పర్సు తీసి ఇచ్చేడు. బ్రాహ్మడు ఆమెని కూడా చెయ్యి పట్టమన్నాడు. బొట్టు పెట్టుకోమన్నాడు. నావవాళ్ళు అంతే. కొబ్బరికాయ ఇవ్వమన్నారు. ఆవిడకి ఇష్టంలేదు. వాళ్లు ఆవిడ్ని అతని పత్నిగా భావించినట్లున్నారు, పాపం. వాళ్ళంతా ఆవిడ్ని బలవంతం చేస్తుంటే అతను లోలోపల సంతోషిస్తున్నాడు, ఏమీ అనలేదు. ఆవిడ పట్టుదల చూసి "రోమ్‌లో వున్నప్పుడు రోమన్లలా వుండాలి" అన్నాడు కొంత సేపయ్యాక.

"నాకు నమ్మకంలేదు."

"ఉండక్కర్లేదు; బుల్గానిన్, కృశ్చేవ్‌లు ఇండియా వొచ్చినప్పుడు బొట్లు పెట్టుకోలేదూ? నాకుమాత్రం నమ్మకం వుందేమిటి?"

"మీరు హిందువులుగా?"

"కాను."

"మరి?"

"ప్రపంచ పౌరుణ్ని."

చిరునవ్వు నవ్వింది. సంగమంలోపడి పరావర్తనం చెందుతున్న సూర్యరశ్మిలో తెల్లని పల్వరస ముత్యాల్లా మెరవసాగింది.

"మీరు చెబుతున్నారు, కనుక..." అని కొబ్బరికాయ పువ్వులు ఇచ్చింది. అతడేవో మంత్రాలు అనమన్నాడు. అనకండా నవ్వింది. బ్రాహ్మడికి కోపంవచ్చి, "నవ్వరాదు" అంటూ ఏమేమో అన్నాడు. కొంత నీరు తీసుకుని పాపిడి వెంబడి రాసుకుంది హిందూ స్త్రీలా.

"ఇంక పోనియ్యండి" అంది—చిరుకోపంతో.

"అట్లా కోట ప్రక్కగా పోనియ్యండి" అన్నాడు హరికృష్ణ.

తిరుగు ప్రయాణంలో సరస్వతీ ఫిలిప్సుగారి చురుకుతనం మందగించింది–ఇష్టంలేని పని చేయవల్సి వచ్చిన మూలానగావును.

"అంతా మూఢనమ్మకాలు!" అని గొణిగింది, పిండాల రేవువద్ద చేస్తున్న లెక్కలేని నావల్నీ, వందలాది జనాన్నీ చూస్తూ.

"అవును" అని, మరోక్షణం తర్వాత, "ఈ అణుయుగంలో సర్వమానవ సమానత్వమే ఏకైక మతంగాని, ఇతర మతాలలోనూ, కులాలలోనూ అమితమైన నమ్మకం కలిగివుండడమూ మూఢనమ్మకం క్రిందికే వస్తుందేమో?" అన్నాడు — ఆవిడన్నదాన్ని జనరలైజ్ చేస్తున్నట్టు.

అతని మొహంలోకి సూటిగా చూస్తూ ఉండిపోయింది ఓ క్షణం—పరీక్షించడానికో, అతని వాక్యంలోని సత్యాన్ని అవగాహన చేసుకోవడానికో, బొట్టు పెట్టుకొని హైందవ స్త్రీలా, గొప్ప గృహిణిలావున్న ఆమెని చూస్తు ముగ్ధుడవసాగేడు - అతను.

రేవు చేరేముందు వేనిటీ బేగ్‌లోని చిన్న అద్దాన్ని తీసుకుని, బొట్టు దులిపేసి పౌడరు రాసుకుంది. అట్లావున్నా అతనికి అందంగానే కనపడింది, ఆమె ముఖం—కళంకం లేని చంద్రబింబంలా.

"తర్వాత ప్రయాణం ఎక్కడికి?"

"పూనా."

"కాశీ రారా?"

"ఇక్కడ్నించే వొచ్చాను."

అతని హృదయం చివుక్కుమంది. మధురానుభూతిని పొడిగిద్దామనుకున్న కోరిక పగటి కలై పోయింది - నిజానికి తనూ తిరుగుప్రయాణికుడే!

రేవులో దిగుతుంటే అతని హృదయం భారమైనట్టు తోచింది - స్వర్గాన్నుంచి ఎవరో శపించి, భూలోకంలోకి పంపిస్తున్నట్టు.

మెట్లెక్కేటప్పుడు బాగా అలిసిపోయింది. మధ్యలో "ఎక్కేటప్పుడు ఇంత కష్టమౌతుందేం?" అంది.

"భూమ్యాకర్షణకి వ్యతిరేకంగా పోవాలిగా; చెయ్యి ఊతం ఇమ్మంటారా?"

"థాంక్స్" అంది వద్దన్నట్టు, ఒకసారి గట్టుమీద కెక్కిన తర్వాత ఆఖరిసారి మళ్ళీ యమునానదినీ, కోటనీ, సంగమాన్నీ, నావల్నీ ప్రకృతి సౌందర్యాన్నీ వీక్షించారు.

రిక్షావాడు "రండమ్మా" అన్నాడు.

టాంగావాడు "పొద్దెక్కుతోంది బాబూజీ, ఇంకా ఆనందభవన్, కమలా నెహ్రూ హాస్పిటల్, స్వరాజ్యభవన్, భరత్ముని దేవల్ ............ఏమేమో అనసాగేడు.

సరస్వతి రిక్షాఎక్కింది. అతడు వీడ్కోలు చెబుతున్నట్టుగా ఇంగ్లీషులోనే ద్వంద్వార్థం ధ్వనించేటట్టు "ఈ త్రివేణీ సంగమంవద్ద మనం కలుసుకోవడం ఆనందకర విషయం" అన్నాడు.

సరస్వతి మొదటిసారిగా సిగ్గుపడి తల వంచుకుంది. అతను నైతికజయం పొందినవాడిలా చూస్తూ, టాంగా ఎక్కేడు.

రిక్షా, టాంగాలు కదిలేయి. "గుడ్ బై" అంది రుమాలు వూపుతూ. ఆమాటలు డెక్కల చప్పుడులో కలిసిపోయేయి. "మళ్ళీ కలుసుకోవాలని ఆశిద్దాం" ఏ లోకంలో ఏ కాలంలో, ఏ రూపంలోనో? అందామనుకున్నాడు, కాని అంత సమయమూ లేదు; ధైర్యమూ లేదు. రెండు బళ్ళూ రెండు వైపులకూ పోతున్నాయి.

"బై, బై" అన్నాడు తన రుమాలు వూపుతూ - వాటర్ బాటిల్ దగ్గరికి తీసుకున్నాడు - సరస్వతి నింపిన పవిత్రోదకముంది దానిలో.

ఈ నాటికీ, ఏ నాటికి మర్చిపోలేడా సంఘటన సతీష్; అంతర్వాహిని సరస్వతే ఆ రూపంలో సాక్షాత్కరించిందని, అతని అంతరాత్మఘోషిస్తోంటే అవునేమో ననిపిస్తుందతనికి - వింతగా మూఢనమ్మకాల్లో నమ్మకంలేని నాస్తికుడైనప్పటికీ.

'అసంబంధ యాత్రీకులం' అని నవ్వుకుంటాడు తనలో తానే - ఆ సంఘటన గుర్తుకొచ్చినప్పుడల్లా - జీవితంలో చివరికి మిగిలేది ఈ ఆనందపుటనుభూతుల పాత జ్ఞాపకాల తుంపరల పరంపరలే నేమో? ★

# అనుమాన పిశాచం

కె. సువర్ణముఖి

శోభనం గదిలో అడుగుపెట్టిన మధు దృష్టి గది నలుమూలలకి పోయింది. స్ప్రింగ్ కాట్, సోఫా సెట్, బీరువా, మూలల్లో పూలకూజాలూ, ఒక ప్రక్క డ్రెసింగ్ టేబుల్ వున్న ఆ గది, సంపన్నతను, ఆధునికతను వెల్లడిస్తోంది. స్ప్రింగ్ కాట్ మీద వున్న మెత్తటి పరుపుపై తెల్లగుప్పటిపైన మల్లెపూలు, టీపాయ్ మీద రకరకాల ఫలహారాలు, పండ్లు. ఫ్లాస్కు, ఒక జత కప్పు సాసర్లు, వెండి మరచెంబులో మంచినీళ్ళు ఉన్నాయి. మధు మెల్లిగా కిటికీ దగ్గరకు వెళ్ళాడు. బయటంతా పుచ్చపూవులా వెన్నెల. అక్కడ వుండే పూలచెట్లలో నుంచి వస్తున్న సువాసనను మోసుకువస్తున్న చల్లటిగాలి మధుకి హాయిగొల్పి మనసును ఎక్కడికో లాక్కుపోయింది

తమ ఊళ్ళో కాలేజి లేనందువల్ల మరో ఊళ్ళో ఉంటూ, ఆనర్స్ చదవాల్సి వచ్చింది. ఆనర్స్ ప్యాసయి సంవత్సరం అయింది. ప్యాసవగానే లెక్చరర్ ఉద్యోగం దొరికింది. తన అదృష్టానికి తానే పొంగిపోయాడు మధు. ఎంతమంది ఉద్యోగాలు దొరక్క అవస్థపడుతున్నారో మధుకి తెలుసు కనుకనే తను అదృష్టవంతుడనని అనుకోవటంలో తప్పు లేదనుకున్నాడు. ఆనర్స్ చదివేటప్పుడే పెళ్ళి సంబంధాలు వచ్చాయి. మధు రూపవంతుడు, గుణవంతుడు కనుక, ఎందరో ధనవంతులైన కన్యాదాతలు వరకట్నవిషయం వచ్చింది కాబట్టి ఫారిన్‌కి పంపించి పై చదువు కయ్యే ఖర్చు తాము పెట్టుకుంటామని ఆశ చూపించారు. దానితో సాధారణ కుటుంబీకుడు, రిటైర్ తాసిల్దారయిన మధు తండ్రి బ్రహ్మయ్య, తల్లి వెంకాయమ్మ మెత్తబడి తమ ఏకైక పుత్రుడైన మధుతో పండుగకు యింటికి వచ్చినప్పుడు ఆ సంబంధాల విషయం చెప్పి ఏ అమ్మాయి నచ్చితే ఆ అమ్మాయిని చేసుకోమని అన్నారు. మధుకి పెండ్లి చేసుకున్నందువలన సుఖమేమిటో అర్థంకాలేదు. అదే వయసుగల తన స్నేహితులందరు పెళ్ళిళ్ళు చేసుకొని సంసారాలతో ఉన్నారు. కాని వాళ్ళందరు పొందుతున్న సుఖమేమిటి? ఇంట్లో ఎప్పుడూ జీతం చాలదనీ, పిల్లల్ని హాస్పిటల్‌కు తీసుకొని వెళ్ళమనీ ఇల్లాలు గోల పెడితే—అక్కడ ఆఫీసులో ఆఫీసరు ఆశీర్వాదాలతో ఎంతో బాధపడుతున్నారు చాలీచాలని జీతంతో! ఇంకా యిద్దరు స్నేహితులు చదువుతున్న ఫేషనబుల్ భార్యలు కావాలని పెళ్ళిళ్ళు చేసుకొని, సగం జీతం వాళ్ళ టాయ్‌లెట్ సామాన్లకి, సినిమాలకి అయితే మిగతా సగంలో హోటలు భోజనానికి సరిపెట్టుకొని చేతిలో కానీ లేక అప్పులపాలయి ఎందుకు చేసుకున్నామురా భగవంతుడా అని అఘోరించటం లేదూ? తను పెళ్ళి చేసుకొని చేతులారా కష్టాలు తెచ్చిపెట్టుకో కూడదని నిశ్చయించుకొని తల్లిదండ్రులతో తన అభిప్రాయాన్ని తెలియపరచి పండు(గ) వెళ్ళగానే ఊరికి వెళ్ళిపోయాడు. బ్రహ్మ(య్య) తన కొడుకు అభిప్రాయం తెలుసుకొనో లే(క) తనకే ఆ సంబంధాలు ఇష్టంలేకనో ఊరు(కు)కున్నాడు.

ఒకరోజున బ్రహ్మయ్య చిన్ననా(టి) స్నేహితుడు వకీలు చంద్రయ్య కనిపిం(చి) ఫలానా ఊళ్ళో కుటుంబరావుగారు అ(ని) రిటైర్డ్ జడ్జి పెద్దకూతురు లతను మధుకి చే(సు)కుంటే అన్నివిధాల బాగుంటుందని చె(ప్పి) బ్రహ్మయ్యను కుటుంబరావుగారి ఊ(రు)



# అనుమాన పిశాచం

తీసుకొనివెళ్ళారు. బ్రహ్మయ్య పిల్లను చూడగానే మధుకి తగినపిల్ల అనుకున్నాడు. మెట్రిక్యులేషన్ కాన్వెంటులో చదివి పాసయింది. పిల్లకూడా అందమయినదే. కుటుంబరావుగారు రిటైర్డ్ జడ్జి కాబట్టి కొస్త ఉన్నవాడు. తాంబూలాలు పుచ్చుకొని, ముహూర్తాలు పెట్టుకు చక్కా వచ్చాడు బ్రహ్మయ్య.

వెంకాయమ్మ బ్రహ్మయ్య చెప్పిందంతా విని, భర్త తొందరపాటుకు ఆశ్చర్యపోయి, 'మధు అసలు పెళ్ళే చేసుకోనని అంటున్నాడే ముహూర్తాలు కూడా పెట్టుకు వచ్చేశారు. కొడుకు ఒప్పుకుంటాడో ఒప్పుకోడో' అని భయపడింది. అంతమంచి సంబంధం తమకెక్కడా దొరకదు. మాడొంతులు ఒప్పుకుంటాడు. ఒకవేళ ఒప్పుకోకపోయినట్లయితే ఒప్పించవచ్చని ధైర్యం చెప్పాడు బ్రహ్మయ్య భార్యకి.

ఇంటికి సున్నాలు వేయించటం ఇంటి ముందు పందిరి వేయించటం మొదలైన పెండ్లి పనులలో మునిగారు బ్రహ్మయ్య, వెంకాయమ్మాను. పెండ్లి ముహూర్తం దగ్గర పడుతోంది. పెండ్లి ఎల్లుండనగా కొడుక్కి తక్షణం బయలుదేరి రమ్మని కారణం ఏమీ తెలియపర్చకుండా టెలిగ్రామ్ యిచ్చారు. వెంకాయమ్మ కోడలు రాబోతోందని ఒకపక్క సంతోషపడుతున్నా, ఒకపక్క కొడుకు పెళ్ళికి ఒప్పుకోడేమోనన్న భయంతో గిజగిజలాడిపోయింది.

కారణంలేని టెలిగ్రామ్ చూచుకొన్న మధుకి ఏమీ అర్థంకాలేదు. తల్లికి అప్పుడప్పుడు గుండెనొప్పి రావటం అలవాటు. అటువంటిదేమైనా జరిగిందేమోనని వెంటనే బయలుదేరి మర్నాటి ఉదయానికల్లా ఇంటి ముందు వాలాడు. గుమ్మం ముందు పందిరి చూచి కొంచెం ఆశ్చర్యపోయి లోపలికివెళ్ళి తల్లితండ్రుల ముసి ముసి నవ్వులు చూచి మరీ ఆశ్చర్యపోయి ఎందుకు టెలిగ్రామ్ యిచ్చారన్నాడు. మెల్లిగా బ్రహ్మయ్య విషయం అంతా చెప్పేటప్పటికి మధు 'నేనసలు పెళ్ళే చేసుకోనని యిదివరకే చెప్పాను. అయినా నన్నడక్కుండా ఎందుకు ముహూర్తాలు పెట్టుకున్నారు? డబ్బుకాశపడి యింతపని చేశారన్నమాట. నేను పెళ్ళిచేసుకోను' అని ఖచ్చితంగా చెప్పేశాడు.

బ్రహ్మయ్య కోపంతో 'ఏమిటోయ్ చేసుకోకపోవటం, అన్నివిధాలా బాగున్నదని కుదిరిస్తే ఇదా నీవు మాట్లాడేది? ఏమైనా

సరే దీనికి ఒప్పుకొని తీరాల్సిందే తిరుగు లేదని గబగబా బయటికి వెళ్ళిపోయాడు. ఇద్దరి సంభాషణా విన్న వెంకాయమ్మ, కొడుకును ఒప్పించే ఉద్దేశ్యంతో 'నిన్నడక్కుండా ముహూర్తాలు పెట్టుకోవటం మాది తప్పే, అంత సాహసించటానికి కారణం సంబంధం అన్నివిధాలా మంచిది. ఆ అమ్మాయిని చూస్తే వద్దనవని మీ నాన్నగారు అన్నారు. నీవిట్లా అంటే ఎట్లా మధూ? మా అచ్చట్లు ముచ్చట్లు నీవల్లే తీరాలి' అని కంటనీరు పెట్టుకొనేసరికి మధు తట్టుకోలేకపోయాడు.

'సరే మీ యిష్టప్రకారమే పెండ్లి జరుగనివ్వండి. మీ సంతోషానికి నేనెందుకు కడ్డుపడాలి" అన్న మధు మాటలకు వెంకాయమ్మ, అప్పుడే తిరిగి లోపలికి వస్తున్న బ్రహ్మయ్య ఒక్కసారిగా "నిజమేనా మధూ" అన్నారు.

'ముమ్మాటికీ నిజమే. ఇదిగో నేనిప్పుడే విషయం తెలియపరుస్తూ వారం రోజులు సెలవు కావాలని ప్రిన్సిపాల్ కి ఉత్తరం వ్రాసివస్తా'నంటూ బయటికి వెళ్ళాడు.

బ్రహ్మయ్య నాల్గురోజులు ముందుగానే శుభలేఖలు పంపటంవలన ఆ సాయంత్రానికే రావలసినవాళ్ళందరూ వచ్చారు. మర్నాడుదయం పెండ్లికి వెళ్ళారు. మర్నాడు తెల్లవారుఝామున పెండ్లి సలక్షణంగా జరిగిపోయింది. కుటుంబరావుగారు కొంత డబ్బు కలవారేకనుక పెండ్లి ఘనంగానే జరిపారు. పెళ్లికూతురు చదువుకున్నపిల్లయినా ఎంతో సిగ్గుతో తల ఎత్తలేదు.

రెండురోజులక్రితంవరకు పెళ్ళి చేసుకోకూడదన్న పట్టుదల, తరువాత పెళ్ళికి ఒప్పుదల, చివరికి పెండ్లయిన కొద్దిగంటలలోనే కొత్తపరిస్థితులకుతలఒగ్గి దాంపత్యజీవితంలో వుండే మాధుర్యాన్ని చవిచూడాలన్న కోరిక కలగటం—ఈవిధంగా తన ఆశయాలు త్వరత్వరగా మారటం మధుని ఆశ్చర్యపరిచింది. గాజులచప్పుడు ఆలోచనలోనున్న మధుని మేల్కొలిపింది. ఎవరో పెద్దామె 'ఊఁ వెళ్ళవే' అనడం, లత కదలకపోతే లోపలికి నెట్టి తలుపు గొళ్లెం వేయటం నిముషంలో జరిగిపోయాయి.

అంతవరకు లత రాలేదని తపించిపోయిన మధుకి లత వచ్చినతరువాత ఏమని మాట్లాడిందాలో అర్థంకాక తికమకపడుతూ అటూయిటూ పచార్లుచేసి మెల్లిగా వెళ్ళి తలుపు గడియవేసి లతదగ్గరకు వచ్చి, గడ్డం పైకెత్తి చూచాడు. వంటినిండా నగలుపెట్టి మల్లెపూలతో జడకుట్టారు. లత భర్త తనవైపు తదేకధ్యానంతో చూస్తుంటే ఏదోమాదిరయి గడ్డంకింద చెయ్యి పక్కకినెట్టి సిగ్గుతో తల దించేసుకుంది. అక్కడ సోఫాలో కూర్చుందాం రమ్మని చెయ్యిపట్టుకుని తీసుకొనివచ్చి తను కూర్చుని ఆమెనుకూడ కూర్చోమని అన్నాడు. లతకూర్చోలేదు. ఇంతలో మధుకి మంచినీళ్ళు కావలసివుంటాన "కొంచెం మంచినీళ్ళివ్వ"ని అడిగాడు. ముందు ఇది తినమని ఒకలడ్డు తీసియిచ్చింది. మధు సగం తీసుకొని మిగతాసగం లతకిచ్చి తినమన్నాడు. లతతను తినకుండా కొంచంసేపుండి మధు నోట్లో కుక్కేసరికి మధు ఉక్కిరిబిక్కిరై అతికష్టం మీద మింగి మంచినీళ్ళు కావాలని సైగచేశాడు. మంచినీళ్లకోసం వెళ్లినలతఅక్కడే నిలబడి చేతిగాజులు, మెళ్ళో గొలుసులు ఒకటొకటి మధు మీదికి విసురుతోంటే ఆశ్చర్యపోయి చూస్తూ ఉండిపోయాడు. తరువాత జడమీదనున్న పూలన్నీ పీక్కొని విసిరేస్తూ, తలలో పెట్టుకున్న పెద్దమాలను లాగి కొంచం కొంచం రెండుచేతులకీ కట్టుకొని అంతవరకు కొరికి మిగతాది దండగా ముడివేసి మెళ్ళోవేసుకొని, దగ్గరలోనుండే ఫ్లవర్ వేస్ లోని కొన్నిపూలులాగి రెండుచెవుల్లో పెట్టుకొని, జుట్టు విరబోసుకొని అద్దంలో చూచుకుంటూ గెంతటం మొదలుపెట్టింది. ఆమె ప్రవర్తన ఏమీ అర్థంకాక విస్తుపోయి చూస్తూ మంచినీళ్ళ సంగతి పూరిగా మరచిపోయాడు మధు. లత గంతులేస్తూ మధు దగ్గరికివచ్చి నిల్చొని కళ్ళు పెద్దవిచేసి ఉరిమి చూస్తూంటే, ఆ చూపుతీవ్రతకు తాళలేక మధు ఆమెను మాటల్లోకి దింపుదామని 'నీకు హవాయ్ డాన్సు అంటే యిష్టంగా కనబడుతోందే' అన్నాడు.

దానికి సమాధానంగా 'హా హి హీ' అని వికృతంగా నవ్వింది లత. మధు వెన్నెముక కలుక్కుమంది ఆ నవ్వుకు. ఈ కాలపు ఆడపిల్లలికి ఆరకంనవ్వు ఫేషనో లేక తనుమాట్లాడినదాంట్లో ఉచ్చారణ తప్పు పట్టిందనో (లత కాన్వెంటులో చదివిందికాబట్టి) మధు మళ్ళీ నోటవెంట ఇంగ్లీషుమాటరానీయలేదు. సోఫాలో తను ఓ పక్కగా ఒదిగికూర్చుని చోటు చూపిస్తూ 'రా. ఇలా కూర్చో' అన్నాడు బెదురుతూనే. అదీ అనడంతోటే ఒక్క ఎగురు ఎగిరి సోఫాచేతిమీద కూర్చుని కాళ్ళతో సీటుని తన్నడం మొదలుపెట్టింది.

అట్లా తన్నుతూ తన్ని ఎక్కడ పల్టీకొట్టిస్తుందోనని భయమేసి, ధోరణి మార్పించుదామని ఉపాయంకోసం ఆలోచిస్తూండగా మంచినీళ్ల సంగతి జ్ఞాపకంవచ్చి 'లతా కొంచం మంచి నీళ్ళు తెచ్చిపెడతావా గొంతుకారిపోతూంది. నీకెంతైనా పుణ్యముంటుంద'న్నాడు.

మళ్ళీగట్టిగా నవ్వుతూ వెంట్రుకలు మొహంమీదకి పీక్కోటం మొదలుపెట్టింది.

'అదేమిటి అలా పీక్కుంటావ నాతో దోబూచులాడుతున్నావా? నేనేం బుల్లి అబ్బాయిని కాదుసుమీ' అన్నాడు ఉండబట్టలేక.

'హా హి హీ! 'హా హి హీ, 'హా హిహా' అని యింకా కొంచం గట్టిగ నవ్వుతూ మధు పొట్టమీద వేలుతో గుచ్చింది. అప్లికాషతో పొడిచినట్లయింది పాపం మధుకి. ఆడవాళ్ల చేతులు మృదువుగాఉంటాయని ఎన్నోకథల్లో చదివాడు. కాని ఇదేం మృదువుగాలేదు సరిగదా గునపంతో గుచ్చినట్లయిందని అనుకుంటూఉంటే జెట్ ప్లేన్ మోస్తరు ఒక ఆలోచన దూసుకుపోగా పులిగోళ్లలే గోళ్లు పెంచుకోటం ఈ కాలపు ఆడపిల్లల ఫేషనని గ్రహించినవాడై తన మతిమరుపును నిందించుకొని జరిగినది ఖాతరు చేయక తనూ నవ్వటం మొదలుపెట్టాడు.

ఇక నేం శ్రుతిమించి రాగానపడింది. మధు నవ్వినకొద్దీ తనూ నవ్వుతూ పొట్టమీద గుచ్చటమే కాకుండా మొహంమీద చేతుల మీదకూడ రక్కటం మొదలుపెట్టింది.

'ఏయ్, ఇదిగో నీవు మనిషివా దెయ్యానివా' అన్నాడు కోపంగా, దెయ్యాలంటే గట్టినమ్మకం లేకపోయినా భయమున్న మధు 'హ్హుఁ! ఏమన్నావ్' అన్నట్లుగా సోఫాచేతిమీద కూర్చున్నదల్లా దభీమని దూకి మధుపరు లాగటం మొదలుపెట్టింది. మధు గజగజవణికిపోతూనే ఆమె చేతుల్లోంచి తప్పించుకోటానికి పెనుగులాడటం మొదలుపెట్టాడు. అంతతేలిగ్గా పట్టు వదిలించుకోలేకపోయాడు. ఎట్లాగో బలవంతాన్ని అవతలికితోసి తలుపు దగ్గరికి పరుగెత్తాడు. లత షర్టును పట్టుకు లాగటంతో షర్టు చిరిగింది. ప్రాణాలతో బయటపడితే చాలనుకొని మధు తలుపు దగ్గిరికి వెళ్ళి గడియతీసి తలుపు లాగబోతే అవతల గొళ్ళెంవేసి ఉండటం వలన రాలేదు. పాత అలవాట్లకి ఎంతైనా తిట్టుకొని కసితీరా గట్టిగ గుంజుతోంటే ఫలహారాలు, వాటిపళ్లాలు, ఫ్లాస్కు, వెండి మరచెంబుతో సహా మధుమీదికి అస్త్రాలుగా దూకాయి. ఎట్లాగైతేం, కొంచెంసేపటి! బయటవేసిన గొళ్ళెం వూడి తలుపు తెరచుకొంది.

(61-వ పేజీ చూడండి)

# లంకె బిందెలు

బొమ్మలకథ 3

...రాజుకి అపాయం జరగలేదుకదా!

జీపుకారు దీపాల వెలుతురులో వెతికినా ఏమీ కానబడలేదు

...చెట్టుకి జార బడ్డాడు

వెంటనే చెట్టువెనక నించిఒక చెయ్యి వచ్చి రెడ్డిడొక్కలో పొడిచింది

రెడ్డి ముందుకు తూలేలోగా అతని తలమీద బలంగా కర్రదెబ్బపడింది

హఠాత్తుగా 'ఎవరక్కడ' అన్న కేక వినబడి — దెబ్బతీసిన ఆ ముసుగు మనిషి చీకట్లో కలిసి పోయాడు

ఆ కేకవేసినాయన పక్కవూరి పోస్టుమాస్టరు అవధాన్లు పొరుగూరినుంచి తిరిగి వస్తున్నాడు రెడ్డిని మెల్లిగా లేవదీసి —

ఇంకా నయం దెబ్బలు అపాయకరంగా లేవు- ఎవరో పాపం!

జీపుదాకా తీసికెళ్ళేలోగా రెడ్డికి తెలివి వచ్చింది

అవధానికి, రెడ్డి జరిగిందంతా చెప్పాడు

ముందు వూళ్ళోకి పదండి మా ఇంట్లో కాస్త విశ్రాంతి తీసుకుని కర్తవ్యం ఆలోచిద్దాం

అవధాని ఇంట్లో—

ఇందులో ఆశ్చర్యం లేదు అనుకుంటున్నాను- ఎవడో మంత్రగాడు వూళ్ళో దిగాడు వారం రోజుల క్రితం

అయినా మనమూ అంజనంవేసి చూదాం - మా మిత్రుడి ఆచూకీ తెలుస్తుందేమో—

మా వాడు వూరి చివర చిన్నబ్బాయి గారి పాడింట్లో బందీగా వున్నాడు - మనలోకంలో లేడు - అతడి మీద ఏదో ప్రయోగం జరుగుతున్నట్లు అనుమానంగా వుంది -

అరె! మారాజుకి ప్రాణాపాయం......

చెప్పలేం - పదండి - చూదాం

# తెలుగు వెలుగులు-10



"మైజో కర్హాహుం వహీ మై విచార్ హోతా హై మైహీకర్తా హుంజో మేరీ? విచార్ హోతా హై" అన్నాడు ఒక రాజకీయ వేత్త.

అయితే ఈ రాజకీయ వేత్త లందరికీ ఒక జబ్బున్నది. అది ఆశ్రితపక్షపాతం. శ్రీ కల్లూరి చంద్రమౌళి గారికి ఇది కొ స్త హెచ్చు పాళంలో ఉన్నది. అంతే కాకుండా ఆయనకు ఆగ్రహం వచ్చినా అనుగ్రహం వచ్చినా ప్రమాదమే. తనకి తగిలేదీ తెలియదు, ఇతరులకు తగిలేది తెలియదు.

అయితే చంద్రమౌళి గారు కొంత వేదాంతి. అందువల్ల కష్టం వచ్చినా సుఖం వచ్చినా జయం వచ్చినా అపజయం వచ్చినా, కొంతమంది నాయకులవలె వీధిలో బడి యాగీ చేయక రెంటినీ తనలో సమానంగా ఇముడ్చుకుంటాడు, ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా పదవిఉన్నా లేకపోయినా కాంగ్రెసునే అంటిపెట్టుకుని ఉన్నారు. ఈ మధ్య కొంత మంది కాంగ్రెసును వదిలిపోయినపుడు, మీరు కూడా వెళుతారా అని ఒక మిత్రుడు అడుగగా మద్యనిషేధం కూడదన్న వారితో ఎలా చేరుతారోయి అన్నాడు చంద్రమౌళి గారు. స్కాట్ లాండులో వ్యవసాయ విద్యాపట్టభద్రుడైనా ఆయనలో పాశ్చాత్య వాసన ఎక్కడా కనుపడదు. నికార్సైన తెలుగువాడుగా కనపడుతాడు.

1926 లో కాంగ్రెసులో చేరి అన్ని జాతీయోద్యమాలలోను జైలుకు వెళ్లారు. సమష్టి మద్రాసు రాష్ట్రంలో స్థానికపాలనాశాఖకు మంత్రిగా వున్నారు. 1954 ప్రదేశ్ కాంగ్రెసుకు కార్యదర్శి అయ్యారు. స్థానికపాలనమంత్రిగా 1950 లో పంచాయతీలచట్టం వచ్చినప్పుడు ప్రజాసంస్థలకు అధికారాలు, ఆదాయమార్గాలు ఎక్కువవుండాలని ... చారు. ప్రజాప్రతినిధి అనిపించుకున్నా, దేవాదాయమంత్రిగా ఆయన చేసినప... ధిపత్తే కాకుండా భగవంతునికూడా ... నకు కృతజ్ఞత చూపవలసి ఉన్నది. రాజ... లలో ప్రసిద్ధికెక్కినవారికి సాధార... సాహిత్యంలో ప్రవేశముండదు. కాని ... మౌళి గారలా కాదు. ఆయన వ్రాసిన ... యణ సుధాలహరి విశ్వవిద్యాలయ ... పాఠ్యగ్రంథమైనది. ఆయన "భారత ... ప్రతిభ" అనే గ్రంథం ఆయన వేదా... మావాన్ని, భారతీయ సంస్కృతిపట్ల ... వనుగల గౌరవాన్ని తెలియజేస్తున్నది. తెలుగునాడులో గుంటూరుజిల్లాకువిద్య... గంలో అగ్రస్థానంలో ఉన్నదంటే చంద్రమౌళిగారు జిల్లాబోర్డు అధ్యక్షు... ఉన్నపుడు చేసిన కృషి ఫలితమే చెప్పాలి.



## "నీవునేర్పిన విద్య"

(మొదటి బహుమతి రూ. 10)

...వేగుల వంటి స్టేషనులు పాసెంజరు ...ళ్లకి కూడా లోకువే. అక్కడ రైలు, ...ర పెట్టె ఆగేలోగా ఇంజను బయల్దేరి ...తుందనిపిస్తుంది. ఇలా ఒక రోజున, ఒక ...సలాయన పరుగున వచ్చే సరికి బండి ...జే కదిలింది. ఆయన ఎక్కబోతూ ...తేగా, అక్కడే నిలబడి పచ్చజెండా ...పిస్తున్న గార్డు గబుక్కన ఆయనకెక్క... ...కు ఆపి, "బండి కదలిన తరవాత ఎవ్వరూ ...కూడదండి" అని చెప్పి విలాసంగా ...కుంటూ, తన పెట్టె సమీపించగానే ...సులోకి ఎక్కబోయాడు. వెంటనే ముస... ...యన ఆ గార్డు చెయ్యి పట్టుకు వెనక్కి ...గేశాడు.

"బండి కదలిం తర్వాత ఎవ్వరూ ఎక్క... ...వ దేటిరిగా? మీరెందుకు ఎక్కుతారు? ...రే చేను మేస్తారా?" అంటూ అతన్ని నిలు... ...గులి పేశాడా ముసలాయన. మావాళ్లని ...క్కించి అక్కడే ఉండి ఇది విన్న నేనే ...ల్లబోయానంటే, దెబ్బతిన్న తెల్ల ...టులో నల్ల గార్డుగారు తేడా తెలియ... ...గా తెల్లబోయారంటే మీరు నమ్మకేం ...స్తారూ?

మంగళంపల్లి వెంకటరామయ్య, (పెనుగొండ).

## ముద్దు ముచ్చట

(రెండవ బహుమతి రూ. 5)

...నా ప్రొఫెసరుగారికి ముద్దుల సుద్దులు ...నప్పుడల్లా అక్కడ విషయం ఆపి అంగు... ...సుదీర్ఘంగా ఉపన్యసించడం అంటే ...యిష్టం. ఈ ధోరణి మా క్లాసులోని ...మ్మాయిలకూ సుతరామూ నచ్చలేదు. ...ళ్లు ఇద్దరే ఉండడంవల్ల కావచ్చు. ...ల్లు పాపం సిగ్గుతో తల వంచుకుని ...నేవారు. ఒకరోజున ప్రొఫెసరుగారు ...లో ప్రేమఘట్టం రాగానే, అక్కడి ...పుడేసి దేశదేశాలలో ముద్దులు గురించి చర్చ ఆరంభించారు. "నవనాగరికుల మను కునే మనకన్న అనాగరికులని పేరుబడ్డ ఆఫ్రికన్లకే ముద్దు విషయం బాగా తెలుసు. వారు పెట్టుకునే ముద్దు చాలా ఇఫెక్టివ్‌గా ఉంటుంది..." అంతలో క్లాసులో అమ్మాయిలిద్దరూ గభాలున లేచి పుస్తకాలు పట్టుకుని బయలుదేరారు. 'అదేమిటి? ఎక్కడికి?' అన్నారు ప్రొ॥ గారు.

"ఆఫ్రికాకి" అని అబ్బాయిలొక్కసారిగా జవాబిచ్చారు. అంతే. అమ్మాయిలిద్దరూ వారి సీట్లకు అంటుకపోయారు.

'శంకరి దేవి', (బందరు).

## కపిత్థాకారం భూగోళం....

(రెండవ బహుమతి రూ. 5)

మాయింట్లో పెంపుడుపిల్లి పోరు ఎక్కువై దాన్ని వదించుకోవాలని తీర్మానించుకున్నాము. మాయింట్లోనే కాక ఇరుగు పొరుగిళ్లల్లో కూడా దొంగతిళ్ళు ఆరంభించింది. మా పనిమనిషి కచ్చి దూరంగా వదిలేయమన్నాం కాని ఎన్నిసార్లు ఎక్కడ వదలినా తిరిగి తిరిగి మాయింటికి చేరుకునేది. ఇక నిదకాదు పని అని చెప్పి మా తమ్ముడు దాన్ని తీసుకుని రాజమండ్రి నుంచి గోదావరి స్టేషనుకు వెళ్ళి రాత్రి 7 గంటలకు తిరిగి వచ్చాడు. హమ్మయ్య పీడా విరగడైంది అంటూ. నాకు మనసు ఎలాగో అయి, ఎక్కడ వదిలేవురా పాపం అన్నాను.

"ఆంజనేయస్వామి గుడివద్ద వదుల్దామని పోతూంటే, మా స్నేహితుడు ప్రసాదు కనబడి 'అరె కుచ్చుతోక పిల్లి. ఎంత బాగుంది. నాకివ్వరా పెంచుకుంటాను' అని తీసుకున్నాడు" అని చెప్పాడు మా తమ్ముడు.

నాతల గిర్రున తిరిగింది. ఆ ప్రసాదు అనేవాడి యిల్లు మా వీధిలోనే. మాకు నాలుగో యిల్లే. మర్నాడుదయమే మా పిల్లి తల్లి మ్యావ్ మ్యావ్ మంటూ శుభోదయం పలికింది మాకందరకు.

అళఘు హరిప్రియ, (చెరుకువాడ.)

## ముదమూ ఆముదమూ

(రెండవ బహుమతి రూ. 5)

నా చిన్ననాటి ముచ్చట. సెకండుఫారం కాబోలు చదువుతున్నాను. లెక్కప్రకారం ఆర్నెల్లకోసారి చేసినట్లే ఆసారీ మాయింట్లో చిన్నా పెద్దా అందరూ కుట్రచేసి నన్ను భయపెట్టి, బ్రతిమాలి, ఆశపెట్టి, బెల్లించి ఆముదం తాగించాలని ఓ ఆదివారం మా అమ్మగారి అధ్యక్షతన ఉదయమే సభ జరిపారు. నేను ఎలాగైనా తప్పించుకోవాలని ఆలోచనచేసి చివరకు ఒక ఎత్తు వేశాను.

ఏమీ ఎరగనట్టు పుస్తకాలు పట్టుకుని ఆ సభలోకి వెళ్ళి అన్నట్లు ఇవాళ ఇంగ్లీషు మాష్టారు ప్రైవేటు క్లాసు పెట్టారు. టైమైంది వెళ్తున్నాను అన్నాను. మా అమ్మ ఏదో చెప్పేలోపలనే, నాన్నగారు కలగచేసుకొని వాణ్ణి వెళ్ళనీ ఆముదానికేం ఇంకోరోజు తాగుతాడు అన్నారు.

నేను వీధిలోకి వచ్చాను గాని ఏమి చెయ్యాలి? నిజంగా క్లాసులేదు గదా. తిన్నగా మా నేస్తం గోపాలం ఇంటికి వెళ్ళాను. లోపల అడుగు పెట్టానో లేదో వాళ్ల నాన్నగారు నన్ను చూసి, చూడవోయ్ మా గోపాలం ఆముదం తాగనని మారాం చేస్తున్నాడు - నీవూ ఇలాగే చేస్తావా? అన్నారు.

నేను చెయ్యనని బుద్ధిమంతుడిలా బుర్ర ఊపాను. అబద్దాలండీ వీడూ తాగడు. ఇపుడు తాగమనండి చూదాం అన్నాడు గోపాలం ఉక్రోషంగా. అప్పుడు నా పరువుకు భంగం కలుగుతుందని భయపడి ఇక చేసేదిలేక అక్కడున్న ఆముదం గబుక్కన తాగేసి ఆముదం తాగినవాడి ముఖం పెట్టి నిలబడ్డాను. గోపాలం నాన్నగారు నన్ను మెచ్చుకోవడం లీలగా వినిపించింది. కొంతలో కొంతగా ఆముదము ముదము కలిగించిన సందర్భం అదే తొలిసారీ ఆఖరుసారీను. అదేనా ఐదు నిమిషాలే ఎందుకంటే ఆ తరవాత ఇంటికి వెళ్లి మా స్నేహవాళ్ళంతా పెసరట్లు టిఫిన్ చేసుకుంటున్నారు.

కె. ఎం. జయవర్మ, (కాకినాడ.)



# నవరాగం

**వేటూరి సుందరరామమూర్తి**

(గతవారం తరువాయి)

రెండో కంటికి తెలియకుండా అనుకున్న ప్రకారం ప్రశాంత ప్రపంచంలో పల్నాటి సీమలో మాచెర్ల స్టేషన్‌లో రైలు దిగాడు సంగీత దర్శకుడు రఘూ. అతనితో పాటు సాయంగా ప్రక్క వాద్యం పద్మనాభం కూడా వచ్చాడు. ఎర్రమట్టి ప్లాట్‌ఫారం నిండా రాలిన పండుటాకులతో పసుపు కుంకుమలు తీర్చినట్లున్నది మాచెర్ల రైల్వే స్టేషన్.

పద్మనాభం మాచెర్ల ఊరు బాగా ఎరుగున్నవాడు. అతను పల్నాటివాడు కావటం వల్లనే గబెటి వెళ్ళడానికి రఘూ కోరికపై అతను వచ్చాడు. రఘూకు కావలసిన సరంజామా కోసం అతను ఊళ్ళోకి వెడుతూ రఘూను స్టేషన్‌మాస్టర్‌కి పరిచయంచేసి అతని గదిలోనే కూర్చోబెట్టాడు.

అక్కడి ప్రజలంతా పల్లెటూరి పల్లెవాటు కట్టులో వస్తాదుల్లా ఉన్నారు. బలిష్ఠమైన ముక్కు, తీవ్రంగా ఎర్రవారుగా ఉన్న కళ్ళు, గండ్రతనం కొట్టవచ్చినట్టున్న ముఖం. గండరాళ్ళు నిలువు విగ్రహాలు. కొత్త తీరాలను చేరిన అయోమయపు బాటసారిలా రఘూ పరిసర వాతావరణం గమనిస్తూ మధ్య మధ్య పనిలో నిమగ్నుడైన స్టేషన్‌మాస్టర్ వేస్తున్న ప్రశ్నలకు సమాధానాలిస్తున్నాడు. తాను కొన్ని ప్రశ్నలు అడుగుతున్నాడు.

సాయంకాలం నాలుగు గంటలకు కారులో రఘూ, పద్మనాభం, కొత్తగా కుదిరిన వంటవాడితోను కావలసిన సరంజామాతోను బయలుదేరారు. పెట్రోలు తామే పోయించుకొని డ్రైవర్‌కు మామూలు ఇచ్చే పద్ధతి మీద స్టేషన్‌మాస్టర్ ఒక స్థానిక వర్తకుని కారు ఏర్పాటు చేయించాడు.

మాచెర్ల ఊరిలోంచి కారు పోతుండగా అక్కడ చాలా షాపులకు 'నాగార్జున సోడా షాపు', 'నాగార్జున వస్త్రాలయం', 'నాగార్జున విహార్' ఇలా బోర్డులు కనుపించాయి. తను వెళ్ళబోయే ప్రాంతం కూడా ఆ నామధేయం కలదే– నాగార్జునకొండ. అక్కడ కృష్ణవేణిపై నిర్మిస్తున్న బ్రహ్మాండమైన ప్రాజెక్టు కూడా నాగార్జున నామాంకితమే. ఒక్కసారి రఘూ నాగార్జునుని గురించి సర్వశాస్త్రాలు తెలిసినవాడనీ, సిద్ధపురుషుడనీ తాను విన్నవి జ్ఞాపకం రాగా, సంగీత శాస్త్రంలో నాగార్జునునికి ప్రవేశం ఉండేదేమో అనిపించింది. ఆ విషయం తెలిసిన వాళ్ళను ఎవరినయినా అడగాలనుకున్నాడు వీలుచిక్కినప్పుడు.

ఉత్తుంగ పర్వతశ్రేణికి రివ్వున ఎగి పోతున్న కారులోంచి అల్లంతదూరా చిత్రకారుడు రచించిన దివ్యచిత్రాలుగ శోభస్కరంగా కళ్ళను, మనస్సును సంతోష పెడుతున్న మనోహర దృశ్యాలవై చూస్తూ రఘూ– వాటి స్నేహం – ఆశ్రయ కోరి తాను ఆ ప్రపంచంలోకి అడుగుపెట్టి విషయం జ్ఞాపకం చేసుకున్నాడు. మాచె ఊరువిడచి కారు పర్వత ప్రదేశంలోకి ప్ర శించింది. మెలికలు తిరుగుతూ ఎత్తు పల్ల లతో అనంతంగా పాములా వంపులు తిరుగ తున్న దారి సవరసకన్నడ రాగప్రస్తార లాగా ఉన్నది. రాళ్ళ బాటలో నడుస్తున్న కారుచక్రాల సవ్వడి, దానితో మిళితమై కారు ఇంజన్ శబ్దం వరదలో ఏరు హో పెడుతున్నట్టుగా ఉన్నది. చెవుల్లోకి దూ కుంటున్నది ఈదురుగాలి. దూర దూరా కొన్ని పర్వతాలు శిఖల తపస్సమాధిలో మునిగిన సంయమీంద్రులవలె గంభీరముగా కనిపిస్తున్నవి. తనలో దారిగడచినకొద్దీ కల గుతున్న ఆహ్లాదంలో, రఘూకు రాగిణి చెప్ప మాటలు రూపందాల్చి ఎత్మున మిస్తున్నట్టుగ

ఉన్నాయి. భువినుంచి దివికి సశరీరంగా పయనిస్తున్నట్లు రఘూ తలపోశాడు.

'ఆకసము భూమి అంటిసలాడే' అపర వైజయంతంలో పునర్జన్మ ఎత్తినట్లు రఘూ దిగాడు. కొండపైన విహార యాత్రీకులకు వసతికల్పించే ఒక సుందర ఆరామంలో అతడు ఒక కుటీరం అద్దెకు తీసుకున్నాడు. ఏదో చెప్పరాని ఔన్నత్యం అనుభవిస్తున్న హృదయంతో రఘూ కుటీరంలో ప్రవేశించాడు. పద్మనాభం సరంజామా సర్దడంలోనూ వంటవాడు ఇతర సంబాళింపుల్లోను నిమగ్నులయ్యారు.

నిడుపాటి సరుగుచెట్లూ, విశాలమైన మైదానాలు, కొండలు, కోనలు, లోయలు, చుట్టూ పెట్టని కోటల్లాగా ఆవరించుకుని కౌగలించుకుంటున్న పర్వతశ్రేణి, మధ్య కోనల్లోంచి మలుపులు తిరిగి మలక లెత్తి పారుతూ నీలి చీనాంబరం కటిన లతాంగిలా ఒయ్యారంగా తరలిపోతున్న కృష్ణానది – ఒక్కసారి గాలి పీల్చుకునేందుకు అలా బైటికి వెళ్ళిన రఘూకు కనిపించిన సుందర దృశ్యాలు. ఇన్ని అందాలు, ఇంతఆనందం, సమృద్ధిగా ఒక్కచోట, కాలపరిమితి లేకుండా, టికెట్ కొనకుండా, తెరమీద కాక, నిజంగా అనుభవంలో సాక్షాత్కరిస్తాయని రఘు ముందెప్పుడూ అనుకోలేదు. రక్తం ఒక్కసారి ఆనందాతిరేకంతో జలజలా నాడులలో ప్రవహించింది. ఏదో అలజడిలా లోన ఆనందం ముప్పిరిగొన్నది.

బంగారువన్నెకు తిరిగిన సూర్యకాంతి. కొంచెంగా చలిగాలులు– నిటాగ్గా పొడుగ్గా ఉన్న నీడలు. పర్వతశ్రేణిమీదనుంచి సూర్యుణ్ణిచూసే తనకన్నకూడా ఇంకా పల్లంలోకి పోతున్నాడు. ఆ దృశ్యం తన్మయుడై చూశాడు రఘూ. కోలాహలంగా రకరకాల పక్షులు, పిట్టలు కేరింతలాడుతూ తమ తమ గూళ్ళకు చేరుతున్నాయి. ఆ వనీప్రదేశంలో జీవుల దైనందిన వ్యాపారానికి రాత్రి విశ్రాంతి చేరువౌతున్నట్లు రఘు గ్రహించాడు. భీమ్‌ప్లాస్‌లో ఒక్కసారి సేదతీరేలాగా ఒక్క విశాలస్వరం ఆలాపించాడు ఉత్సాహంగా. వెనుదిరిగాడు. ఆ నాదం ఒక్కటే ఆ చుట్టుపట్లనీ ఆవరించింది. కొండలు, కోనలు గంభీరంగా ఆ నాదం విని ప్రతిధ్వనించినయ్. రాచుకుపోయిన తనగొంతు ప్రౌఢంగా, స్వచ్ఛంగా వెనుకనుంచి అశేషంగా వినదిస్తుండగా కనుమసక చీకట్లో కుటీరంచేరాడు రఘూ. వెంటనే వేడికాఫీ అందించాడు వంట చేస్తున్న వెంకన్న – సామాను జాగ్రత్తగా అమరుస్తున్నాడు పద్మనాభం.

అతని విహారకాంతుడు, సత్యానంద రస పిపాసకు కలిపురుషుడు 'అంతా ఒక్కసారేనా' అన్నట్లు తెరలాగాడు. కుటీరంలో వెంకన్న వంటచేస్తుంటే పక్కనేవున్న బెడ్డింగుమీద కూర్చొని కిటికీలోంచి బయటి ప్రపంచాన్ని రఘు వీక్షిస్తున్నాడు. కిటికీలోంచి రివ్వున దూసుకువస్తున్న చల్లనిగాలి అతనికి నవజీవనం ప్రసాదిస్తోంది. గుబురుగున్న చెట్లు, జీబురున్న చీకటి, ముదురు నీలిరంగులో అనంతాకాశం అసంఖ్యాకంగా మెరసిపోతున్న నక్షత్రాలు, హంసల్లాగా అంగుచాటులో తేలిపోతున్న తెలిమబ్బులు కిటికీ అవతల కటిక చీకటిలో ఉండుండి ఉడిగుండి మిరుమిట్లు గొలుపుతున్న మిణుగురు పురుగులు — "ఏమిటివి వెంకన్నా — ఆ మెరిసేవి?" అంటూ ప్రశ్నించాడు రఘూ వెంకన్నను. మిణుగురుపురుగులు అన్నాడు వెంకన్న. వాటిని చూస్తుంటే తనలో తనకు జిలిబిలి 'జలతరంగ' ధ్వనులు వినిపింపసాగాయి.

భోజనందగ్గర క్రిందకూర్చోటం పట్టిచ్చినట్లుంది రఘూకి జొన్నరవ్వ రొట్టెలు రెండు వరి అన్నం, కారం, ఉప్పూ దట్టంగ వేసి దబాయించిన వంకాయబజ్జీ. గడ్డపెరుగు— ఉండవలసిన సంభారం సాంబారు లేదు. జొన్నరొట్టెలు బొద్దుగా మన్ను తిన్న పాములే పడివున్నాయి కంచంలో. రఘు రొట్టెముక్క తుంచడానికి చాలా అవస్థపడ్డాడు. చపాతీలాగే ఉంటుందనుకున్న రఘూకి అది నములుంటే చప్పగా రావడం నోరుఅంతా కొట్టుకుపోవడం జరిగింది. నోటి పూతి వాడకిమల్లే తయారయింది నోరు— ఒకేమంట. అంకెళ్ళ నెప్పిచేసినయ్ నములగా నములగా—వరిఅన్నం వంకాయబజ్జీ వేసి కలుపుకుని ముద్ద నోట్లో పెట్టుకున్నాడో లేదో గంగవెర్రులెత్తినట్లు 'వాటర్ వాటర్' అని గోలపెట్టాడు రఘూ. ముచ్చెమటలు పోసినయ్ రఘూకి. దబ దబా ఆత్రంగా మంచినీళ్ళు ఆర్చు కార్చుకుని తాగాడు రఘు. పద్మనాభం అందుకుని 'వెంకన్నా - ఏమిటవంటు? పాతచెప్పులల్లే నలిగిచావని రొట్టెముక్కలూ, నోరంతా మండిపోయే పచ్చడీని' అన్నాడు 'అదేంటి బాబూ నోట్లో వేసుకుంటే కరిగిపోతుంటే-చక్కగా ఎర్రవాగ్గా వేగి రొట్టెముక్క - కావాలంటే పచ్చట్లో కారం ఓరవ్వ తగ్గిసా నెహానించీ' అన్నాడు దేశవాళీమాటల్లో తీరుగా వెంకన్న. మిగిలిన అన్నంలో గడ్డపెరుగు వేసుకుని తిన్నాడు రఘు. దహించుకుపోతున్న ఆకలిలో ఆ గడ్డపెరుగు అతనికి అమృతప్రాయంగా ఉంది. రసనకు సంతృప్తి కలిగింది. కడుపునిండా మంచినీళ్ళు తాగాడు.

కింద బెడ్డింగు పరుచుకుని గోడ నానుకుని కూర్చున్నాడు రఘు. హోరుపెడుతూ బయట ఈదురుగాలి వీస్తోంది. చూరుకు వేళ్లాడుతున్న గుడ్డిదీపం గాలికి ఊగుతూన్నది. తిన్నచోట్ల శుభ్రంచేసి ఎదురుగా కూర్చున్నాడు వెంకన్న. పక్కనున్న హార్మోనియంపెట్టెపై వేళ్ళతో లలితంగా దరువు వేస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు రఘు. పద్మనాభం పక్కగదిలో సామానులు అమర్చడంలో ఉన్నాడు.

'వెంకన్నా, నీకేమైనా పాటలొచ్చా' అన్నాడు రఘు.

'ఎక్కే నా మొహం. నాకేం వచ్చండి బాబూ, మోటచాకిరీ చేసుకు బతికేవాణ్ణి.'

'మీదేవూరు?'

'మాచెర్లనండి.'

'మీ ఊళ్లో మంచిపాటకులెవరైనా ఉన్నారా?'

'అయ్యో, మా వూళ్లో లేకేమండి. ఈ చుట్టుపట్ల మా ఊర్ని కొట్టేది లేనేలేదండి. ఇటు సత్తెనపల్లి, పిడుగురాళ్ల ఈమధ్యలో పాతాళ బసవయ్యంటే యమపేరున్నమాట. నేత చిరతపట్టి తత్వం అందుకున్నాడంటే మళ్ళీ శేజీ యిరిగిపోతుందండీ'

ఈ మాటలకు పొరలి నవ్వాడు రఘు. స్థానిక సంగీతస్థాయిని లీలామాత్రంగా తెలుసుకున్నట్టు భావించాడు.

మళ్ళీ అందుకున్నాడు వెంకన్న "ఇప్పుడిప్పుడు కుర్రకారంతా వచ్చి, సినిమాపాటలంటూ లల్లాయిపదాలు మొదలెట్టారుగానీండి యెనకటిపాట లెక్కడ - యెనకటి పాటకులెక్కడ. నమ్మినాసరే నమ్మకపోయినాసరే గానీండి బాబూ — మాచెర్ల దాసుగారనీ మొన్నటిదాకా కూడా ఉన్నారండీ ఆయన గజ్జెకట్టి రేజీమీద నిలబడి గొంతు విప్పి 'శంభో' అనగానే చెట్లమీద కాకులన్నీ ఒక్కసారి లేచి బిట్టు ఎగిరిపోయేవండి - నిద్రబోతున్నవాళ్లు ఒక్కమైన ఉలిక్కిపడి లేచేవాళ్లండి. ఘల్లాం గిడపడేదండీ ఆగొంతు- గాస్లాంతేర్లు ఆమోతకి ఎగిరిపడి ఆరిపోయేవంటే - అయ్యో - ఆకాలం అంతా తీరిపోయింది - ఇప్పుడెవడికొక్కవాలండీ - హరికథలూ, తత్వాలూ, తరంగాలూ - ఎక్కడ చూసినా ఈ సినిమాలు - ఎలికమీద పిల్లి, పిల్లి మీద ఎలిక కతలూ, లల్లాయిపదాలూ-" అన్నాడు ఉపన్యాసధోరణిలో వివిధ రసాలు ప్రదర్శిస్తూ వెంకన్న—

నస్తున్న నవ్వాపుకుని ఆ అమాయకత్వానికి సంతోషించాడు రఘు.

'మరి సినిమాపాటలంటే నీ కిష్టంలేదా వెంకన్నా' రఘు ప్రశ్నించాడు.

నిశ్చితాభిప్రాయం వ్యక్తంచేసే చూపుతో చూపుడువేలు తిప్పుతూ సూటిగా వెంకన్న 'బాబూ, పాటంటే భక్తీ, భావమూ ఉండాలి. బుద్ధి కలిగించాలి. అంతేగాని

# ★ జీవనరాగం ★

పక్కలూ నక్కలూ అరుస్తున్నట్లు యేం చేంటోపాడు మాటలు – అయ్యా పెట్టిపాడు లల్లాయిపదాలు పాడిస్తే పిల్లామేకా యేమైనా బాగుపడతారా అంట. అసలు ఈ సినిమాల్తో వచ్చింది దేశానికి చేటు. పిల్లలు చెప్పిన మాటినకుండాపోతున్నారు' అని ప్రకటించాడు.

రఘూ కోరికపై, రఘూ, వెంకన్నా కిట కిట లాడుతూ బిర్రబిగిసిన తలుపు తెరుచుకొని రివ్వున ఎగబోసుకుంటున్న గాలిలోకి వచ్చారు. కృష్ణపక్షపు కటిక చీకటి. ముదురు నీలంరంగులో విశాలాకాశం, చిత్ర-చిత్రంగా అసంఖ్యాకంగా మెరసిపోతున్న కోటానుకోట్ల నక్షత్రాలు రఘూకు నివ్వెరపాటు, ఆశ్చర్యం, క్రమంగా ఆనందం కలిగించాయి. స్వతహాగా భగవంతునిలో విశ్వాసంగల రఘూ 'ఈ విశ్వరూపంలో నేనెంత' అనుకున్నాడు. స్వల్పప్రజ్ఞగల బుద్ధితో ఆ విశ్వరూపానికి అతడు నివ్వెరపడడం సహజమే. గుబురుకున్న చెట్లలోంచి వ్యాపిస్తున్న చిమ్మచీకట్లు, మిణుగురు పురుగులు చూసి ఆకాశమే భూమిదాకా ఆవరించుకుంది కాబోలు ననుకున్నాడు రఘూ. జోరున ఎగబోస్తున్న గాలిపాటులో అతని బలహీన శరీరం జీవాలు నింపుకుంటున్నట్లు ఉత్సాహం కలిగింది. 'ఇది దృశ్యం కాదు – అనుభవం' అనుకున్నాడు రఘూ. ఆ అనుభూతిని పట్టలేని అల్పహృదయంతో తబ్బిబ్బయాడు. తన మనసులో ఏవేవో మధురమైన కలవరాలు కలిగి అన్నీ అన్ని రకాల జిలిబిలి రాగాలుగా కూనరాగాలు తీశాడు రఘూ.

అలానడచి కొంతదూరం రఘూ వెంకన్న వెళ్ళారు. అంతటితో ఆపర్వతం ఆఖరు. అది ఆకొండ అంచు. అక్కడనుంచి గంభీరమైన ఒకలోయ. ఆలోయలోనుంచి చల్ల చల్లని నెమ్మదిగాలులు రివ్వునవీస్తున్నాయి. ఆ లోయలో ఏవో మిణుకు మిణుకుమంటూ దూరంగా కనిపిస్తున్నాయి. ఒకవేళ నక్షత్రాలు లోయలో పారే కృష్ణలో ప్రతిబింబిస్తున్నాయేమో ననుకున్నాడు. అవి కేవలం ప్రతిబింబాలుగా లేవు. చుట్టూ మిణుగురు పురుగులు, అనంతాకాశంనిండా లక్షలాది నక్షత్రాలు, ఎక్కడో లోతుగా ఉన్న కొండలోయలోనూ మినుకుమినుకుమంటూ కళికలే. 'ఏమిటవి–వెంకన్నా ఆ లోయలో వెలిగేవి' అడిగాడు రఘూ.

'ఏవో చెంచులగూడెంలో దీపాలై ఉంటాయి. లేకపోతే అదైమైన పల్లెపట్టయినా అయిఉండాలి' అన్నాడు వెంకన్న.

చెవుల్లో చాలాసేపటినుంచి గీవురుగీవురుమంటూ రొదగా ఉంది. అవి కీచురాళ్ళని, ఎక్కడో దూరంనుంచి వినిపించే ఒక వింతధ్వని 'వరుడుజాతి' పక్కులదని వెంకన్న చెప్పాడు. కీచురాళ్ళరొదతో శ్రుతి కలుపుకుంటే దైవతస్వరచ్ఛాయ రఘూకు కనిపించింది.

క్రొత్త ప్రపంచంలో నూతనానుభూతులకు పులకిస్తూ రఘూ ఆ రాత్రికి కుటీరంచేరి పరచిఉన్న పక్కపై శయనించాడు. అంతకుముందే అన్నీ సర్ది అలసిఉన్న పద్మనాభం గుర్రుపెడుతున్నాడు.

కుటీరంలో వెచ్చగా ఉంది. కీచురాళ్ళ రొద అక్కడ వినిపించడంలేదు. నేల విడచి గాలిలో తపస్సు చేస్తున్న యోగిలా గుడ్డి దీపం మిణుకుమిణుకుమంటున్నది. కిటికీలోంచి ఉండుండి ఆత్మీయంగా చల్లగాలి తాకుతున్నది. రఘూ ప్రక్కపై ఒత్తిగిల్లిన ఆ క్షణంలో కనురెప్పలు బరువై మూసుకుపోయాయి. వాటికింద అతని కళ్లలో రాగిణి రూపు నిశ్చలంగా నిలచిపోయింది.

*          *          *

చిత్రచిత్రానుభూతులతో ఆందోళిక రాగంలా సాగిపోతున్నది రఘూజీవితం. ప్రక్కవాద్యం పద్మనాభం ఆ మరునాడే వెళ్ళిపోయాడు. తను ఒంటరివాడై పోయాడు. క్రొత్త ఆత్మీయుడు వెంకన్న ఒక్కడే మిగిలాడు. అప్పటికి రఘూ నాగార్జునకొండచేరి వారంరోజు లయింది.

అతని ఆరోగ్యం కొంత చక్కబడింది. గొంతు స్ఫుటంగా, సుగమంగా ఉండి అతని ఆనంద ప్రకటనకు సాధనగా ఆలాపన సాగుతున్నది. కుటీరంముందు కొండఅంచున కూర్చుని అతడు ఎదర లోయను తిలకిస్తూ, చుట్టుపట్ల తిరుగుతూ సుఖంగా ఏ బాధ్యతలూ లేకుండా కాలం గడుపుతున్నాడు. ఇన్నాళ్ళుగా వాయిదా వేస్తూవచ్చిన రఘూ అక్కడ ఒకచెట్టు మొదట కూర్చొని రాగిణికి ఉత్తరం వ్రాయడానికి ఉపక్రమించాడు. అది చల్లని సాయంకాలపు వేళ.

చిరంజీవి రాగిణీదేవికి–ఆశీర్వచనములతో. నేను వారంరోజులనుంచీ జాబు వ్రాయాలనుకుంటూ వ్రాయలేకపోయాను. నీ సలహా ప్రకారం–ఇంతదూరం వచ్చి ఒంటరినై పోయాను మొదట్లో–కాని ఇక్కడ ప్రతి అణువు నన్ను ఆకర్షించి ఆనందం కలిగిస్తూంది. ఈ ఉత్తరం వ్రాస్తుంటే ఇటు ప్రక్క దక్షిణపులోయలోంచి వీచే చల్లగాలులు నన్ను ఎంత ఆత్మీయంగా స్పృశిస్తున్నాయో నీకు నా అక్షరాలు చెప్పలేవనుకుంటాను. ఈ గాలుల చల్లదనం చూస్తే నీ చల్లని చూపులు సైతం అసూయతో ఎర్రబడిపోతాయి!

ఇక్కడ నేను పొందుతున్న అలౌకికానందాన్ని పురస్కరించుకుని, నాకీ

అవకాశం కలిగించినందుకు ముందుగా నీకు కృతజ్ఞత తెలుపుకుంటున్నాను.

ఇక్కడ చల్లగాలులు నిత్యం ఆప్యాయంగా తాకుతూ పరామర్శిస్తాయి. చుట్టుపట్ల కొండలన్నీ చల్లని పచ్చని చెట్లతో చుట్టువారుకుని కౌగిలించుకున్నట్లు ఉంటాయి. అమ్మ ఒడిలో ఆదమరచి నిద్రపోయే పసిపాపలా నేను ఈ లోయల్లో హాయిగా విశ్రాంతి తీసుకోవచ్చు. ఇక్కడ నాతో మాట్లాడటానికి ఎవ్వరూ లేరు— జిలిబిలి పలుకులు పలుకుతూ, అర్థంకాని భావ మాట్లాడే రకరకాల శుకపికాలు తప్ప ఈ ఒంటరితనంలోకి ఎప్పుడు ఎవరు వచ్చి పలకరించినా నా ఆనందానికి అంతు ఉండదు. ఆ అదనుకోసం ఎదురుచూస్తానే అనుకో. కాని ఈ క్రొత్తలోకంలో నన్నెవరు పల్కరిస్తారు?

కృత్రిమంగా ఆనందం, కల్పించుకుని, డబ్బువెచ్చించి, కాలపరిమితితో దాన్ని అనుభవించే ప్రపంచంనుంచి సంబంధంలేని ఈ మరోప్రపంచంలోకి వచ్చిపడ్డ నేను అపారానందాన్ని పొందుతున్నాను.

పరస్పర విశ్వాసాలు ఉఛ్వాసాలుగాగొని బ్రతికే జనసమ్మర్దంలోంచి, ఎన్నడూ ప్రకృతిసౌందర్యాన్ని, కనీసం విశాలాకాశాన్ని సూర్యచంద్రాగులను కూడా చూడటానికి నోచుకోని వ్యావృతులనుంచి డాక్టర్లు డండగా ఆరోగ్యానికేమని, ఫ్యానులుండగా చల్లగాలికేమని ధీమాలుపోతూ బ్రతికే పాడు ప్రపంచంనుంచి నేను నీ కంటి వెలుగుకిరణం చూపించినదోవనే ప్రయాణించి ఈ సువిశాల సుందర ప్రపంచంలోకి వచ్చాను.

ఉంగరాల్లో పొదిగే రంగురాళ్లూ, సంగీత పరికరాలు బాగుచేయడానికి అప్పుడప్పుడుపయోగించే ఆకురాళ్లూ, రోడ్లన్నీ సిమెంటుచేయడానికి తోలే కంకరాళ్లూ ఇటుకరాళ్లూ — ఇటువంటి నిర్జీవమైనరాళ్లు తప్ప యెరుగని నేను ఇక్కడ సంగీత రసోత్తేజం కలిగించే సజీవమైన కీచురాళ్ళను చూశానుసుమా. అవి కనపడవట! విన్నాను. మద్రాసులో జవరాళ్లూ, నట్టువరాళ్లూ సజీవమైన రాళ్ళేకదా అంటావేమో — అంటే నేనేం చెప్పలేను. ఇక్కడ మాయూలు రాళ్ళుకూడా సజీవమైనవిగా నేను భావిస్తాను. అక్కడ సజీవమైనవికూడా జీవిస్తున్నట్లు నేను భావించలేను. ఎందుచేత అంటే కారణం ఆదంతా కృత్రిమలోకం.

నా అనుభవాలు గడచిన కొద్దిగంటల్లోనే ఎన్నో ఉన్నాయి. రాత్రి నిద్రతపిస్తే అనుక్షణం ఒక అనుభవమే—నీళ్ళల్లోంచి బయటపడేసిన చేప ఎలా గాలికి ఉక్కిరిబిక్కిరి అవుతుందో, నేను నిశ్శబ్ద నిబిడాంధకారంలో రాత్రి అలా కాసేపు ఉక్కిరిబిక్కిరి అయ్యాను.

మరొక్కమాట రాగిణీ—సంగీతం అనేది ఎక్కడుందని నీ ఉద్దేశం? కళాకేంద్రాల్లోనూ, స్టూడియో రిహార్సల్ రూములోనూ లేదు. నా ఇరవై మూడేళ్ళ జీవితం వాటిల్లోనే గడిపాను చాలావరకు. ఆ అనుభవంతోనే సుమా నేనీ మాటలు అంటున్నది. సంగీతం అనేది ఇక్కడ పుట్టి నిత్య ప్రవర్ధమానమవుతున్నది రాగిణీ! మన గాన పిపాసకొద్దీ ఈ సంగీతాన్ని కృత్రిమంగా అందించుకునేందుకు, అనుభవించేందుకు మనం వివిధ సంగీత వాయిద్యాలు ఉపయోగించుకుంటాం. భగవంతుని ఆరాధనకు మానవ నిర్మితమైన విగ్రహాలు ప్రతిష్ఠించుకుని భక్తులు పూజించడంలేదు? అలాగే అనంతమైన సంగీతాన్ని విశ్వనాదాన్ని అనుభూతికి మేళవించుకుని తరించడానికి మానవుడు పడేపాట్లన్నీ ఆ పరికరాలు. విగ్రహం దైవానికి ఎంతవరకు ప్రతినిధి? మన గానం ఈ విశ్వసంగీతానికి అంతే ప్రాతినిధ్యం వహిస్తుంది.

ఒక్కసారి నీవే ఆలోచించు. కీచురాళ్ల నిస్వనం—హోరుగాలిలో స్వరం ఎంతవరకు ఏ వాద్యం పలకగలదు? పలికితే సహజత్వం ఎంతవరకు ఉంటుంది.

ఈ స్వరార్ణవంలో నేను-సాధనద్వారా లోతులు చూసి తరించాలని ఉవ్విళ్లూరుతున్నాను.

ఏ సత్కార్యానికైనా ఉత్సాహశక్తిని ప్రసాదించే ఉదార హృదయం నీది. నాకీ జీవితంలో మిగిలిందల్లా ఒక్కటే తృప్తి. నీ విశాల నేత్రాల చల్లని చూపుల సాయంతో నేను ఎంత పురోగతినైనా సాధించుకోగలను. అసలు నీ శ్రేయోభిలాష నాలో నిత్యంవినిపించే మధుర సంగీతం.

పొడుగాటి ఉత్తరం రాశాను. పొడిమాటలు కావనే భావిస్తాను. విచిత్రం రాగిణీ! పొడిదగ్గు కూడా రావడంలేదు. ఒక్క సంతోష విషయం చెప్పి ఈ ఉత్తరం ముగిస్తాను; అంటే త్వరలో రెండో ఉత్తరం రాస్తాను.

నేను సిగరెట్లు మానేశాను. అసలు ఇక్కడ తాగ బుద్ధి కావడంలేదు.

వెంటనే జాబు వ్రాస్తావుకదూ—మన ప్రొడ్యూసర్లు ఏమన్నదీ—ఎవరేమనుకున్నదీ—పద్మనాభం క్షేమంగా చేరిన సంగతీ.

అభిమానపాత్రుడు,
రఘు.

(ఇంకావుంది)

పరికిణీమీద రిందిశే. కాటుకా, గోళ్లరంగూ కలిపి మెదిపితే కొత్త చిన్నె కాస్త వేళ్లకి పట్టించుకుంటే. పులుముకోవడం అనెయ్యడమే? అదే ఆధునిక చిత్రకారుడి పనయితే అందరూ అభినందిస్తారు! అతడెలాంటి కొత్త రంగుల్ని కలుపుతాడో, అవి ఎక్కడెక్కడ పులుముతాడో పరికించండి!...కాంత బాదస్తపు విమర్శలని విరమింపజెయ్యడానికి వెయ్యి సమాధానాలు చెప్పొచ్చు! కాని మూడేళ్ల మణి కంతకంటె మహత్తరమయిన ఉపాయం తెలుసు: బావురుమనడం! నొచ్చుకున్న మణి కన్నీళ్లని నవ్వుతూ తుడిచింది కాంత. పొంగి పొరలే మాతృ ప్రేమతో పాపని బుజ్జగించింది.

* * *

ఇల్లాలి ఇంటిపని కవడం అంటూ ఏమిటి? కనక కాంతకి చెయ్యూరుకుందంటే చేసినంతవరకూ చూసుకోవడానికేగాని

# ముగ్గురు మహిళల ముచ్చట

అతివ అలంకరణకి అవధమంటూ, ఏమిటి? కనక ముస్తాబవుతున్న మణికి చెయ్యూరుకుందంటే చేసినంతవరకూ చూసుకోవడానికేగాని చెయ్యదలచుకున్నదంతా చివరికి వచ్చి కాదు! ఆమె నేలమీది అద్దాన్ని నిలువెత్తున వెట్టుకుంది. పరిశీలనకి వీలుగా తల పక్కకి వంచింది. సింహావలోకనంలోని సంతృప్తి చిరునవ్వులో స్పష్టపడింది. ముచ్చటయిన ముస్తాబు. సాంప్రదాయానికి చిన్నమెత్తు భిన్నం కావచ్చు. కాస్త సాహసం కూడా కావచ్చు. అయితేనేం, ఆ కొత్తదనం ఆమె కళ్లని మెరిపించింది. ఆమె దరహాసందర్పణంలో తనను చూచుకున్న అతివ ఆనందం కాదు. కళాస్రష్ట తన సృష్టివైభవాన్ని తిలకించి పొందే తన్మయత్వం!

మణి మిగతా ముస్తాబును మొదలుపెట్టింది. అంతలోనే బొళ్లమ్మ కాంత గదిలోకి వచ్చి చూసి నవ్వుకుంది. "హాసి పీల్లు బంగారం గానూ! ఏమిటే ఆ పులుముకోవడం?"

పులుముకోవడంట, పాపం! ఏం, అందరూ అచ్చుగుద్దినట్లు ఒక్కలాగే అలంకరించుకోవాలా? అసలు బొటుకి కాస్త కావ్యంగా తిలకం దిద్దుకుంటే తప్పా? బుగ్గని చుక్క పొదరుతో పెట్టుకోకూడదు? కాటుక కనురెప్పలకి కాస్త క్రిందుగా మెదుపుకుంటే కొత్తగా ఉండదూ? విపరీతం నో

DL/P. 3A-X52 TL]

చెయ్యవలసినదంతా చివరికి వచ్చికాదు! శాంత సావిట్లో నించుని వలుమూలలా పరికించింది. అంతా ఒబ్బిడిగా ఉంది. శుభ్రాని కలవాటు పడిన ఆమె హృదయం సంతృప్తిపడింది. ఇప్పుడు చూడడానికి వచ్చిన జనానికి చాప వెయ్యడానికి సిద్ధంగా ఉంది, శాంత. స్వాగత సత్కారాలు కూడా సద్గృహిణి బాధ్యతే కదూ. మరి! ఇతర పనులకంటే అది ఉత్కృష్టమూ ఉన్నతమూ అనుకోండి. అయినా తతిమ్మావాట్లకి మల్లేనే దానికి తయారీ అవసరం... ఇతర పనులా? ఇంటెడు! కళ్లు తెరిచేటప్పటికి కాఫీ వేళవుతుంది కుటుంబానికి. ఆపైన పాచీ, పనీ. అనంతరం పిల్లకి నీళ్లు పొయ్యడం. తర్వాత ఫలహారాలు. ఇంతలో వంట వేళవుతుంది. కాస్సేపట్లో భర్త భోజనానికి ఇంటికి వస్తాడు. ఆయన వెళ్లేక కాస్త అల్లికా, కుట్టుపనీ. తర్వాత మణి మధ్యాహ్నం ముస్తాబు. అమ్మయ్య! ఇప్పుడింక ఒక్క క్షణం కాళ్లు చాపుకోవచ్చునేమో? బహుశా ఒక్క కునుకు తియ్యవచ్చునేమో?... కునుకుకి బదులు చేసుకోవలసిన పనులు వెయ్యి చెప్పగలదు శాంత. ఈవేళ చూద్దురూ: "మణి ముస్తాబంతా మళ్లీ మొదలుపెట్టాలిగా?" అంటుంది. మరే, అమ్మ పనిలాగే అమ్మాయి అలంకరణకీ అంతుండే కదూ?

* * *

వడతుల ప్రశ్నార్థకాలకి పూర్తవడమంటూ ఎక్కడ? కనక ఇరుగమ్మ రాధ ఒక ప్రశ్న అడిగిందంటే అది అనేకంలో ఒకటి: "ఇంటి పనంతా ఎంత తేలికగా చేసుకుపోతారండీ మీరు! ఇంటెడు పని చేస కూడా అంత ఉత్సాహంగా ఎలాగ ఉండగలరండీ? పాపాయి కూడా మీ వెనక్కాలే పుణికింతాలు పెడుతూ ఎలా తిరుగుతుందో! దిష్టికాదుతున్నా వనుకోరుగదా? అంత ముద్దుగా, ఆరోగ్యంగా చలాకీగా ఉంటుంటే మెచ్చుకోవాలనిపించిందండీ. అంతా పెంపకంలో ఉందనుకుంటాను. ఏం పెడతారండీ. పిల్లలకి?..." సమాధానంగా శాంత పెద్ద లెక్చరు చెప్పవచ్చు: సమమైన ఆహారాన్ని గురించీ; శరీరారోగ్యాన్ని గురించీ; శక్తికలగడానికి శరీరానికి తగినంత క్రొవ్వు పదార్థాలని సరఫరా చెయ్యడాన్ని గురించీ, చక్కని వంటకాలని గురించీ, వెయ్యి మాటలు చెప్పక్కర్లేకుండా, విషయాలన్నిటినీ ఇముడ్చుకున్న ఒక విండైన జవాబు చెప్పగలదు శాంత: "డాల్డా వనస్పతి!"

* * *

"కాని..." చెప్పలేదూ, రాధ ఆఖరి ప్రశ్న ఆఖరిది కాదని? ఏ ప్రశ్నా ఆఖరిది కాదు!..."కాని 'డాల్డా' పిండి వంటలకి మాత్రమే వాడుకుంటారనుకున్నానండీ. వంటలన్నిటికీ వాడవచ్చునంటారా?" బూరెల మూకుడు గారెలు వండడానికి వాడవచ్చునంటారా? అని అడిగినట్లుంది అనవచ్చు శాంత. 'డాల్డా'ను పరిశుద్ధమయిన కాయగూరల నూనెలతో చేస్తారనీ, దానిలో శరీరారోగ్యాని కవసరమైన ఎ. మరియు డి విటమినులు కలుపుతారనీ. అది ప్రత్యేకం ఒక వంట సరుకేగాక, ఒక పోషక పదార్థమనీ, పైగా 'డాల్డా'తో చేసిన వంటకాలు ఎంతో రుచ్యంగా ఉంటాయనీ చెప్పవచ్చు. పోపులకీ, వేపడాలకీ, ఫలహారాలకీ పిండివంటలకీ. 'డాల్డా' వాడుతాననీ చెప్పవచ్చు. వెయ్యి చెప్పవచ్చు. 'డాల్డా' విశిష్టతను గూర్చి. కాని శాంత తన అనుభవ సారాన్నంతనీ ఒక్క వాక్యంలో పొందుపరచగలిగింది: మా ఇంట్లో వారాని కేడు రోజులూ వంటంతా 'డాల్డా'తో చేసేనండీ!"

* * *

నిక్కచ్చిగా నిజం చెప్పాలంటే, "మణి వంట తప్ప మిగతా వంటంతా" అనాలి; ఏమంటే, పాప పాచకత్వం ప్రస్తుతం పప్పులూ, బెల్లం, అటుకులూ, బిస్కట్లు వగైరా పదార్థాలకే పరిమిత మయివుంది. అయితే ఆమె గుజ్జెన గూళ్లకి 'డాల్డా'తో అసలే సంబంధం లేదనుకోకూడదు! ఆ పసుపు పచ్చని డబ్బాలో ఆమె లక్కపిడతలని భద్రపరచుకుంటుంది. బాల్యంలో తనకానందాన్నిచ్చిన ఆ డబ్బామీద బొమ్మ 'డాల్డా' చిహ్నమైన ఖర్జూరపు చెట్టు క్రమేపీ ఆమె గుర్తిస్తుంది. పైగా 'డాల్డా'లో కల్తీలవకాశం లేకుండానూ, ఈగలూ, దుమ్మూ పడకుండానూ వేసిన భద్రమైన సీలుయొక్క అవసరాన్నామె అవగాహన చేసుకుంటుంది. చిన్నతనంనుంచీ తనకు చురుకుదనాన్ని శక్తినీ ఇచ్చి తన పెంపకంలో ప్రముఖ స్థానా న్నాక్రమించుకున్న 'డాల్డా'నే తనూ తర్వాత తర్వాత వంటంతకీ వాడుతుందని వేరే చెప్పాలా?

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ తయారీ

DL/P. 3B-X52 TL

# ఇంటివాళ్ళుస్తాయి

"దీహరా"

శనివారం. మబ్బు వేసి చీకటిగా ఉంది.

కుర్చీ కిటికీదగ్గరగా లాక్కొని కుర్చీలో కూర్చున్నా. యాకూబ్ అరుగుమీద కూర్చున్నాడు. కాంప్ నుంచి వచ్చి కాళ్లూచేతులు కడుక్కొని కొద్దిగా రెస్ట్ తీసుకుంటున్నాను. అయిదున్నర కావస్తోంది.

"అయ్యగారు ఉన్నారా?" యాకూబ్ నెవరో అడుగుతున్నారు బయట.

కర్టెన్ సందుల్లోంచి బయటికి చూసేటంతలో వసంత లోపలికి వచ్చింది. లేచి, ఉన్న ఒక్క కుర్చీ చూపి కూర్చోమందామనుకుంటున్నంతలో నే ఎదురుగ్గా స్టూల్ పైన కూర్చుంది.

వసంత, మా 'ఇంటాయన' కూతురు. కాలేజిలో బి. ఏ. చదువుతోంది. ఒక్కర్తే అమ్మాయేమో, ఆవిడ అభిమానాలకి, ఆశయాలకి అడ్డు చెప్పడానికి ఎవరికీ గుండెల్లేవు. అందుకని ఉత్సాహం, పట్టుదల కొంచెం ఎక్కువ మోతాదులో ఉంటాయి, సహజంగానే.

"అబ్బ! ఈ వెధవ్వాన ఒకటి! ఎక్కడికీ పోడానికి లేకుండా!" చిరాగ్గా అంది, వారపత్రిక పేజీలు తిరగేస్తూ.

సమాధానం వెంటనే తట్టక, "మరే" అని ఊరుకున్నాను.

"మీకెలా కాలక్షేపం అవుతుంది, ఒంటరిగా ఈ గదిలోకి అలా రోడ్డుమీదికి, ఆకాశంలోకి చూస్తూ కాలం గడిపేస్తారేమిటి?" అంది నవ్వుతూ.

"నా కసలు పైకెక్కడికీ ఏదో పని ఉంటూనే ఉంది. ఏమున్నా మిగిల్తే ఏమున్నా పుస్తకాలు చదువుతూ కూచుంటాను."

"మీకూ ఉందన్నమాట అభిరుచి! నాకేమన్నా ఇవ్వండి, రెండుమూడు రోజుల్లో ఇచ్చేస్తాను" అని కొనసాగి, "మీరు కథలు వ్రాస్తారటగా!" అంది అదేదో తప్పు పని అన్నట్టు, కొంచెం గొంతు తగ్గించి.

"ఆఁ ఏదో లెండి, ఉబుసుపోక రెండుమూడు వ్రాశానంతే" నేనూ కొంచెం సిగ్గుపడుతూనే అన్నాను. నాకసలు ఆ అమ్మాయితో మాటలంటేనే భయం. మా ఇద్దరికీ ముఖ్యంగా వున్న తేడా, జీవితమంతా రోజా పూల పాన్పు, బ్రతుకంతా ఓ తీయని పాట అని కలలుగంటూ చందమామతోటి సరాగాలు, తారకలతో సంభాషణలు సాగించే నునులేత విద్యార్థిజీవితం ఆమెది; నా ఆశయాలకి ఆదర్శాలకి ఉద్యోగంలో చేరిన మర్నాడే తిలోదకాలిచ్చుకుని, పాత కలలన్నిటినీ చూసి వికటంగా నవ్వుకునే ఉద్యోగిని నేను. ఉషారాగంతో ఇప్పుడిప్పుడే ఎర్రబారుతున్న గులాబీరేక ఆమె. గట్టిపడుతున్న కాయని నేను. నన్నూ, నా జీవితంపైని భావాల్నీ చూసి వెక్కిరిస్తూంది వసంత. ఆమెనీ ఆమె ఆకాశపు టెత్తుల్నీ చూసి జాలిపడతాను నేను.

"కొంచెం చూడనిస్తారా?" నేనేదైతే భయపడుతున్నానో దాన్నే ఆమె కళ్ళ చివరనుంచి చూస్తూ అడిగింది. నేనెప్పుడో చదువుకునే రోజుల్లో వ్రాసిన ప్రణయగాథలవి. వాటిని చూపడం అందులోనూ, వసంతకి, నే నూహించలేని పని.

"అవి మీకు నచ్చవు. మీలాంటివాళ్ళు చదవకూడదుకూడా... పైగా అవి నాదగ్గర లేవు" ఆఖరిమాటగా కొంచెం బొంకాను ఆమెను తప్పించుకోడానికి.

కొంచెం కోపంగా చూసింది. అటువంటి నిరాకరణ ఆమె సహించరానిది. నేనిచ్చిన మిగతా పుస్తకాలేవో తీసుకొని వెళ్ళిపోయింది.

* * *

వసంత, లేత గులాబీరంగు సిల్కుచీర కట్టుకుని రిక్షా ఎక్కబోతున్నప్పుడే, నేను ఆఫీసునుంచి ఎదురయ్యాను. "ఒంటివాణ్ని. కొంచెం ఆగి మరీ వెళ్ళండి" అన్నాను నవ్వుకుంటూ.

వసంత నవ్వలేదు. పైగా కళ్లు దించేసుకుంది. ఇంకా కసిగానే ఉందన్నమాట.

యాకూబ్ ఏదో పాంప్లెట్ తీసుకొచ్చాడు. అది కాలేజిలో ఏదో ఎగ్జిబిషన్ గురించి. ఆరేళ్ళక్రితం మా కాలేజీలో జరిగిన తతంగాలన్నీ జ్ఞాపకానికి వచ్చాయి. ఆ రోజుల్ని తలచడం మానేయడమే మంచిదనిపిస్తుంది—పాత విషయాలన్నీ మనస్సుని మరింత కలతపెట్టాయి.

మెరుపులా ఓ ఆలోచన వచ్చింది. వెంటనే, నాకు చేతయినంతగా తయారయి కాలేజీకి బయలుదేరాను.

ఎగ్జిబిషన్ అంతా మంచి హడావుడిగా ఉంది. తిరిగి తిరిగి చివరికి ఓ స్టాల్ దగ్గరికి వచ్చాను. అది చేతిపనులకు సంబంధించినది. అమ్మాయిలు, అబ్బాయిలు తయారుచేసినవన్నీ అక్కడ ఉంచారు. నే నూహించినట్టుగానే, వసంత అక్కడ ఉంటేరు. నేనామెని చూడనట్టుగనే ఒక్కొక్కటి చూస్తూ ఓ ప్రక్కగా నడిచిపోయాను. రకరకాల లేసులు, ఎంబ్రాయిడరీ, క్రాస్ స్టిచ్, పూసల కూర్పు—ఏవేవో ఉన్నాయి. కొన్నిటిమీద 'క. వి.' అనే పొడి అక్షరాలు ఇంగ్లీషులో కనబడ్డాయి. ఆ పేరు ఎవరిదో నాకు తెలుసు. నా అనుమానం రూఢి అయేందుకు వీలుగా, వసంత నా వెనకాల నిలబడింది. నేనక్కడికి వచ్చేసరికి. నా ముఖంలో భావాల్ని జాగ్రత్తగా కనిపెట్టోంది, మాట్లాడకుండానే.

"ఇవి పెట్టినవారు, స్వయంగానే చేశారా లేక—కొని తెచ్చారా?" నేను నవ్వు నాపుకుంటూ వసంతని కాకుండా మరో అమ్మాయిని ఇంగ్లీషులో అడిగాను. వసంతలో మారుతున్న రంగుల్ని కనుకొలకలనుంచి పరి

## బందీ ఇబ్బంది

జైల్లో ఒక బందీ దిగులుగా
కూర్చుని ఉండడం చూసి
సాటిబందీఅడిగాడు కారణం.
'నా బంధువు లెవ్వరూ నన్ను
చూట్టానికి రాలేకపోయారే
అని బాధ పడుతున్నాను'
అన్నాడా బందీ.
'రాకపోవడానికి కారణం'అడిగా
డతను.
'వాళ్ళంతాకూడా ఇదే జైల్లో
పక్కగదుల్లో ఉండడమే'
అని అతను టూకీగా జవా
బిచ్చాడు.

శిలిస్తూ. నా వెనకాలనుంచో ఇద్దరు కుర్రాళ్లు పళ్ళికిలించారు.

“స్వయంగా చేయకుండా, మావని చెప్పుకోరెవరూ!” కొంచెం కఠినంగా అంది వసంత. తీవ్రంగా చూసింది నాకేసి చురుక్కుమనేలాగ.

నేను బయటికి వచ్చేశాను. కాని ఆ సాయంకాలంవసంత ఇంటిలో చాలా గొడవ చేసింది. జరిగినసంగతి ఎవరికీ తెలియదు. వసంతమాత్రం ఊరికే చికాకుపడిపోయింది. ఆ పరిచయం తర్వాత నెమ్మదిగా వసంతతో చనువెక్కువయింది. కొంచెం భయంకూడా తగ్గింది.

ఓ సాయంకాలం.

పార్కు రేడియో, పాటలు పాడుతోంది. నేను ఓ మూలగా చెట్టుక్రింద కూర్చొని నాకు చేతనయింది—పాతవన్నీ నెమరేసుకోడం—చేస్తున్నాను. అప్పుడప్పుడు చెట్లమీది పక్షులు, ఆకాశంలో మబ్బులు, దూరంగా కదులుతున్న రంగు రంగుల చీరలు, నా చుట్టూ అలుముకొన్న ఆలోచనల డొంకల్ని ఛేదించుకొని లోపలికి ప్రవేశిస్తున్నాయి.

ఒక్కసారిగా నాకు కంపం పట్టుకుంది. నేను భయపడుతున్న మహా విపత్కర సంఘటన, వెయ్యిచేతులు చాపుకుంటూ సమీపిస్తోంది. ఓ డజనుమంది కాలేజీ అమ్మాయిలు నా చెట్టు దగ్గరకే చేరుతున్నారు పెద్ద గోలచేసుకుంటూ.

“రక్షించండని” గావుకేకలు పెట్టినా వినిపించుకొనేందుకు సమీపంలో నాజాతి వాడెవడూ లేడు!

అసలు చిక్కేమిటంటే, ఆ గాంగ్‌లో వసంతఉంది. ఆమె ముఖంలో “ఈ రోజు నీపని చూసుకోమ” నే పెంకె చూపు ఉంది. పైగా నా చేతిలో, మా పాతకాలేజీ మేగజైన్ – నా కథలు పడినది—ఉంది. లేచి వెళ్లడానికి కొద్దిపాటి అభిమానం అడ్డురాగా అలాగే కూర్చుండిపోయాను.

“హల్లో! మిస్టర్ రావ్! గాలి మేస్తున్నట్టున్నారే!” ఆమె ఇష్టంవచ్చినట్టు మాట్లాడుతుందని తెలుసుగనక దేనికైనా సిద్ధమున్నట్టు కూర్చొని తలూపాను.

“మీరూ అందుకే వచ్చినట్టున్నారు!” ప్రశ్నార్థకంగా చిరునవ్వు విసిరాను.

“అన్నట్టు మర్చిపోయాను. ఈయన రావుగారని మా ఇంట్లో ఉంటున్నారు. మాజీ రసికులు. పూర్వాశ్రమంలో మనం చదవకూడని రెండుమూడు కథలు వ్రాశారట” పరిచయవాక్యాలు పలికింది వసంత. చుట్టూ ఉన్నవాళ్లంతా గొల్లుమన్నారు. నా అనుమాన మేమిటంటే వాళ్లందరూ ముందు తయ్యారులోనే ఉన్నారు. అందరూ తలో మాటా విసురుతున్నారు.



“......ఆంధ్రదేశమంతటా వాతావరణం పొడిగానే ఉంటుంది......”

చిత్రం: డి. వెంకటరావు, (నెల్లూరు)

“ఆ పుస్తక మేమిటో చూడనిస్తారా?” ఓ పొడుగాటి రెండుజడలమ్మాయి అడిగింది. అడుగుతూనే, చేతిక్రింది పుస్తకం తీసింది. మా స్నేహితుడొకడు అంటూండేవాడు— “నలుగురు అమ్మాయిలు కలిస్తే నలుగురబ్బాయిలు చేసేదానికన్న ఎక్కువ అల్లరి చేస్తా” రని— నిజం అప్పటిదాకా అర్థంగాలేదు నాకు.

“ఒకటి, రెండు. మూడు, నాలుగు అబ్బో చాలా వ్రాశారే! మీ పేరుతో చాలా పడ్డాయి అవన్నీ మీరే వ్రాశారా?” వసంత స్నేహితురాలు చేతిలోని పుస్తకంలో నా ఆర్టికిల్స్‌ని లెక్కపెట్టి, కొంటెగా అంది నాతో. ఏమి చెప్పాలో, నేనాలోచించుకుంటూండగానే, నా సమాధానం అక్కర్లేనట్టు వాళ్ళంతా విరగబడి నవ్వడం మొదలెట్టారు.

నాకు చీకాకెక్కువైంది. భరించలేని కోపంతో లేచివచ్చేశాను. పుస్తకాన్నక్కడే వదిలేసి.

ఆసాయంకాలం నాజీవితంలో మరుపురానిది. రాత్రి హోటల్నుంచి నేను రెండు సినిమాలకీ పోయొస్తేనేగాని, ఆబాధ వదలేదు. ఇల్లు మార్చేయాలని కూడా ఆలోచించాను. ఆ అమ్మాయి ముఖాన్నిలాగైనా తప్పించుకోవాలనే ఉద్దేశ్యంతో మూడు రోజులు కొంపు వేసేశానవగాసగా. రాత్రే పదకొండింటికో గాని వచ్చేవాణ్ణిగాదు. ఆ అమ్మాయి ప్రొద్దున్న ఎనిమిదిగంటలకి లేచేంతలో నేను బయటపడే వాణ్ణి.

ఓ సాయంకాలం తప్పనిసరిగా రూంలో నే కూర్చోవాల్సి వచ్చింది.

కాసేపటికి విసుగెత్తి షికారు బయల్దేరాను. మెట్లు దిగేంతలో, “ఒక్కసారి ఇలా వస్తారా?” అని పిలిచారు వెనకనుంచి.

వెనక్కి తిరిగాను. వసంత, వాళ్ళ గుమ్మంలో నిల్చొని ఉంది. ఆమె కళ్ళు చాలా ప్రశాంతంగా ఉన్నాయి ముఖంలో చిలిపితనం పోయి గంభీరంగా ఉంది. నేను చిన్నగా నవ్వి లోపలికి అడుగులు వేశాను. వసంత టేబిల్ పైన కాఫీ కప్పు ఉంచింది. నష్టపరిహారమూ అని నవ్వొచ్చింది. వసంత నాన్న, అమ్మ గుళ్ళోకెళ్లారుట. వసంత ఒక్కతేవుంది. కాసేపుఎటో చూస్తూ అదోలాగ మాట్లాడింది. ఆతర్వాత సూటిగా “మీ రేమైనా నొచ్చుకున్నారా?” అంది. నాకేం చెప్పాలో తోచలేదు. లేదని మామూలుగా అనేయడానికి మనసొప్పలేదు. నేనేదైనా అనేంతలో “క్షమించండి ఏదో మామూలుగానే అనుకున్నానుగాని మీరింతలా అనుకుంటారనుకోలేదు,” అంది తలవంచుకుని. ఆ మాటలు నామీద చాలా తీవ్రంగా పనిచేశాయి. నాకూ కొంత గంభీరత వచ్చింది.

“క్షమించడానికేముందిందులో? నేను చేశాను. మీరు వప్పజెప్పారు. అంతేగా!” అన్నాను. వసంత కళ్ళెత్తి నాకళ్లలోకి, ఏవోలోతుల్ని కనిపెడుతున్నట్టు చూసింది.

“నన్ను మీరు అనకండి” సాధ్యమైనంత నొక్కి అంది. కాసేపు మామధ్య నిశ్శబ్దం ఆవరించింది.

“నే నేమనుకున్నానని మీరనుకున్నారు? సారీ నువ్వనుకున్నావు?” నేను మాటల్ని మధ్యలో మార్చాల్సి వచ్చింది ఆమె చూపుల వాడికి జడుసుకుని.

## ఇంటివాళ్ళు వస్తాయి

ఎప్పటిలాగా ఉంటావని మాటివ్వండి" అంది నెమ్మదిగా తలవంచుకునే నాకు వసంతని చూసి మొదటిసారిగా రకరకాల ఆలోచనలు పోయాయి. ఆ రోజు వసంత అమాయకత్వమంతా కళ్ళలో వెల్లబోసు కుంది. కనపడితే కసితీరేలా మాటలందా మనుకున్న నేను, ఆ జాలిచూపులకి ఇట్టే లొంగిపోయాను. నా పుస్తకం నాకు తిరిగి ఇచ్చేసింది.

ఈరోజు, ఊరి వెలపల మా బంగళాలో. (దూరంగా స్మశానంలో నక్కల అరుపులికి లయగా గోదావరి హోరెత్తుతుంటే,) బాబి గాడ్ని జోకొట్టివచ్చి వసంత ప్రక్కన కూర్చుంది, చొక్కా బటన్స్ సరుతూ.

"ఏమీ తెలియనట్లు నటించి మోసం చేశారు" వసంత, కదో అలవాటు, దొంగ కోపాలు తెచ్చుకొని ఎత్తి పొడవడం.

"మరి! నీ వేదో వాడిదెబ్బు, ప్లాన్లు వెండ ర్లుతో ధన్తుంటే, కూచో పెట్టి, ఏవో గాలి కబుర్లన్నీ వల్లెవేయించి..."

"చాల్లెండి!" వసంత తన చెంపల్తో నా నోరు మూసింది.

"ఎప్పుడు మీరు నన్ను మొట్టమొదటిసారి చూసి..." మళ్ళీ మొహంలెట్టి మధ్యలో ఆగింది వసంత.

"చూసి...?" తెలియనట్లడిగాను.

కోపంగా చూసింది వెక్కిరిస్తూ. మళ్ళీ మొదటికొచ్చి.

"అంతవరదాకా ఏదో పెంకిపిల్ల అనుకొ నుంటారుగదా! ఎప్పుడు తొలిసారి నాగు రించి..." సిగ్గుపడుతోంది పూర్తి చేయడానికి వసంత.

నాకు నవ్వొచ్చింది.

"ఆరోజు పార్కులో ముతాని తీసికొచ్చి దౌర్జన్యం చేశావే! ఆరోజు నీ కళ్ళలో ఉత్సాహం, పెంకితనం, కొంటెతనం... ఇంకా ఎన్నో కలిసిపోయి తాండవం చేశాయి గదా! ఆ వేళ!"

"పోండి" నవ్వు నాపుకుంటూ వాలిపోయింది వసంత.

ఏరోజు మొదటిసారిగా ఆమెని ప్రేమించింది? నాకే అనుమానం! ★

---

వాణి: 'తను ప్రేమించిన వ్యక్తికోసం ఆడది ఎంతకయినా వెనుదీయదు కాని మగవాడే...'

రాణి: 'ఆ విషయం నేను ఒక్కడితో కాదు–అనేకమంది విషయంలో తెలుసుకున్నాను!'

---

# భారతి

## 1959 నవంబరు సంచిక

### కవిత:

విశ్వనాథ మధ్యాక్కరలు: శ్రీ గిరి శతకము — శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఋషివాణి — శ్రీ బెన్నూరి శ్రీనివాసమూర్తి

విశ్వమున విశిష్టుడెవడు? — శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి

విప్రయోగి — శ్రీ సాళ్వ కృష్ణమూర్తి

కథావస్తువు పోయింది! — శ్రీ కె. బాబూరావు

### వ్యాసాలు:

ఎఱ్ఱగుండ భూపతి చేబ్రోలు శాసనము — శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

బూర్గులవారి భాషాసేవ — శ్రీ బి. రామరాజు

భారతీయ తత్త్వమీమాంస:

నేటి ప్రజారాజ్యాలు — శ్రీ కొటూరి వెంకటేశ్వరరావు

కోనగణపతి ఖండవల్లి శాసనము — శ్రీ నుదగా కృష్ణమూర్తి

రోహిణీ చంద్రమంగళ యోగము — శ్రీ రాళ్లపలి గోపాలకృష్ణమాచార్యులు

తృతీయ ప్రణాళిక: నిరుద్యోగ సమస్య — శ్రీ బులుసు వెంకటసుబ్బారావు

ప్రాకృతిభావ: శ్రీ పరవస్తువారి సేవ — శ్రీ నిడుదవోలు వేంకటరావు

ద్విపదభారతము: బాలసరస్వతి లోపాలు — శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మ

కథకళి సాహిత్యము — శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

నన్నెచోడుని వర్ణనలో వన్నెలు చిన్నెలు — శ్రీమతి వి. రాజేశ్వరి

సాహితీ సుగతుని స్వగతం — రామచంద్ర

### కథలు:

ఘటన — శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

తుంతవ్యులు! — శ్రీ "శిండిల"

### వ్యంగరచన:

మహాకవి శివయ్యగారి స్వీయచరిత్ర — శ్రీ యస్వీ జోగారావు

### కలగూరగంప:

"పల్లవుల శిల్పశైలి"

### గ్రంథవిమర్శనము:

వెన్నెలవాడ, రాగహృదయం, కావ్యమాల, గాంధీగీత, ఖైకేయి, చకోర సందేశము.

వార్తలు, మనవిమాటలు.

## వెల: రు. 1-0-0

మేనేజర్, భారతి, 7, తంబుచెట్టివీధి, మద్రాసు-1.




[గత వారం తరువాయి]

మేడ క్రింద నివసించే కూలివాళ్లు దాసీ ...నిషి దుకాణదారులు, పొరుగింటి అమ్మ...క్కలు తల్లికి, తాతయ్యకు బాగా పరిచితు...నట్లు గ్రహించాడు శివరాం. తన్ను చూసి ...రవంగా భయంగా తప్పుకుంటూ దారి ...చ్చే ఆమేడ క్రింది నిమ్న జాతులు ...తయ్యతో తల్లితో చనువుగా వచ్చి ...కరించే వారు. పండుగనాడు పిండ...ంటలు మామూలు దినాల్లో పచ్చళ్ళు, ...రగాయలు తోచినంతగా వాళ్ళకు ...భద్రమ్మ యిస్తుండేది. పొరుగింటి పిల్లలు ...తయ్య అంటూ బ్రహ్మయ్యగారిని ...చినంతగా శివరాం దగ్గరికి వచ్చేవారు కాదు. ...రుగు మనుష్యులు, ఉప్పు, పప్పు, బియ్యం, ...గ్గులు, రూపాయిలు అప్పులు తీసుకోవడం ...పాలకొదు కుంటున్నామనే సంతృ...లో తల్లి తాతయ్య వారికి అవసరమైన ...స్తువులు అందివ్వడం పరిపాటి అయి...యింది. కాని అప్పుగా పట్టుకెళ్ళిన ...స్తువులు వాపసు చేయబడవట్లు ...ప్పు దూకనిపించలేదు శివరాంకు.

ఆఫీసునుంచి రాగానే తన వస్తువులు సర్దు...నేటప్పుడు తాను గీసిన కొన్ని చిత్రాలు ...పించేవి కావు. ఏవో దృశ్యం దృష్టికి ...గా భావోద్రేకంలో సగం గీసి విడచిన ...త్రాలు, పూర్తి చేసినవి రంగుల్లో తీర్చిదిద్ది ... అలమరులో దొర్లుతుండేవి. కనిపించని ...మ్మలను గురించి ప్రశ్నిస్తే ప్రక్కయింటి ...కి పట్టుకెళ్ళిందని, క్రింద కాపురముండే ...యనుగారి అమ్మాయి ఆల్బంలో గుచ్చు...ందనీ, ప్రక్క మేడ నాయుడుగారి కోడలు ... యింట్లో ఫోటో కట్టించుకుంటానని ...సుకపోయిందని సుభద్రమ్మ చిరునవ్వుతో ...మాధాన మిచ్చేది. కొడుకు వేసిన చిత్రాలు ...రుగింటివాళ్లు పొగడుతూంటే, ఉబ్బి ...బ్బైపోయే అమాయక సుభద్రమ్మ, ఆ ...మ్మలు శిల్పము, నైపుణ్యం, విలువకట్టేంత ...కా కొడుకు మీద తనకు తల్లిగా ఉన్న సహజమైన అధికారం అండగాచేసుకుని పొరుగువారికి శివరాం వేసిన చిత్రాలు బహూకరించేది. తల్లిని ఏమనలేక శివరాం చికాకుగా మౌనం వహించేవాడు.

వాతావరణం నిత్యమూ ప్రశాంతంగా జరిగిపోతే పరిస్థితులకు విలువ కలగదు. పరిస్థితుల మార్పు మానసిక ప్రభావం మీద పని చేస్తుంది. అప్పుడు మానవుడు సహజంగా పొందవలసిన మార్పు పొందుతూంటాడు—శివరాం జీవితం నిండుగా ప్రశాంతంగాక చిలిపోవడానికికూడా ఆటంకాలు ఏర్పడ్డాయి.

ఇల్లంత చక్క దిద్దుతూ గరిటె తిప్పి కడుపులునింపే సుభద్రమ్మకీ అనారోగ్యం వ్యాపించింది. నడ్డిమీద వ్రణం బయలుదేరింది. మామూలు చిన్న సెగ్గడ్డ కావచ్చనే భ్రాంతిలో సుభద్రమ్మ తాను ఎరిగిన నాటువైద్యం చేసుకుంది. కర్పూరం గంధం నెయ్యి కలిపి వ్రాయడం ఏవో ఆకుల గుజ్జు నడ్డికి కట్టుకోవడంలో పదిహేనురోజులుగడచిపోయాయి.

బ్రహ్మయ్యగారికీ, శివరాంకుకూడా ఏమి చెప్పకుండా యింటిపనులు నిర్వహించుతూ నెమ్మదిగా ఓపిగ్గా కాలక్షేపం చేసింది సుభద్రమ్మ. రానురాను వ్రణం పెద్దదై ఎముకలను దొలుచుతున్నంత పోటు, సెగలు, పొగలు నరాలులాగెయ్యడం, రక్తం పీల్చుకుపోతున్నట్లు చిక్కిపోవటంతో సుభద్రమ్మ బాధ భరించుకోలేక పోయింది. శివరాంతో ఉన్న సంగతి చెప్పింది. నడ్డిమీద వ్రణం చూశాడు శివరాం. కప్పలాగ ఎదిగిన వ్రణం నిప్పు కణికలా కూర్చుంది వీపుమీద. శివరాం ఒళ్లు జలదరించింది భయంతో. తక్షణం డాక్టర్‌ను పిలుచుకు వచ్చాడు.

డాక్టరు వచ్చి పరీక్షించాడు. వ్రణం ఆపరేషను చెయ్యాలని నిర్ణయించాడు. బాగా ఎదిగి పక్వదశకు రావడానికి మరో వారం రోజులు గడువిచ్చి ఆపరేషను చెయ్యాలనుకున్నాడు. శరీరంలోకి మందులు, వ్రణం చుట్టు రాయడానికి లేహ్యం వంటి ముద్దమందులు పంపించాడు డాక్టరు. సుభద్రమ్మ చాకిరీ చెయ్యలేక మంచం పట్టింది. బ్రహ్మయ్యగారు చేతులు కాల్చుకుందుకు సిద్ధపడ్డారు. శివరాం ఒకొక్కసారి ఆయన్ను వారించినా ఆఫీసుకు వెళ్ళేస్థితిలో ఏమీ చెయ్యలేక పోయేవాడు. మందులు తేవడం, డాక్టరును పిల్చుకురావడం, రాత్రిళ్లు తల్లికి సేవ చేయడం...వీటితో శివరాం అలసిపోయి చిక్కిపోసాగాడు.

డాక్టరు ఒకరోజు సాయంత్రం ఆపరేషన్ చేశాడు సుభద్రమ్మకు. మత్తుమందులో కొంతకాలం మైమరచి పడిపోయిన సుభద్రమ్మ తెలివి రాగానే కోత బాధ భరించలేక విలపించింది బిగ్గరగా. ఓదార్చటానికి బ్రహ్మయ్యగారు ప్రయత్నించినా ఆమె బాధ తలుచుకుని ఆయనే కుమిలి కుమిలి పోయేవాడు. నిర్లక్ష్యంగా విచారంగా తిరగడం నేర్చిన శివరాం తల్లి పడే దుర్భర వేదన గమనించి మానవ సహజమైన కష్టాలుగురించి యోచించాడు.

ఆపరేషను జరిగాక సుభద్రమ్మ పరిస్థితి మరీ క్షీణించింది. వెన్నెముక వంటి వ్రణం ఎముకలనే దొల్చింది. ఎముకలు, చుట్టూ పుచ్చిపోయి విషపూరితమైపోయింది సుభద్రమ్మ శరీరం. ఆపరేషను జరిగాక, రెండు రోజులు పరిగామాట్లాడిన సుభద్రమ్మ అంత్య దశలు వెళ్ళగక్కింది. మెల్లిగా బరువుగా, నీరసంగా, ఆయాసంతో మూల్గుతూ, పరాకుగా మాట్లాడుతూ, చిక్కిపోయి పీల్చుకుపోయిన ముఖంతో, వికారంగా కనిపించింది సుభద్రమ్మ. డాక్టరు ఆమె పరిస్థితి చూసి బ్రహ్మయ్యగారి చెవిలో చెప్పాడు ఆమె అంత్యకాలం ఆసన్నమయిందని.

బ్రహ్మయ్యగారు ఆ వార్త విని చంటిపిల్లవాడిలా బెంబేలు పడిపోయారు. శివరాం నిర్ఘాంతపోయాడు. ఎంతో శాంతం, నెమ్మది, అణుకువ. గౌరవం, ఆప్యాయత, ప్రసరించే మాతృమూర్తి కళ్ళనుండే క్రమంగా అదృశ్యమైపోతోందని ఖిన్నుడైపోయాడు.

వ్యక్తుల విలువలు, ప్రయోజనాలు ఎదురుగా ఉన్నప్పటికంటే, లేనప్పుడే ఎక్కువగా ఒకొక్కసారి అర్థమౌతాయి. వార్ధక్యంలో బ్రహ్మయ్యగారికి ఇంట్లో ఆసరాగా

మేష్టారు: 'ఒరే గోపీ మానవుని చర్మం వల్ల శరీరానికి ప్రయోజనాలేమిట్రా!'
గోపీ: 'నాకు తెలిసినంతవరకూ ఒక్కటే సార్. అది మందుగావుంటే ఎంత కొట్టినా అట్టే నెప్పెట్టదు!'

ఉంటూ, ఎన్నో పనులు స్వయంగా గృహంలో నిర్వర్తించుకుపోతుండే సుభద్రమ్మ విలువ బ్రహ్మయ్యగారికి పూర్తిగా అర్థమయింది. తన భావిగురించి విచారంగా తలపోశారు బ్రహ్మయ్యగారు.

వ్రణ నివారణ సూత్రంకన్న మరణాసన్న సమయం డాక్టరు సరిగా గుర్తించాడు సుభద్రమ్మలో. డాక్టరు చెప్పిన ప్రకారం సుభద్రమ్మ క్రమక్రమంగా దిగజారిపోయింది. చైతన్యం తప్పి, కాళ్ళుచేతులు పటుతప్పి వేలాడిపోసాగాయి. రెండుదినాలు సుభద్రమ్మ స్పృహతప్పి మాట్లాడకుండా మరు జన్మంలోని తన స్థితిగురించి ప్రశాంతంగా ఏదో నేర్చుకుంటున్నట్లు చలనం లేకుండా పడి ఉంది.

ఒకరోజు మధ్యాహ్నం మూడు గంటలకు పరమపదించింది సుభద్రమ్మ. చనిపోయే ముందు పూర్తి తెలివితో బ్రహ్మయ్యగారిని, శివరాంను దగ్గరకు పిలిచింది. పిల్లలను జాగ్రత్తగా చూస్తుండమని బ్రహ్మయ్యగారిని కోరింది. కాని నిజం పరిశీలిస్తే పిల్లలచే సంరక్షించబడే పరిస్థితి తనకు వచ్చిందని, ముసలివాడైన తనకంటె ముందుగానే కోడలు చనిపోయిందని పుట్టెడు దుఃఖంతో లోలోపల కుమిలిపోయారు బ్రహ్మయ్యగారు. శివరాంను పిలిచి కంట తడి పెట్టింది సుభద్రమ్మ......! నీ పెళ్ళి కళ్ళారచూసే యోగం లేకపోయె...ఎంతకాలం శారదను జ్ఞప్తికి తెచ్చుకుంటావు?......శారద నీకు ద్రోహం చేసింది...మహాద్రోహం...! ఆవేదనలో సుభద్రమ్మ ఆఖరిశ్వాస దిగజారింది. పెళ్ళి చేసుకోమన్నట్లు ఆమె కుమిలి వాలిన ముఖంలోని తెల్లగుడ్లు, నల్లపాపలు సూటిగా చూపులు చూస్తూ శివరాంవైపు నిశ్చలంగా నిలుచున్నాయి.

తన జన్మకు కారకురాలై, తన బ్రతుకు అభ్యున్నతికి బీజమై, తన బాధల్లో కష్టాల్లో ప్రతినిత్యం తన్ను గురించి పలవరిస్తూ, తన క్షేమమే జీవిత ధ్యేయంగా పెట్టుకు బ్రతికిన మాతృమూర్తి తుదివాంఛ నెరవేరలేదు. కోడలును చూసుకోలేకపోయింది. శారద తన్ను వివాహమాడి ఉంటే మాతృదేవత మరణాంతంలో అంత ఆవేదన పడ్డానికి అవకాశం ఉండేది కాదు. తన బ్రతుకు మ్రోడులా ఒంటిగా నిలిచేది కాదు. ఒకే కుటుంబంలో, ఒకే రక్తసంబంధంతో, ఒకే సాంఘిక పరపతి హోదాల తరగతిలో జన్మించిన మనుష్యుల విధి మాత్రం వివిధం అని ఋజువవుతూనే వుంది. ఆవేదనలు, బాధలు, అంటే పెట్టుకునే మమతలవల్ల మానసికంగా కలిగే పరిణామాలే అనిపించేది శివరాంకు.

బ్రహ్మయ్యగారు ఒక వైపున, శివరాం మరొక వైపున మంచంమీద ఒరిగిన సుభద్రమ్మ శవం ఎదురుగా ఉబకివచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ కూర్చున్నారు. పొరుగింటి వారు తోచిన రీతిని ఊరడి వాక్యాలు చెప్పారు.



చిత్రం: కె. విశ్వనాథ్, మద్రాసు

దహనక్రియలు జరపడానికి శివరాం స్వయంగా ఏర్పాటులు చేసుకోవలసి వచ్చింది. బ్రహ్మయ్యగారు యింటి పెద్దైనా జవసత్వాలు ఉడిగిపోవడంవల్ల ఆ ప్రదేశం క్రొత్త కావడంవల్ల, ఆ బాధ్యత తప్పని సరిగా శివరాంమీద వదిలారు. మేడక్రింది నిమ్నజాతులు దాసీ మనిషి, సుభద్రమ్మ మునుపు పెట్టిన పిండివంటలు, ఊరగాయలు స్మరిస్తూ, విశ్వాసంగా శివరాం సలహాల ప్రకారం అన్నీ అమర్చారు. డాక్టరువచ్చి శివరాంను పరామర్శించి వెళ్ళిపోయాడు.

మేడ క్రింది కూలీలు సుభద్రమ్మ శవాన్ని ఎత్తారు. నిప్పుకుండతో శివరాం "కవాడి గూడ" శ్మశానంవైపు నడిచాడు. పురోహితుడు అతన్ని వెన్నంటాడు. తల్లిని మోసుకువచ్చిన కూలీల సహాయంతో శ్మశానంలో తల్లిశవం దహనం చేశాడు శివరాం.

చితిలో సుభద్రమ్మశవం కరిగిపోయి, నాలికలు చాచుకుని ఎగిరే అగ్నిరేఖల్లో ఆమె జీవం లీనమయిపోయింది. పశ్చిమ దిక్కున అస్తమించిన సూర్యుడు అరుణ రాగం వెదజల్లిపోయాడు. శ్మశానం కాపలా కాచేవాడు, పురోహితుడు, కూలీలు, బ్రహ్మయ్యగారు......అంతా తన చుట్లు మట్టిబొమ్మల్లా కనిపించారు. చైతన్యంలో కనిపించే వ్యక్తులు మరుక్షణంలో మట్టిలో కలిసిపోతారనే సిద్ధాంతం శివరాంకు ఒంటబట్టింది. శారద అదృశ్యమై పోవడం జీవితంలోని సరాగ కామితాలు నశింపజేసి నిర్లక్ష్యమైన భావాలు తనలో కలగచేస్తే, మాతృమూర్తి మరణం మనస్సులో ఆధ్యాత్మిక జ్ఞానం రగిల్చి నిశ్చింత వైరాగ్యం నిర్భయం శివరాంలో వ్యాపింపచేసింది. చిగురులేక, చలనంమాని మోడినిలుచున్న ఎండు మ్రోడులా కాంతి విహీనుడై పోయ్యాడు శివరాం.

అందిన తంతులు చూసుకుని మర్నాటి
లక్ష్మి, దీక్షితులు, వెంకటేశ్వర్లు సికింద్ర
బాదు చేరారు. సుభద్రమ్మ మరణించినందు
తమ సహజమైన మాతృప్రేమతో వి
రించారు, కొంతసేపు అన్నా చెల్లెళ్ళు
వెంకటేశ్వర్లు తల్లికి అంత్యక్రియలు పూ
చేశాడు.

అంత్యక్రియల పన్నెండు దినా
గడిచాక బ్రహ్మయ్యగారిని సంరక్షిం
బాధ్యత ప్రస్తావన వచ్చింది. కాశీ వె
పోయి అంత్యకాలం ఒంటరిగా గడుపు
న్నారు బ్రహ్మయ్యగారు. వెం
టేశ్వర్లు సహజ అభిమానంతో తనతో ఉం
మన్నాడు. లక్ష్మి, దీక్షితులు తమయింట
కాలక్షేపము చెయ్యమని కోరారు. తర్జ
భర్జనలయ్యాక బ్రహ్మయ్యగారు లక్ష్మిదగ్గ
అంత్యజీవితం గడపడానికి నిశ్చయించా

ఎంతో కాలం తను బ్రతికనన్న దిగు
బ్రహ్మయ్యగారినీ వేధించసాగింది.

బ్రహ్మయ్యగారు వెళ్ళిపోతూ శివరాం
బుజ్జగించి చెప్పారు. జీవితం క్షణికమ
బ్రతికిన రెండురోజులు భార్య పిల్లల
గృహస్థుగా బ్రతికి విధ్యుక్తధర్మ
నిర్వర్తించాలని బోధించారు.

ఒక శుభదినంనాడు వచ్చిన బంధువు
బ్రహ్మగారితో సహా నిష్క్రమించారు.

అందరూ వెళ్ళిపోగానే మేడమీద
యిల్లంతా చిన్నబోయింది. గాలి కొ
తున్న కర్టెన్ నీడల్లో సుభద్రమ్మ కదిలిన
ఏదైనా ధ్వనివస్తే, 'శివరాం' అని ఆమె పి
నట్లు ఉలిక్కిపడేవాడు శివరాంకొన్నాళ్ళ

కాలం మార్పులో, జీవితంలో జరి
వలసిన నిత్యకార్యక్రమాల్లో పరిసరా
ప్రభావంలో నూత్నరూపాలు ధరించుకు
మానసికదృక్కోణాల్లో శివరాం బాధ
మరిచి కాలం గడపసాగాడు.

ఆకాశంలో మేఘాలు పయనా
రూపురేఖలు మార్చుకుని పరుగిడుతున్నా
ఎండి మ్రోడైన చెట్లు కొల్లలుగా ఉద్భవి

# ★ అన్వేషణ ★

కుల శస్త్రాలలో ఆకారాలు మార్చు
కుంటున్నాయి. రవాణా రాపిడిలో శిథిలమై
నలిగిపోయిన కంకరరాళ్లు వీధిలో చెదిరి
పడి ఉన్నాయి. వాహ్యాళికి బయలుదేరిన
శివరాం అనుకున్నాడు. యీ అనంత జగ
త్తులో మారిపోయే ఋతువులు కాలంలో
రాలిపోయే ఆకులాంటిదే తన
జీవితం కూడా అని.

## 10

మరణసమయంలో తల్లి అన్న మాటలు శివరాం
చెవుల్లో నిత్యమూ ప్రతిధ్వనిస్తున్నాయి.
శారద నిజంగా తనకు మహాద్రోహం
చేసింది. బ్రతికిఉన్న రోజుల్లో యిదేవాక్యం
కొడుకు ముందు అనడానికి సుభద్రమ్మ
భయపడేది. బాధపడే కొడుకు హృదయం
మరీ కుమిలిపోతుందని. శారద లేచిపోయాక
ఆమెను తీవ్రంగా గర్హించిన మనుష్యుల్లో
సుభద్రమ్మ ఒకతె అని తేలిపోయింది...
శారద ఎక్కడఉందో...ఏం చేస్తోందో...
తరువాత ఏ సమాచారం తెలియలేదు. ఒక
వేళ లేచిపోయిన దుష్ప్రవర్తనకు పశ్చా
త్తాపపడి తిరిగి ఇంటికివస్తే, తన తల్లిగాని
తిరిగి బ్రహ్మయ్యగారుగాని ఆమెను క్షమి
స్తారనిమాత్రం శివరాం నమ్మలేకపోయాడు.
వారితత్వాలే అంత. శీలంలో ఏ మచ్చా
లేకుండా పరిపూర్ణ పవిత్రజీవితాలు గడ
పడం అలవర్చుకున్న జీవులు తల్లి, తాతయ్యా.

శారద తనకు ద్రోహం చేసింది నేభావ
కంటె తనకు ఆమెమీద కలిగిన అవ్యాజ
మైనప్రేమ ఒకరూపంపొంది తన కానందం
జీవితంలో కలగలేదనే నిరాశ నిస్పృహాలు
మాత్రమే శివరాంలో ఎక్కువగా. మథన
పెడుతున్నాయి. జీవితంలో తనకు చేసిన
ద్రోహానికి హృదయపూర్వక పశ్చాత్తాపం
వెలిబుచ్చుతూ క్షమించమని శారద ఎదురుగా
వచ్చి వేడితే, ఆమె కోరిక నిరాకరించే
తత్వం తనలో లేనట్లు గుర్తించాడు శివరాం.
గతాన్ని మరచిపోయి ఆమెమీద తనకు
ఉద్భవించిన ప్రేమానురాగాల ప్రబలతలో
ఆమెను తనహృదయానికి తిరిగి బంధించు
కోవాలనే కోరిక శివరాంలో అణగిపోలేదు.
అదేకోరిక ఇతరస్త్రీతో వివాహం చేసు
కోవాలనే కాంక్షను యింతకాలం అణచి
వేసింది.

ఉద్యోగాన్వేషణ, ధనాన్వేషణ తరు
వాత సాంఘికపరపతి అన్వేషణలో
విజయంపొంది, నలుగురిలో ఒకహోదా,
పలుకుబడి సంపాదించుకున్నాడు కనుక,
ఒకస్త్రీనికూడా సంపాదించుకుని కుటుంబం
ఏర్పరుచుకోవాలనే కోరిక శివరాంలో
మిణుకు మిణుకు మంటూంది. కష్టపడి ఉద్యో
గం,వివిధమార్గాలధనం,ప్రయత్నంమీద సాం
ఘిక కార్యక్రమాలలో పాల్గొని ప్రజాగౌర
వం పొందినా జీవితంలో అంతా శూన్యమే
ఉన్నట్లు గోచరించింది. శివరామ్ ఏ స్త్రీ
నైనా వివాహం చేసుకుని గృహస్థుడు కావ
డానికి శారదమీద కలిగిన ప్రేమతో
మనస్సంగీకరించకపోవటంవల్ల జీవితంలో
యింక చెయ్యవలసిన చెయ్యాగిన అన్వేషణ
ఏమిటో అర్థంకాలేదు శివరాంకు. అంతరి
ఆశల సాధనకై జీవితం కృషి చేస్తున్నప్పుడు
కార్యక్రమ చైతన్యంలో మానసిక ఆనందం,
కార్యవిజయంలో భౌతిక ఆనందం మనిషి
పొందుతాడు. ప్రస్తుతం అన్వేషించి
సాధించడానికి తనముందు ఏ ఉన్నత
సమస్య కనిపించకపోవడంతో జీవితంలో
స్తబ్దత ఏర్పడినట్లయింది శివరాంకు.

ఒంటరి గృహంలో ఉదయం దాసీమనిషి రాజవ్వవచ్చి అంట్లుతోమి, అన్నంవండి, వెళ్ళిపోతుంది. స్నానాదికాలు పూర్తి చేసుకుని భుజించి ఆఫీసుకుపోయి సాయంత్రం ఏ సాంస్కృతిక కార్యకలాపాలలోనైనా కాలంగడిపి హోటల్లో భోంచేసి రాత్రి పది గంటలకు యింటికిచేరి శయనించడం శివరాం దైనిక కార్యక్రమమైపోయింది. ఆదివారంనాడు ఎరుగున్న మిత్రులు ఎవరైన రావడం, వీలైతే ఏదైనా సినీమా చూడడమో, వీధుల్లో తిరిగి కబుర్లు చెప్పకోవడమో ఒక ప్రత్యేక కార్యక్రమం. జైనగరు మారుమూల బస్సుసౌకర్యం లేకపోవడంవల్ల స్నేహితులే ఎక్కువగా యింటికి రావటం లేదు. సర్వ సదుపాయాలున్న ఆయిల్లు వదులుకుని, అద్దెకొంపలు దొరకడం కష్టమైన పరిస్థితుల్లో ముఖ్యంగా తనలాంటి ఒంటరి మనుష్యులకు కొంపలు అద్దెకివ్వడం నిరాకరించే రోజుల్లో అద్దె ఎక్కువైనా ఆ యిల్లు వదల బుద్ధిపుట్టలేదు శివరాంకు. ఖర్చులు ఎక్కువైనప్పుడు ఆదాయాభివృద్ధికి కృషి చెయ్యాలే కాని ఖర్చులు తగ్గించుకో ప్రయత్నిస్తే జీవనప్రమాణం తగ్గిపోగలదనే సిద్ధాంతం నమ్మాడు శివరాం.

పేరిశాస్త్రి ఒకరోజు శివరాంయింటికి పని కట్టుకుని వచ్చాడు.

'నేనీ మధ్య ఊళ్ళో లేనోయి!...ఎంత పని జరిగింది!' ఎంతో నొచ్చుకుంటూ బాధపడుతూ వేదన వ్యక్తపరిచాడు శాస్త్రి

సుభద్రమ్మ మెత్తనిది, శాంతస్వభావం, దయార్ద్రహృదయవర్ణించి అమెకుటుంబాల్లో మణిపూస వంటిదని శాస్త్రి నిర్ణయించాడు. తిరిగి ఒంటరివాడైపోయి బాధపడుతున్నందుకు శివరాంకు తన విచారం తెలియజేశాడు శాస్త్రి. మనుష్యులంతా ఎప్పుడో ఒకప్పుడు భువినుంచి దివికి పోవలసినదేనని, మాతృదేవత గురించి ఖేదపడి ప్రయోజనం లేదని, బ్రతికిన రోజుల్లో ఎవరి విధ్యుక్తధర్మాలు వారు నిర్వర్తించుకోవాలని, అందువల్ల త్వరగా ఒక గృహస్థుడివై వంశాన్ని ఉద్ధరించమని శాస్త్రి సలహా ఇచ్చాడు శివరాంకు. ఒంటరిగా ఉన్నప్పుడు ధనం దుర్వ్యయం చెయ్యకూడదని ముసలితనంలో ఇప్పుడు దాచుకున్న సొమ్మే ఆధారమౌతుందని, అందువల్ల అవసరమైతే అతనిదగ్గర అతని అవసరాలకు పోగా మిగిలిన ధనం దాచి ఇష్టమైతే వడ్డీకియిచ్చి పదింతలుచేసి పెడతానని అయాచితమైన సహాయబుద్ధి వెల్లడిచేశాడు శాస్త్రి. శాస్త్రి మాటలు విని అన్నింటికి ఊకొట్టి ఊరుకున్నాడు శివరాం. తన సలహాలు కాలక్రమంలోనైనా అతనిమీద కొంత ప్రభావం కలగచెయ్యకపోవనే విశ్వాసంతో వెళ్ళిపోయాడు శాస్త్రి

ఆఫీసుదగ్గర బస్సుస్టాండువద్ద శివరాంకు కనిపించింది రాణి. కనిపించగానే రెక్కలు విచ్చుకుని ఎగిరివచ్చే పక్షిలా గాలిలో కోక కొంగులల్లాడించుకుంటూ గబగబఅంగలు వేసుకుంటూ దగ్గరికి వచ్చి నమస్కరించిందిరాణి.

"ఈమధ్య మా యింటికి రావడం మానేశారే కోపం వచ్చిందా?" రాణి అనునయంగా నవ్వుతూ పలకరించింది. శివరాం ఆమె వదనంలోని అమాయకసౌందర్యం దీన సంభావణ చూసి ప్రసన్నుడైపోయాడు.

"మీ మీద కోపం ఎందుకండీ...ఎప్పటికీ రాదు!..." నవ్వాడు శివరాం.

"కోపం రానేవచ్చింది... రాలేదనడం అబద్ధం!...ఆ సంగతి నాకు తెలుసు!..."

"ఈమధ్య మా అమ్మ చనిపోయింది... ఏవో కుటుంబ కష్టాలు...ఎక్కువగా ఎక్కడికీ వెళ్ళటంలేదు!" శివరాం తల్లి జ్ఞప్తికి రాగా విచారసూచకంగా తలదించుకున్నాడు.

"మీ అమ్మ చనిపోయిందా!" ఎవరో ఆపురాలు చనిపోయినంత కంగారుపడింది రాణి. తొట్రుపాటు సద్దుకుని,తల్లి మరణానికి శివరాంకు సానుభూతి చూపించింది రాణి.

'మా తాతయ్య మళ్ళీ మా చెల్లెలి దగ్గరికి వెళ్ళిపోయాడు... నేను ఒక్కడనే ఉంటున్నా ప్రస్తుతం!...'మాటలు పొడిగించాలని యథాలాపంగా అన్నాడు శివరాం.

'పాపం! ఒంటరిగా ఏం బాధపడుతున్నారో యింట్లో......ఎప్పుడైనా నేను మీయింటికి వస్తానుండండి!' ఆమాటల్లో తన్ను ఆహ్వానించమనే అర్థోక్తి రాణి విసిరినట్లు శివరాం అర్థం చేసుకున్నాడు.

'తప్పకుండా...మీరు ఎప్పుడువచ్చినా సుస్వాగతం!' నవ్వాడు శివరాం.

'మీరు యిన్నిసార్లు మాయింటికి వచ్చినప్పుడు నేను మీయింటికి ఒక్కసారి రాకపోవడం......అన్యాయంకదూ!' పెదాలు బిగపెట్టుకుని నవ్వింది రాణి......'పైగా మీరు నాబొమ్మ గీస్తానన్నారుకదూ...... అది ఇంకా బాకీయే!......మీతో చాలా మాట్లాడాలండీ!' చిలిపిగా బుజ్జగిస్తుంది ఆలోచనతో రాణి.

'అయితే వచ్చే ఆదివారం రండీ...!'

'తప్పకుండా...నాకు మీయిల్లు తెలియదుగా నేను సరిగా యీ బస్సుస్టాండు దగ్గరే మధ్యాహ్నం ఒంటిగంటకు ఉంటాను. ...మీరువచ్చితీసుకువెళ్ళాలి!"నవ్విందిరాణి.

"అలాగే!" అప్రయత్నంగా శివరాం అన్నాడు. ఇంతవరకు యేస్త్రీని వెంటబెట్టుకుని నడివీధుల్లో ఎక్కువగా తిరగని శివరాం, రాణిని వెంటబెట్టుకుని యింటికి తీసుకువెళ్ళడానికి కొంచెం జంకినా, స్త్రీ సాహసించి ఇంటికి వస్తానన్నప్పుడు తిరస్కరించడం అసభ్యమని ఊరుకున్నాడు శివరాం.

(ఇంకా వుంది)

నారాయణం నమస్కృత్య
నరంచైవ నరోత్తమం
దేవీం సరస్వతీం చైవ
తతో జయముదీర్యతే.

జయతి పరాశర సూనుః
సత్యవతీ హృదయనందనోవ్యాసః
యస్యాస్య కమలగళితం
వాఙ్మయ మమృతం జగత్పిబతి.

భద్రాకారుడవు సతత
భద్ర చరిత్రుడవు వీరభద్రుడవు మహా
భద్రాభిధానుడవు బహు
భద్రప్రదుడవు త్రిలోకపతివి మహేశా.

## అవతారపర్వము

౧

భగవంతుడైన విష్ణువుశరీరం ఏనీలవర్ణంతో ప్రకాశిస్తూ వుంటుందో, ఆ నీల వర్ణం కరిగి, జలమై, నదియై ప్రవహిస్తున్నట్లు వుంది యమున. శ్యామల వర్ణకాలైన మేఘమాలలతో పైన విరాజిల్లుతూవున్న విశాలమైన ఆకాశం







తన నీళ్ళలో ప్రతిఫలించడం చేత అది మరీ నీలంగావుంది. తన మేడల మీదవుండి, భూమిని చుట్టిన నల్లని త్రాచువలె, ఒడలెల్లా కొల్లగా ప్రవహిస్తున్న యమునను చూడగా కంసునికి భయం వేసింది. దేవకికి నిజంగా విష్ణువు జన్మిస్తాడా? ఆవిష్ణువుకూడా ఈనదికి మల్లేనే నల్లగావుంటాడు. ఈ నదినిపోలిన మెత్తని పెనుత్రాచు అతనికి శయనంగావుంది. అతను నిజంగా దేవకీగర్భమై అవతరిస్తే తాను ఏమి చెయ్యాలి? దేవకీ వసుదేవులను ఎప్పుడో తాను వారి ఇంటిలోనే బందీలు గాని బందీలనుగా ఉంచాడు. అంతఃపుర రక్షకులైన ప్రచ్ఛన్నులు, కంకవరులు వారిని ఎప్పుడూ, రెండుకళ్ళతో గాదు, వేయికళ్లతో కనిపెడుతున్నారు. దేవకి అష్టమగర్భం తనకు మృత్యువుగా పరిణమిస్తుందని నారదుడు చెప్పినతర్వాతనుంచీ తాను పడిన జాగ్రత్తలన్నీ ఒక్కసారిగా కంసుని మనస్సులో ఆడాయి. నారదునితో అయితే, పైకి తాను విష్ణువంటే ఏమీ భయంలేనట్లు, మృత్యువును ధిక్కరిస్తున్నట్లు మాట్లాడాడుగాని లోపలమాత్రం భయంభయంగానే వుంది. ఆరోజునుంచీ తన మనస్సు భయం అనే అగ్ని చేత దహించుకుపోతూ వుంది. ఆ భయంవల్ల తనలో క్రోధం ఎక్కువైంది. ఆ క్రోధంలో కంసునికి తన మిత్రులు, వారికి తాను ఇచ్చిన ఆజ్ఞలు జ్ఞాపకంవచ్చాయి. దేవకీగర్భంవల్ల భయంలేని ఏర్పాట్లన్నీ ఆ ఆజ్ఞలవల్ల సాగుతున్నాయి. దేవకికి శిశూదయం అవడం ఆలస్యం, ఆ శిశువును చంపివేయవలసిందిగా తాను ఆజ్ఞ చేశాడు! ఆ ఆజ్ఞలు చెల్లుతూ వున్నాయి. ఒకరువచ్చి చెప్పకుండానే వసుదేవుడే స్వయంగా వచ్చి, తనకు, కంసునికి—"అయ్యా! మీ చెల్లెలు ప్రసవించింది. మగపిల్లవాడు పుట్టినాడు" అని చెబుతున్నాడు. తాను వెళ్ళి ఆ శిశువును సంహరించివేస్తున్నాడు. ఇంకా భయం తన్ను వదలడంలేదు. ఎందుచేతనో, కంసునికి అర్థంకాలేదు.

కంసుడు యమునవంక చూస్తున్నాడు. పైన ఆకాశం నల్లని మేఘాలతో నిండివుంది. యమునలో తరంగాలు చప్పటలు చరుస్తూ తన్ను వెక్కిరిస్తున్నట్లు వున్నాయి. ఆనాడు అష్టమి అవడంచేత ఇంకా చంద్రుడు ఉదయించలేదు. రెండు ఎనిమిదుల ఘడియలు ప్రొద్దుపోయిగాని ఉదయించడు. ఆ చంద్రుడు ఉదయిస్తే యమున ఈ నల్లనిరూపాన్ని వదిలిపెడుతుందేమో! తనలో పాదులు కట్టివున్న భయంలాగా యమునకూడా, ఈ మధురఅగడ్తయై శత్రుదుస్తారంగా వుండవలసింది, ఇప్పుడు యమభగినియై, తన్ను భయపెడుతోంది. ఆకాశం వంక చూస్తే నీలవర్ణం; యమునవంక చూస్తే నీలవర్ణం; చంద్రుడు ఉదయించని కారణంచేత, ఉదయించినా కన్పిస్తాడన్న ధైర్యం చాలమి చేత, సర్వదిక్కులలోను నీలవర్ణం;-తన బ్రతుకంతటిని చీకటిచేస్తూ, సర్వరాక్షసలోక బద్ధవిరోధియైన విష్ణువు యొక్క వినీలవిరద





# హరివంశం



సవృత్తుమైనశరీర కాంతులు విజృంభిస్తున్నట్లు కంసుని మనస్సులో అవభాసించింది. విష్ణువు ఎవరు? తానెవరు? ఆ విష్ణువు అంటే తనకు ఈభయం దేనికి? నారదుడు వచ్చి "కంసా! నీవు పూర్వం కాలనేమివి. తారకామయ సమయంలో భగవంతుడు నిన్ను సంహరించాడు. ఆయన మీద క్రోధం తీరని నీవు ఇట్లా పుట్టావు" అని చెప్పాడు. అది నిజమా? ఎప్పటి కాలనేమి? ఇప్పుడు ఇట్లా తానుగా జన్మించడం ఏమిటి? శ్రావణ బహుళ అష్టమి తెస్తున్న చీకటుల ముసుగులో మధురానగరం యావత్తూ సంవృతం అయిపోతున్నట్లు, అజ్ఞానమనే చీకటి ముసుగుచేత సంవృతుడై పోయిన కంసునికి, ఏది ఏమిటో విశదంగా గోచరించడం లేదు.

కంసుడు ఆ చీకట్లలో తన మేడల మీద వుండి మధురానగరాన్ని కలయజూచాడు. ఆనగరం పరమోదారంగా వుంది. బురుజాలతో, ప్రాకారాలతో, అట్టాలకాలతో శత్రుదుర్భేద్యంగా వుంది. స్ఫీతము, సమృద్ధబల వాహనము, ఉద్యానవన సంపన్నము, ప్రాంసు ప్రాకారవసనము అయి, బహు పరిచయం చేత, పట్టపగలు చూస్తే, ఎట్లా కన్పిస్తుందో, అట్లాగే ఇప్పుడు గూడా అతనికి సుందరమై కన్పించింది. భవనాల మీద మూలలలో నాలుగేసి స్తంభములను లేవదీసి వాటిపై వేసిన కప్పులతో చతుష్కాలు కేయూరాల్లాగా వున్నాయి. ప్రాసాదాలు కుండలాల్లాగా కన్పించాయి. ద్వారాలు సుసంవృతాలై, గృహప్రకోష్ఠాలు సుందరాలై, దీపాలతో నవ్వులు ఒలకబోస్తున్నట్లు వున్నాయి. ఆపట్టణంలో ఒక్క రోగి లేడు. వీరుడుకాని మనిషి లేడు. పగటిపూటఅయితే నగరం, ఏనుగులచేత, గుఱ్ఱములచేత, ఎట్లా సంకులమై వుంటుందో తెలుస్తుంది. యమునా తీరంలో, చంద్రమండలంలో సగం భాగం వూడి, భూమిమీద పడి దల్లనై విస్తరించినట్లు వుంది మధుర. ఈ నగరం భోజకులోద్వహులైన తమ చేతుల్లోకి వచ్చింది. అప్పటినుంచీ అంతా ఈరాజ్యాన్ని ప్రజారంజకంగా పాలిస్తూవచ్చారు. పుణ్యములైన ఆపణములచేత, రత్నసంచయములచేత, దుర్గములచేత, సంపన్నమై, భోజకులస్థలైన రాజులకు ఇది గర్వకారణం గూడా అయింది. పంటలు పండలేదనిగాని వర్షాలు సరిగా పడలేదనిగాని ఎప్పుడూ లేదు.

తనతాత ఆహుకుడు. ఆయన మహావీరుడు. మహావీరు డనగా, సామాన్యమైనమహావీరుడు కాదు. ఆయన కాలంలో రాజులకు ఎవ్వరికి లేని ప్రతాపం అంతా మూర్తికట్టుకుని ఆ తాత రూపుదాల్చింది. శుభ్రమైన అశ్వకిశోరం ఎంతటి ఉత్సాహంతో వుంటుందో, ఆహుకుడు తన జీవితం అంతా అంతటి ఉత్సాహాన్ని ప్రదర్శించాడు. అందరి రాజులలాగా కాక, తాను ఒక ప్రత్యేక ఆసనాన్ని నిర్మించుకున్నాడు. ఉత్తమచర్మాలతో, దారుఫలకములతో దానిని నిర్మాణం చేయించాడు. ఎక్కడికిపోయినా, ఎనుబదిమంది దానిని మోయవలసివచ్చేది. దానిమీద ఆసీనుడై కాని ఆయన కదిలేవాడు కాడు. ఆహుకుని దేవతలు ఎప్పుడూ కాపాడుతూ వుండేవారు. అందువల్ల ఆయన్ను అంతా దేవరక్షితుడని గూడా అన్నారు. ఆయన ధర్మగుణం, ఆయన శౌర్యం విక్రమం ఎటువంటివి! అపుత్రికుడుగాని, అల్పాయుష్కుడుగాని, ఈవి యెరుగనివాడుగాని, అయజ్వగాని, ఎప్పుడన్నా ఆయన ముందుకువచ్చి నిలబడాడా! అసలు ఆయన ఏలుబడిలో అటువంటి అసత్పురుషులు వున్నారా? ఆయన సైన్యాలు నాల్గుదిక్కులను త్రొక్కివచ్చాయి. భూమి అంతటా ఆయన రథం, సకింకిణకిణమైనట్టిది, పరవళ్లు త్రొక్కింది. ఆ ఆహుకుని రాజులంతా భోజులన్నారు. అప్పటినుంచే తమ కులం భోజకులం అయింది. ఈ భోజులలో తన తండ్రి ఉగ్రసేనుడు తండ్రికి ఏమి తీసిపోయినాడు? ఆయన పరమ ధార్మికుడు. భోజాంధకవృష్ణి కులాలను ధర్మబుద్ధితో పాలించాడు. తాను ఆయన్ను సింహాసనంమీది నుంచి దించి, రాజ్యాన్ని ఆక్రమించుకున్నాడు. నిజంగా మాగధుడైన జరాసంధుడు, తనకు మామగారు, సహాయం చెయ్యకపోతే ఈ పని జరిగేదా! వారు తనకుమల్లేనే ఈ మధురను పాలించారా! వారు మధురను కన్నకూతురులాగా చూచుకున్నారు. మరి తానో? ఏమి చేస్తున్నాడు?

ప్రజలకు తనయందు ప్రేమవున్నదా? తన్ను చూచినవారు భయపడుతున్నారా? తనకు ఇష్టులు, మిత్రులు అయిన కేశి, అరిష్టుడు, పూతన, కాళియుడు మొదలైన వీరులు, కామరూపులై మధురా రాజ్యం అంతటా యథేష్టంగా విహరిస్తూ, తన పక్షాన్ని కాదన్నవారి నందరిని హతమార్చి వేస్తున్నారు. వీరిఅంత చూచుకొనే తాను, నారదుడు వచ్చి దేవకికి విష్ణువు పుత్రుడై ఉదయించి నిన్ను సంహరిస్తాడని చెప్పినప్పుడు, అగర్భంవల్ల తన కేమీ భయం లేదని చెప్పాడు. వీరిఅందరి అండవుండగా తన్ను ఎవ్వరూ ఏమీచేయలేరు. వీరు వుండగా, ప్రలంబుడు, శకటుడు, ఖరుడువుండగా, కువలయాపీడం వుండగా, చాణూరముష్టికులు వుండగా తనవంక తేరిచూడటమే ఎవరికీ సాధ్యం కాదు.

విష్ణువుఅంటే భయంవల్లనే ఈ ఆలోచనలు తనకు కల్గుతున్నట్లు కంసుడు మళ్ళీ అనుకున్నాడు. మళ్ళీ కంసుడు మధురను




చిత్రం: ఎమ్. వి. రమణమూర్తి, రాజమండ్రి.

గూర్చి ఆలోచనచేశాడు. ఈ మధుర ఎట్లా పుట్టింది? పూర్వం ఇదంతా అడవి. అప్పుడు దీన్ని మధువనం అనేవాళ్ళు. మధువు అనే రాక్షసుని ఏలుబడిలో వున్నందువల్ల దానికి ఆ పేరు వచ్చింది. అతనికి లవణుడనే రాక్షసుడు పుత్రుడై ఉదయించాడు. వాడు మహాఘోరుడు. సర్వభూతజాతమున్నూ వాణ్ణిచూచి గజగజ లాడిపోయింది. అట్లా కానివాడు ఒక్కడే ఒక్కడు. ఆయన అయోధ్యకు రాజు, రామచంద్రుడు. కంసునికి రామచంద్రుని పేరు పరమ అసహ్యమై మనస్సులో తోచింది. ఏ విష్ణువును తాను నిరాకరిస్తున్నాడో, ఆ విష్ణువుకు తన యీ మధురకు సంబంధం వుంది. ఆ రాముడే తన సోదరుడైన శత్రుఘ్నుణ్ణి పంపి, లవణాసురుణ్ణి సంహరించివేశాడు. మధువనాన్ని మధురగా, జననివాసయోగ్యంగా, సుందరతరంగా నిర్మింపజేశాడు. తన జీవితానికి, ఈ మధురకు విష్ణువుకు ఏదో ముడివీడని సంబంధం వుంది. ఏవిషయం ఆలోచిద్దామన్నా అతనికి విష్ణువుకథలే తోస్తున్నాయి. ఏ వస్తువునుచూచినా విష్ణుమయమై గోచరిస్తోంది. ఒక్కసారిగా కంసునికి నారదుని మీద చెప్పరానంత ద్వేషము, కోపము ఉద్భవించాయి. ఆ నారదుడనే దేవర్షి ఇక్కడికు ఎంత ధైర్యంతో వచ్చాడు! ఎంతధైర్యంతో తనకు దేవరహస్యం అని, దేవకి అష్టమగర్భం మాట చెవినివేసి పోయినాడు! ఆ ఋషి కలహభోజనుడు, ఆరోజున ఆయనతో సరిగ్గా తాను ఆమాటే అన్నట్లు కంసునికి స్ఫురణకు వచ్చింది. "విప్రుడా! నువ్వు ఎప్పుడూ రణోత్సాహివి. ఎవరికో ఒకరికి పోరాటం పెట్టి సంతోషిస్తూ వుంటావు నువ్వు పరమభేదశీలుడివి. ఎప్పుడు లోకంలో భేదాలు పుట్టించాలని, తిరుగుతూ వుంటావు. భేద సృష్టి కండూతితో చంచలుడవై చాంద్రాయణం చేస్తూవుంటావు. నరేంద్రులమైన మాబోటి వాళ్ళలో వైరతంత్రం ఎగసన్రోయడం నీకు అలవాటైపోయింది. నీ మాటలు నేను నమ్మను." అని అప్పుడు తాను అనగా, నారదుడు నవ్వుతూ వెళ్ళిపోయినాడు. తనలో విష్ణుభీతిని, ప్రాణభీతిని, బంధుద్వేషాన్ని సృష్టించి మరీ వెళ్ళాడు ఆ నారదుడే రాకపోతే ఎట్లా వుండేది? దేవకిని ఇట్లా తాను బాధించేవాడా? అది తన లఘుస్వస. కడగొట్టు చెల్లెలు. వసుదేవుడు తనకు నమ్మిన సామంతుడు. తన రాజ్యంలో గోవులు, గోష్ఠాలు సమృద్ధియై, క్షీరసముద్రాన్ని భూలోకానికి తెచ్చి తమ పొదుగుల్లో దాచుకొని పిండుతున్నాయి అంటే అది ఎవరి చలువ? వసుదేవుని చలువ. ఆ వసుదేవుడు, నేను, తన సంతానాన్ని ఆర్గురిని చంపగా, పరమశుచాదీనుడై, అల్లాడిపోతున్నాడు. దేవకి ఏమీ అనలేక లోలోపల కుమిలిపోతున్నది. ఈ దేవకిని, ఈ వసుదేవుణ్ణి, తాను ఒక్కసారిగా చంపివేస్తే! ఛా! అనుకున్నాడు కంసుడు. 'అతనిలో ఆత్మ రాక్షసమైనా, శరీరం మానుషమై, ఆ ఆత్మను నొక్కివేస్తున్నది. మానవమైన జన్మయొక్క హద్దులలో అతని రాక్షసమైన ఆత్మ విక్రాంతిని చెందలేకపోతున్నది. ప్రాణభయం కలుగుతుందన్న సందర్భాలలో తప్ప కంసుడు మానవశరీర మర్యాదమైన హద్దులను అతిక్రమించలేక, ఒదిగి వుంటున్నాడు. దేవకీవసుదేవులసంతానమే తన్ను సంహరించేది గనుక ఆ సంతానాన్ని కంసుడు సంహరిస్తున్నాడు. తన ప్రాణంకోసం ఇది చేయక తప్పదు. దేవకీవసుదేవుల వలన తన ప్రాణానికి అయినభయం ఇట్లా పరిహరింపబడుతున్నప్పుడు, వారిని చంపడం దేనికి?

ఈ ఆలోచనలలో కంసుడు దేవకీ శిశు జనన కథావిశేషాలను మనసారా మంథనం చేస్తున్నాడు. దేవకీవసుదేవులసంతానంలో తాను ఆర్గురినిచంపివేశాడు. వీరిని నిజంగా చంపవలసిన అవసరంలేదు. కాని చంపాడు. ఏదో గర్భం వృథా అయిపోయింది. దేవకికి అప్పుడు ఏడో నెల. అప్పుడు గర్భం పతనం అయిపోయింది. ఇప్పుడు తిరిగి దేవకి గర్భం ధరించింది. పుష్యమాసంలో తన యీ లఘుస్వస నీళ్ళు పోసుకున్నదని తన భార్యలు అంటున్నారు. ఇది శ్రావణం. ఎనిమిది మాసాలు దేవకికి నిండాయి. ఇంకా రెండు మాసాలవరకు తాను హాయిగా నిద్రపోవచ్చు కాని, ఈ ఎనిమిది మాసాలుగా తనకు ఆ నిద్రే కరువైపోయింది. ఇది అసలు దేవకికి అష్టమ గర్భమా? ఏడవగర్భం వృథా కాగా, ఇది అష్టమగర్భం ఎట్లా అవుతుంది? ఏమో! ఎవరు చెప్పగలరు? ఇప్పుడు ఎంతమాత్రం అప్రమత్తంగా వుండకూడదు. తనభార్యలు ఇది అష్టమ గర్భమే నంటున్నారు. కంసునికి ఎటూ పాలుపోవడంలేదు.

క్రిందికిదిగి, ఉద్యానవనంవైపుకు పోదామనుకున్నాడు కంసుడు. అక్కడ తన మిత్రులు చేరివుంటారు. వారితో ఉల్లాసంగా కొంతసేపు గడపవచ్చు. కంసుడు మేడలుదిగాడు. ఉద్యానవనంవైపుకు నడిచాడు. నడుస్తూ వుండగానే దూతవచ్చి, కైవారంచేసి, "మహారాజా! నారదులవారు దేంచేస్తున్నారు" అని చెప్పాడు. కంసునికి ఒళ్లు భగ్గున మండింది. ఇప్పుడెందుకు వస్తున్నట్లు? అనుకున్నాడు. "ఉద్యానవనంలోకి తీసుకురా" అని దూతకు ఆజ్ఞ ఇచ్చాడు.

వస్తున్న దేవర్షి నారదుడు ఆ చీకటిలో దీప్తాగ్నిలాగా మెరిసిపోతున్నాడు. ఆయన్ను చూస్తూవుండగా బాలసూర్యుడు ఉదయిస్తున్నాడా అనిపించింది కంసునికి. విశాలమై ఎడమవైపుకు త్రిప్పి కట్టబడిన జటామండలం, చంద్రుని వెన్నెలలాగా తెల్లనైన కట్టుబట్టలు; ఒక చేతిలో వీణ; దాని పేరు మహతి; ప్రేయురాలికివలె కక్షాసక్తం అయివుంది. ఉత్తరీయం; కృష్ణాజినం; హోమమయ యజ్ఞోపవీతం; దండం; కమండలం; సాక్షాత్తూ ఇంద్రుడా అనిపించే ఆకారం; నాల్గువేదాలు కంఠోపాఠమైనవాడు. ఉద్గాత; ప్రథమ ఋత్విజుడు. గాంధర్వవేదంలో పరమ విద్వాంసుడు. జుట్టు ముళ్లువేయడంలో అపరకలి. ఆ నారదుణ్ణి చూడగా కంసునికి కోపంరాలేదు. ద్వేషంపోయింది. వీతకల్మషుడైన నారదుని చూడగానే కంసునిలో కల్మష భావాలు కూడా ఊడని బారాయి. తేజస్సులో అగ్ని, వర్చస్సులో సూర్యుడు అయిన నారదునికి కంసుడు అభివాదంచేసి; యథావిధిగా పూజలుచేసి అగ్నివర్ణాభమైన

# హరివంశం

ఆసనాన్ని తెప్పించి వేయించి, మర్యాదలు నడిపించాడు. "కంసుడా! నువ్వు వీరుడివి, విధి దృష్టిని అనుసరించిన కర్మలచేత నన్ను సత్కరించావు. సరే! నీకు రెండు మూడు మాటలు చెప్పిపోదామని వచ్చాను" అన్నాడు నారదుడు. కంసుడు ఏమీ మాట్లాడలేదు. సావధానుడై నిలబడినాడు, అతని మిత్రులుగూడా అతనిప్రక్కనే నుంచున్నారు. నారదుడు ఇట్లా చెప్పాడు! "దేవకి గర్భం అష్టమగర్భం అవునా, కాదా, అని నీవు మనస్సులో బాధపడుతున్నావు. ఆ సందేహం తీరుస్తాను. ఇది ఆమె అష్టమ గర్భమే. ఏడవగర్భం వృధా అయిందని నీవు అనుకుంటున్నావు. కాలేదు. భగవంతుడు యోగమాయచేత, ఆ సప్తమగర్భాన్ని ఆకర్షించి రోహిణీగర్భంలో ప్రవేశపెట్టించాడు. వసుదేవుని భార్యలనందరిని నీవు నిర్బంధంలో వుంచగల్గావుగాని, రోహిణి నిన్ను కికురించి తప్పించుకుపోయింది. ఆమె ఎక్కడవున్నదీ నీకు తెలియదు. ఆమెకు ప్రభువు అంశగా సంకర్షణదేవుడు, బలరాముడై ఉదయించాడు. దేవకికి ఇప్పుడు ఎనిమిదో నెల. ఇవ్వాళ్ల ఆ ఎనిమిదో నెలలో ఎనిమిదో రోజు. ఈ రోజుననే ప్రభువు అవతరిస్తాడు. ఎంత అదితి దేవకియై అవతరిస్తే మాత్రం ప్రభువును పదినెలలు ఎట్లా మోయగల్గుతుంది! ప్రభువు అవతారం ఎత్తేది ఈ రోజునే. అందులో అనుమానం ఏమీ లేదు. దేవతలు ఏపని రహస్యంగా చేయరు. వారి ఆలోచనలన్నీ నేను నీకు ఎప్పటికి అప్పుడే చెరవేస్తూ వచ్చాను. ఇప్పుడు ఈ విషయం కూడా చెప్పివేశాను. తర్వాత నీ యిష్టం". కంసుడు అతని అనుచరులు నిర్విణ్ణులైపోయారు. వారికి ఏమి అనడానికి తోచలేదు. నారదుడు లేచి "నేను వస్తాను" అని, మళ్లీ ఏదోవిషయం జ్ఞాపకంవచ్చినట్లు కూర్చున్నాడు. మళ్లీ కంసుణ్ణి సంబోధించి ఇల్లా అన్నాడు; కంసుడా! మహాగర్భులనే దానవులు వున్నారు ఎరుగుదువుగదా! హంసుడు, సువిక్రముడు, క్రోధుడు, దమనుడు, రిపుమర్దనుడు, క్రోధహంత వారి పేర్లు. వారు కాలనేమి పుత్రులు, హిరణ్యకశిపుని శాపంవల్ల వాళ్లు నిరుద్ధతేజస్కులై, పాతాళలోకంలో జలంలో గర్భగృహంలో పడివున్నట్లు పడివుండగా, ప్రభువు వారిని, యోగమాయాబలంచేత, దేవకీ గర్భంలో ప్రవేశపెట్టించాడు. నీవుచంపిన దేవకిసంతానం ఈ అరుగురే. అదివరకే చెప్పాను. నువ్వు కాలనేమివి." ఈ మాటలుచెప్పి నారదుడు వెళ్లిపోయినాడు.

ఆ తర్వాత అక్కడ చీకటితప్ప, మ

యేమీ కంసునికి కన్పించలేదు. అంత చీకటిలోను నారదునికి తాను వేయించిన ఆసనం ఒక్కటే అగ్నివర్ణాభమై మెరిసిపోతున్నది. ఉద్యానవనంలో తన కంటిచూపుకు అందినంతమేరా, ఆ చీకటిలో ప్రతిచెట్టు, సహస్రశీర్షుడైన పురుషుడు విప్పిన పడగలాగా కంసునికి గోచరించింది. ఆ వనం యావత్తూ అనంతశయానుడైన విష్ణుమూర్తి నేలకు దిగివచ్చినట్లు తోచింది. నారదుడు వదలిపోయిన ఆసనం కౌస్తుభంలాగా ప్రకాశిస్తున్నది. కంసునికి ఏమీ తోచలేదు. మిత్రులతో మాట్లాడ బుద్ధి కాలేదు. వారితో మాట్లాడకుండానే, వారి వంకనైనా చూడకుండానే కంసుడు అక్కడినుంచి కదిలిపోయినాడు. అతని మనస్సు, బుద్ధి, హృదయం, సర్వం భయం చేత స్తంభించిపోయినాయి. అతని శరీరం విచిత్రంగా స్తంభాన్ని భజించినట్లయిపోతున్నది. పరమనికృష్టమైన విగ్రహం, ఇంద్రజాలంలో కదిలినట్లు కదిలివస్తున్న కంసుణ్ణి చూచి అంతఃపురంలో అతని భార్యలు హడలిపోయినారు. కంసుడు వారివంక గూడా చూడలేదు. ప్రచ్ఛన్నులు తెచ్చి ఆసనం వేయగా, తనకు తెలియకుండానే, కంసుడు దానిమీద కూర్చుండిపోయినాడు. ఇదమిద్ధమని చెప్పరాని ఒకానొక అనిర్వాచ్యమైన ఉన్మాదం అతణ్ణి ఆవరించింది. నోరు మెదపలేదు. కాలు కదపలేదు. చేయి విదిలించలేదు. కంసుని భార్యలు చాలా కలవరపడ్డారు. కంసునికి శైత్యోపచారాలు చేస్తున్నారు. అతడు సేదతేరి అబ్బా! అనుకున్నాడు. ఎవరితోనూ ఏమీ మాట్లాడలేదు. నిద్రవస్తున్నది. కన్నులు అరమూతలు పడినట్లు వున్నాయి. అతనివి విశాలమైన నేత్రాలు. చంద్రుడు లేని రాత్రివేళ కలువపూవులు మూసుకుపోయినట్లు మూసుకుపోయినాయి. అందరికి నిద్ర వస్తున్నట్లే వుంది. అంతా నిద్రావశులై, మదిర త్రాగినవారిలాగా తూలుతున్నారు. అదేమి చిత్రమో! శ్రావణ బహుళ అష్టమినాటిరాత్రి అభిజిల్లగ్న వేళకు మధురలో ఒక్క పురుగుకూడా చలించలేదు. నిద్రాదేవి వచ్చి మధురను ఆవరించినట్లు వుంది. ఇట్లా ఎంతసేపు జరిగిందో ఎవరికీ తెలియదు. ఆ అంతటివేళలోను ఏమిజరిగిందోగూడా ఎవ్వరికి తెలియదు. తెలతెలవారుతూ వుండగా వసుదేవుడు కంసుని మందిరాలకువచ్చి "బావా! దేవకి ప్రసవించింది." అని చెప్పేవరకు ఆ అంతఃపురం అంతా పరమ అవ్యక్తమైన స్థితిలో వుండిపోయింది. వసుదేవుని కంఠం చెవిని సోకి కంసుడు ఉలికిపడిలేచాడు. "పుట్టింది మగపిల్లవాడేనా! ఏదీ ఖడ్గం; ఏదీ ఆయుధం; ఏదీ ముద్గరం; ఏదీ పరశ్వధం" అంటూ పలవించాడు.

వసు: బావా! మగపిల్లవాడు కల్గలేదు. నీకు మేనకోడలు పుట్టింది.

కంసుడు ఆ మాట విని తేరుకున్నాడో, దిగ్భ్రాంతి చెందాడో, ఎవ్వరూ చెప్పలేరు. "మగపిల్లవాడు పుట్టలేదనేఅంటావా! నువ్వు అబద్ధం ఆడేవాడివి కావు. అయినా పోయి చూద్దాం, పద" అన్నాడు. ఇరువురు దేవకి ప్రసూతి మందిరానికి వచ్చారు. అదే ప్రసూతి మందిరం; కారాగారంలాగా వుంది. దేవకి శిశువును అక్కున హత్తుకు కూర్చుంది. కంస వసుదేవులను చూచి, ఆ శిశువును అక్కున అదుముకునే లేచింది. కంసుడు దేవకి చేతుల్లోంచి శిశువును లాక్కోబోయినాడు. దేవకి వలవలా విలపించి ఇట్లా అన్నది: "నీవు నాకు అన్నవు కావు. నీవు కంసుడవు. ఇది ఆడశిశువు. దీనైనా బ్రదకనీ; మగశిశువుగదా నిన్ను చంపుతాడని దేవవాణి చెప్పింది. ఇది దారిక. దీన్ని వదలు." "ఆ శిశువు ఆడదనటానికి నాకు నమ్మకం ఏమిటి?" అన్నాడు కంసుడు. దేవకి చేతుల్లోంచి పిల్లను బలాత్కారంగా లాక్కోబోయినాడు. దేవకి అతణ్ణి అపవారించి పిల్లను చూపించింది. మళ్ళీ కంసుణ్ణి అర్థించింది: "కంసా! ఇది ఆడశిశువు కల్గింది. నిన్ను యాచిస్తున్నాను. ఇంతవరకు ఏడుగురు సంతానం కల్గగా, వారిని నీకు అర్పించాను. ప్రభూ! వారు మగపిల్లలు, ఇది ఆడకూతురు. ఇది విచారించు" అన్నది. కంసునికి ఆమె దీనాలాపాలు చెవికి ఎక్కలేదు. దేవకి అష్టమగర్భం ఏదైతే నేమి, అది తనకు మృత్యువు కావచ్చు. నారదుడు తన్ను మోసం చేయ్యాలని ఆడశిశువును కూడా మగశిశువు అని చెప్పివుండవచ్చు. విష్ణువు ఆడరూపం ఎత్తడని ఎక్కడ వుంది? ఈ ఆలోచనతో అతనిలోని రాక్షసమైన ఆత్మ ప్రకోపించింది. వెంటనే అతడు వికటాట్టహాసం చేశాడు. ఆ ఆడశిశువును గూడా చంపివేయాలనే చికీర్షతో, మాయవదలని దానిని, గర్భంబుక్లిన్నమూర్ధజ అయిన దానిని, దేవకి తెచ్చి తనముందు వుంచిన దానిని, కర్కశంగా గ్రహించి శిలాతలంపై విసిరికొట్టాడు. కొట్టడమే తడవుగా ఆ బాలిక ఆకాశంలోకి ఎగిరింది. కంసుడు అనుకున్నట్లు శీర్ణమై, భిన్నమై, ముద్దకట్టుకు పోలేదు. అందరు తలఎత్తి పైకి చూచారు. హాహాకారాలు చేశారు. అక్కడవారికి ఒక అద్భుతం దృశ్యమానమైంది. దివ్యమాల్యానులేపనయైనకన్య, ముక్తమూర్ధజయై, నీల పీతాంబరధారిణియై, గజకుంభోపమస్తనియై, హారకేయూరసర్వాంగియై, మకుటోజ్వలభూషితయై కన్పించింది. రశనవిస్తీర్ణజఘనయై దర్శనం ఇచ్చింది. చంద్రునివంటి ముఖము కలది, నాల్గు చేతులలో ఆయుధములు కలది గోచరించింది. ఆమె శరీర వర్ణం స్పష్టవిద్యుద్వర్ణాభిరామంగా వుంది. కన్నులు బాలసూర్యునివలె ప్రకాశిస్తున్నాయి చుట్టూ భూతగణం పరివేష్టించి వుంది వారితో కలిసి ఆమె నృత్యం చేస్తోంది. నవ్వుతోంది. విపరీతంగా ప్రకాశిస్తున్నది. పరమమైన రౌద్రం ఆకారం దాల్చినట్లు, వికటాట్టహాసం చేస్తున్నది. అనుత్తమమైన సురను సేవిస్తున్నది. ఆ మహాదర్శనాన్ని చూచి కంసుడు భయకంపితుడైపోయినాడు. ఇప్పుడు తాను చేసిన పనిని అసలు చేయకుండావుంటే బాగుండేదనుకున్నాడు. ఆ దివ్యశక్తి మహాహాసం చేస్తూ కంసుణ్ణి సంబోధించి ఇట్లా అన్నది: రే! రే! కంసుడా! నీకు ఆత్మనాశం అయ్యే రోజులు దగ్గరలోకి వచ్చాయి నన్ను ఇప్పుడు ఈ విధంగా శిలా తలంమీద వేసి కొట్టబోయావు! నిన్ను సంహరించేవాడు వచ్చి ఆ సంహారం జరిపేరోజున, ఈ అనుభవం నీకు వస్తుంది. నిన్ను అతడు చేతులతో మొత్తి, నెత్తురులు కార్చినప్పుడు ఆ నెత్తురుని నేను గ్రోలుతాను." ఈ మాటలు చెప్పి దేవి అదృశ్యురాలైపోయింది. ఆ రోజునుంచి ఆమె వృష్ణికులజులకు ఆరాధ్యదైవం అయిపోయింది. ఆమె యోగకన్య. కేశవుని రక్షణకోసం, ఒక అంశగా ఇట్లా అవతరించింది. ఇప్పుడు కౌశికియై, వింధ్యవాసినియై, లోకాన్ని ఏలుతున్నది.



"ఏడిపో తారండి! జాగ్రత్త!"

చిత్రం: కుమారి టి. భామాదేవి, (చిత్తూరు)

కంసుడు అప్పటికి తెప్పరిల్లుకున్నాడు. అతనిలో అప్పుడు కల్గిన నిర్వేదం నిజమో, అబద్ధమో, చెప్పడం కష్టం. చూస్తున్న వాళ్ళకు అది నిజంగానే కన్పించింది. అతడు పరమదుఃఖాన్ని ప్రదర్శిస్తూ దేవకి కాళ్ళమీద పడ్డాడు. "దేవకీ! నీవు నాకు చెల్లెలువు కావు. తల్లివి. నన్ను క్షమించు" అన్నాడు. "మృత్యువంటే భయం ఎవరి

# పాండ్స్

## డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ వాడి

ప్రొద్దున్న ఉండే తాజాదనమును

రోజంతా పొందండి




స్నానముచేసిన తరువాత పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ పౌడరును రాసుకొంటే రోజంతా తాజాగా మరియు హాయిగా ఉండగలరు!

తేలికైన సువాసనగల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ పౌడరు ఎంతో మృదువుగా ఉంటుంది మరియు చెమటను పీలుస్తుంది. దీనిని రాసుకొని తాజాదనపు హాయిని రోజంతా అనుభవించండి!

చీస్‌బ్రొ-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

[P. 7710

కైనా వుంటుంది. దాన్ని పరిహరించుకు నేందుకు నరుడు ఏమైనా చేస్తాడు. అట్లాగే నేను నీ సంతానాన్ని హరించాను. కన్యక బుద్దినై నే చేసిన ఈ చెడుగువలన స్వజనానికి అపచారం జరుగుతుందని గూడా ఆలోచన లేకపోయింది. పురుషకారానికిపోతే దైవం ఇట్లా నన్ను దెబ్బతీసింది" అని విలపించాడు. కొంతసేపు దేవకిని ఓదార్చాడు. "గర్భగతమైన దుఃఖాన్ని వదిలిపెట్టు. దేవకీ! సంతానజమైన సంతాపాన్ని త్యజించు" అన్నాడు. మరికొంతసేపు తత్వబోధ చేశాడు: "చూడు దేవకీ! నేను నీ పిల్లలను నిజంగా చంపానంటావా! లేదు. నేను వట్టి హేతుభూతుణ్ని. సర్వం కాలవిపర్యయంవల్ల జరుగుతుంది. కాలం మనల్ని అందర్నీ ఏలుతున్నది. మనం వట్టి నిమిత్తమాత్రులం. ఉపద్రవాలు యథాభాగాలై ప్రవర్తిల్లుతాయి. ఎవరికర్మ ఎట్లా వున్నదో వారు అట్లా నడవక తప్పదు. ఇక తానే కర్తను అనుకునే మానవుడు వున్నాడో, వాడు వట్టి జంతువు." అన్నాడు. మళ్ళీ కంసుడు దేవకిని అనునయించాడు. "దేవకీ! ఇక ఈ చింతను వదిలివెయ్యి. ఊరికే అట్లా విలపించకు. ఏ కాలానికి ఏది ఎట్లా జరగాలో అది అట్లా జరిగి తీరుతుంది. అందులో ఎవరు చేయగల్గింది ఏమీలేదు" అన్నాడు. ఈ మాటలు అని మళ్ళీ కంసుడు దేవకి కాళ్లు పట్టుకున్నాడు. "నామీదవున్న కోపాన్ని వదిలిపెట్టు, దేవకీ, నన్ను నీ పుత్రుణ్ణిగా చూసుకో" అన్నాడు.

దేవకి కళ్లు నీళ్ళతో నిండిపోయినాయి. ఆమె అతి దీనయైవుంది. కంసుని ఈ నిర్వేదం ఆమెను కదిల్చివేసింది. ఆమె ఒకసారి భర్తవంక చూసింది. ఆ వెంటనే కంసుణ్ణి చేతులతో లేవనెత్తి "నాయనా! లే! నాయనా! లే" అన్నది. సాక్షాత్తూ తల్లి అయినట్లు మాట్లాడింది. "నాయనా! నా పిల్లలను నువ్వు చంపావు. అందుకు నువ్వే కారణం అని నేను ఎట్లా అంటాను. అందుకు ఆ యముడు కారణం. నువ్వు నా సంతానాన్ని హరించినా నేను సహించగలాను. ఇప్పుడు ఇట్లా నీవు నా పాదాల మీద పడగా సహించలేకుండా వున్నాను. పుట్టిన ప్రతివాడికి మృత్యువు వ్రాసేవుంది. బాల్యం, యౌవనం, వార్ధక్యం, అన్నీ ఆ మృత్యువు అధీనమయ్యే నడుస్తూవున్నాయి. కాలంయొక్క పద్ధతి అది. పిల్లో, పిల్లవాడో పుట్టకముందు ఆ శిశువును మనం ఎరుగున్నామా? గాలి ఎట్లా కన్పించదో, అట్లాంటిదైన శిశువు అట్లాగే కన్పించదు. ఒక శిశువు కల్గిందే అనుకో; అది చచ్చిపోగా, ఎక్కడికి పోతున్నది, ఏమౌతున్నది గూడా మనకు తెలియడంలేదు! ఆ విధి దాన్ని ఎక్కడికి లాక్కుపోతే అక్కడికి పోతున్నది. పుట్టుకయేమి, మృత్యువు యేమి, అన్నీ విధిని అనుసరించి జరుగుతున్నాయి. నీవు చంపకముందే నా పిల్లలను విధి చంపివేశాడు. కాని ఆ చంపావన్న నింద నీకు రావలసివుంది. ఇందులో నేను అనుకునేది ఏమీలేదు. నీవు సుఖంగా వుండు" అన్నది.

దేవకి ఈమాటలు విని కంసుడు తన మందిరాలకు వెళ్ళిపోయినాడు. తన మం రాలలో అయితే ప్రవేశించాడుగాని, మనస్సులో భయంపోలేదు. క్రోధం పోలేదు. అవి అతని మనస్సును దహిస్తూనే వున్నాయి. ఒకడు ఒక ప్రయత్నం చేశాడు. అది సాగిరాలేదు. ప్రతిహతం అయిపోయింది. అటువంటివాడు ఎంతగా విమనస్కుడైపోతాడో, కంసుడు గూడా అంతగాను విమనస్కుడైపోయినాడు.

(సశేషం)



# వనితా లోకం



## "మనలోనే ఉన్నాయి లోపాలు"

ఈనాడు మన మహిళలంతా ఏకకంఠంతో 'స్త్రీలు యింతగా దిగజారిపోవటానికి మగవారే కారణము'ని అంటూ, తప్పునంతా పురుషులమీదనే వేస్తున్నారు. మనం నింపాదిగా ఆలోచిస్తే, మనలో వున్న లోపాలు మనకే కనిపిస్తాయి. ముందు మనలోని లోపాలు సరిదిద్దుకొన్నాక, మగవారు మనకు చేస్తున్న అన్యాయాలను పేర్కొనడం సమంజసంగా వుంటుంది. అందుకే ముందు యింటగెలచి, రచ్చ గెలవమన్నారు.

ఒక పెళ్ళికాని అమ్మాయినిగూర్చి ముందు విమర్శిస్తారు?...అమ్మలక్కలు!... అమ్మలక్కలు మనలోని వారేకదా! వుద్యోగం చేస్తున్న స్త్రీని ఏ పురుషుడు నిందించలేడు. కాని మన స్త్రీలే 'ఆచారాలన్నీ మంట గలసిపోతున్నా'యని, 'ఇక స్త్రీలందరూ బజారువెంటబడే రోజులువస్తున్నా'యని అనటం ప్రారంభిస్తారు. అంతెందుకు, కన్నకూతురును కాలేజీలో చదివించటానికి ముందు ఎవరు వెనుకంజవేస్తారు? తల్లియే! మగవారితో సమానంగా వేదికలెక్కి ఏ స్త్రీయైనా మాట్లాడితేచాలు, తమజాతి కేదో ఆపద ముంచుకొస్తోందని తమలో తాము గుసగుసలు జరుపుకొంటారు మన మహిళలు.

ఒక బాలవితంతువుకు, తిరిగి వివాహం చేయటానికి సామాన్యంగా ఏ తండ్రీ అడ్డు చెప్పడు. ఎక్కడో నూటికో, కోటికో ఒకరు తప్ప. కానీ, ఆ వితంతువు తల్లి, వెంటనే ప్రాణత్యాగం చేసినేంత హంగామా చేస్తుంది. తనలో వూపిరివున్నంతకాలం, తన కూతురుకు రెండవపెళ్ళి జరిపించటానికి ఏమాత్రం యిష్టపడదు.

—ఈవిధంగా నిజంగా ఎవరు స్త్రీస్వాతంత్ర్యానికి అడ్డు తగులుతున్నారు? అయితే 'స్త్రీ అభ్యుదయానికి పురుషులెంతమాత్రం అవరోధకులు కారా?' అని మీరు ప్రశ్నించవచ్చు. పూర్వం, పురుషులు స్త్రీలను, వంటింటి సామ్రాజ్యానికి, సామ్రాజ్ఞిగా చేసి, 'మీ కంతకన్న కావలసిందేమున్న'దనే తేనెలూరె మాటలుజెప్పి, కొంతవరకు స్త్రీస్వాతంత్ర్యాన్ని అరికట్టారు. అది నిజమె కాని పతనావస్థలోనున్న స్త్రీని చూసి మగవారు జాలి చూపించకున్నా మామూలుగా స్త్రీలు చూపే హీనదృష్టితో మాత్రము చూడలేదు. అంతెందుకు ఆనాడు వీరేశలింగంగారు అనాథశరణాలయం స్థాపించేసరికి, పురుషులకంటె స్త్రీలే ఎక్కువగా విమర్శించారు. (ఇక్కడ స్త్రీలు అనటంకంటె వృద్ధవితంతు స్త్రీలు అనటం బాగుంటుందేమో!)

**జి. శైలజ**
**(కనేకల్లు)**

ఈనాడు వ్యభిచారిణల సంఖ్య పెరిగిపోతున్నందుకు పురుషులే కారణమంటున్నారు. కొంతవరకు మగవారే కారణమైనా పూర్తిగ కాదు. పిల్లి, ఎలుకకోసం పొంచివుంటుంది. అకస్మాత్తుగా ఎలుక పిల్లినోటికి దొరికినా అది ఎలుకదే తప్పవుతుంది కాని, పిల్లిదెమాత్రం కాదు. ఎలుక జాగ్రత్తతో పిల్లి బారినుండి తప్పించుకోటానికి అవకాశముంది. అదేవిధంగా స్త్రీ తన శీలాన్ని అతి జాగ్రత్తతో కాపాడుకొంటూవుంటె, ఏపురుషుడూ దగ్గరకు రాలేడు. ఆర్థికదుస్థితివల్ల, లోకజ్ఞానం లేనందువల్ల ఆలా వ్యభిచారిణులు పెరుగుతున్నారేకాని, దానికి పురుషులు మాత్రమే కారణంకాదు. బాలవితంతువులను, యింటిలోనున్న స్త్రీలే రాచిరంపాన పెట్టున్నందువల్ల, వారు ఆలా మారటానికి కొంతకారణమవుతుందేమో!

ఈనాడు వరకట్నాలు పెరుగుతున్నందుకు మనమే కారణం. తమ తాహతుకు సరిపోయే సామాన్యునికి, తన కూతురును ముడిపెట్టకుండా, లేనిపోని ఆశలుపెట్టుకొని, విద్యావంతుడు, రూపవంతుడూ ఆస్తివంతుడే తనకు అల్లుడుగా రావాలని పట్టుబడుతుంది నేటికాలపు స్త్రీ. ఇక అటువంటి అల్లుళ్లు కొండమీదికెక్కి, 'ఇన్ని వేలిస్తేనే గాని మేముదిగిరా'మంటారు. దాంతో పాపం! ఆ అమ్మాయి తండ్రి తన భార్య సంతుష్టికై యింటినైనా, పొలానైనా విక్రయించి, కట్నమిచ్చి తన కూతురుకు పెళ్ళిచేస్తాడు. ఆలాకాకుండా, తల్లి తమ తాహతుకు తూగేవానికే తన బిడ్డనిచ్చి పెళ్ళిచేస్తె, యీ వరకట్న బెడదలు కొంతవరకు తగుతాయి కదా!

మొదట మన స్త్రీలలోనే సంకుచితభావాలు పోవాలి పూర్వాచారాలంటూ, కన్నకూతుళ్ళను, వచ్చిన కోడళ్ళను, రాచిరంపాన పెట్టకుండా, వారికికూడ కొంత స్వాతంత్ర్యమివ్వాలి. ఆలాగని అదుపాజ్ఞలు పెట్టకుండా గాలికి వదిలివెయ్యమనికాదు నే చెప్పేది స్త్రీలలో అభ్యుదయం కలగాలంటే, స్త్రీలే ముందు పాటుపడాలి. చుట్టూరా ఆవరించిన అంధకారాన్ని చూసీ వూరకనే దుమ్మెత్తిపోయకుండా, ఎంత చిన్నదైనా ఒక విజ్ఞాన జ్యోతిని వెలిగింపజేసి, అజ్ఞానాంధకారాన్ని పారద్రోలటానికి ప్రతిస్త్రీ సాహసించాలి. ఆనాడే నిజంగా స్త్రీ అభ్యుదయం కలుగుతుంది. కానీ, వూరకనే పురుషులను నిందించడం వల్లను, వేదిక లెక్కి నీతులను నివేదించడం వల్లను, పత్రికలలో ప్రకటనల వల్లను, ఏనాటికిని మనలో పేరుకొన్న మూఢనమ్మకాలు, చుట్టూరా నాగజెముడులా వ్యాపించిన అజ్ఞానాంధకారము తొలగిపోదు. మొదట మనలో నున్న లోపాలను సరిదిద్దుకొని, తరువాత ఎదుటివారి లోపాలెంచటం సబబుగా వుంటుందనే వుద్దేశంతో ఈ వ్యాసం వ్రాశాను. 

**ఎం. ప్రభావతి**

ఎన్నయినా చెప్పు "నీకు, బంగాళాదుంపల వేపుడు చేయటము రాదు అంటారు మా వారు. పైగా ఎదురింటి వెంకమ్మ పిన్నిగారు, చేసిన వేపుడు చాల పసందుగా వుంటుంది తెలుసా?" అంటారు. ఒక్క వేపుడే అన్న మాటేమిటి? పొరుగింట్లో ఏది చేసినా అమోఘంగానే వుంటుంది, కొందరికి.

"ఈ మాట" అంటె, పొరుగింటి పుల్ల కూర రుచిగా వుంటుంది అనే మాట మా వారే కాదు చాలమంది అంటుంటారు. ఈ శాపము వాళ్ళకి ఇంట్లో ఇల్లాలు వండిన కూరలు, పిండివంటలు మొదలైనవి అమృతము పోసి వండినా సరే అవి రుచిహీనంగా వుంటాయి. అదే పొరుగింటి పుల్లమ్మో ఎదురింటి వెంకమ్మో చేసిన వంట (అది వుప్పు కషాయమైనా లేక గొడ్డుకారమైనా సరే) అయితే అమోఘంగా వుందని ఓ సర్టిఫికెట్ పారేస్తుంటారు. దీని కంతా కారణము అది పొరుగింట్లో తయారు అయ్యి రావటమే.

## దూరపు కొండలు....

"ఒక్క కూరలవిషయమే కాదు, ఏ ఒక్కదానికైనా సరే, అది మనకు అందరానంత దూరములో వుంటే చాలు, దాని విలువ అమోఘంగా వుంటుంది.

మనకు ఆహ్లాదము కలగజేసే ఒక సీనరీ గురించి వర్ణిస్తూ, చూశారా? ఎంత చక్కని "సీనరీ". ఇది చూస్తుంటే కృష్ణశాస్త్రి వ్రాసిన, ఆకులో ఆకునై, అన్న గేయము గుర్తుకి రావటములేదూ? అంటె, ఫ్చ్ ఏమంత గొప్ప సీనరీ అని, మురిసిపోతున్నారు. "దీనిలో" చూడదగిన అంశము ఏదీ కనిపించటము లేదే, అంటారు. లేకపోతే, అందమైనసీనరీస్ ఇక్కడ ఏముంటాయి. చక్కని సీనరీస్ చూడాలంటె కాశ్మీరో, వూటీయో, లేక బొంబాయిలోని మలబార్ హిల్. రాణీబాగ్, మద్రాసులోని పీపుల్స్ పార్కు ఫ్లవర్ షో మొదలైనవిచూస్తే, మనకన్నుల కరువు తీరుతుంది. ఆ దృశ్యాలు చూడాలే కాని, వర్ణించలేమంటె నమ్మండి. అటువంటి దృశ్యాలు మచ్చుకి ఒక్కటి చూపెట్టండి చాలు, అని సవాల్ చేస్తారు. ఎక్కడో వున్న దానిని వర్ణించి ఆనందిస్తారె కాని ఎదురుగా నాచురల్ గావున్న ప్రకృతి అందాన్ని ఆస్వాదించలేరు. అందుబాటులో వున్న దానిని, పొందలేక పోవటము. అందని దానికి ఆవేశపడటము మన కలవాటు. అందుకనే, దూరపుకొండలు సుసాపు అంటారు. దూరముగావున్న కొండలు, చాల అందముగా మంచుపొరతో కప్పినట్లు కనిపిస్తాయి. అదే దగ్గిరగా వెళ్ళిచూస్తె, ఓస్, రాళ్ళగుట్టేనని అనిపిస్తుంది. ఏదైనా అంతె, దూరంగా, వున్నంతవరకే దాని ఆకర్షణ. దగ్గిరకువెళ్తే ఏదీవుండదు.

మద్రాసు చూడనవాళ్ళు, దానిని గురించి ఎవరన్నా వర్ణిస్తేచాలు, ఆ మహానగరాన్ని, జీవితములో ఒక్కసారైనా చూడగలనా అనుకునే దానిని. తీరా మద్రాసువెళ్ళాక ఓస్. యిదేనా అనిపించినది. మద్రాసు చూడకముందు ఆ నగరము గురించి రోజూ వింత వింత కలలు కనే దానిని, నా కలలు ఫలించాయా అన్నట్లు మా వారికి తొలిగా మద్రాసులోనె జాబ్ దొరికింది. నా కోరిక ఫలించినదలే అన్నట్లు మురిసిపోయాను. ఆ మురిపెముకాస్తా మద్రాసు వెళ్ళిన మూడో నాటికే, తీరిపోయింది. అక్కడనుండి ఎప్పుడు వెళ్ళిపోతామా అని, నిముషమొక యుగముగా గడిపాను. మద్రాసువంటి మహానగరాలు గెస్టుగా వెళ్ళి చూడటానికే బాగుంటాయి కాని పర్మనెంటుగా వుండటానికి మాత్రము బాగోవని నా అభిప్రాయము.

అక్కడవున్న, మూడు నెలల్లోనూ, ఏ దిక్కు ఎటోకూడ తెలుసుకోలేనంత మారిపోయానంటె, నాకె నవ్వుగా వుంటుంది. ఒకదానినిమించి ఒకటి యెత్తుగావుండె భవనాల చాటున, సూర్యోదయ, సూర్యాస్తమయాలు, మచ్చుకైనా కనిపించవు. చీకటే,

ఎప్పుడూ ఇంతే—8

శంకర్



# శాఖాచంక్రమణం

బలురుతో మిళితమైన ఇసుక గదులు. వాటిలో గాలి ఏకోశాన వుండదు. పైగా గోడలనిండా సపరివారంగా కాపురము వుంటున్న నల్లుల సంతతి. ఇవి చేసె ఇంజక్షన్ను బాధతో తెల్లవార్లూ జాగరణ. పోనీ ప్రకృతిని చూసి ఆనందించకపోయినా, భవనాల సోయగమైనా చూసి తరిద్దామంటే, అధునాతన మీద దూసుకువచ్చే కార్లు, బస్సులు, ఆటోరిక్షాలు, వెనుకనుండి తరుముతుంటె తలెత్తి చూసె అవకాశముండదుకదా? కొత్త పిన్నరుపాటుగా నడిచామంటె మన పని ఖాళీయే. మన పేరు చిత్రగుప్తుడి చిట్టాలో నమోదు చేయబడుతుందను కోవాలి. దిన దిన గండము నూరేళ్ళాయుష్షు లాగ వుంటుంది అక్కడ పరిస్థితి. ఇదా మద్రాసు తీరు అనుకున్నాను. "వూహా" గానము ఏదైనా అంతే. దిగుతేగాని లోతు తెలియదు అన్నట్లు చూస్తేగాని వాటి విలువను గ్రహించలేము. ఒక ముఖ్యమైన ప్రదేశమే కానివ్వండి, లేక వ్యక్తులే గానివ్వండి, వాళ్ళగురించి చూడనన్నాళ్ళూ ఎన్నో రూపకల్పనలు చేసేస్తుంటాము. అవి చూసేవరకూ మన మనసుకి శాంతి వుండదు. తీరా చూస్తే మన బుఱ్ఱ ఖాళీ. మన వూహాలు ఒక్కటీ నిజమవదు. కొన్ని పేర్లనుబట్టికూడ వాళ్ళ రూపురేఖలు దిద్దుకుంటాము. ఈ వూహాలకు అనకట్ట అంటూ వుండదు. అవి అట్లా, మానవ జీవితముతో పాటె పెరుగుతుంటాయి. వీటివల్ల లాభమూ వుండదు. నష్టమూ కలుగదు. కాని ఒక్కొక్కసారి మన మనసుమీద మనకే నమ్మకము లేకుండా పోతుంటుంది. అంతే.

పసిపిల్లలు మొదలు పండు ముదుసలివరకూ ఇట్లా వూహాగానము చేయుట మానలేరు. వయసుకి తగ్గట్టుగానే ఈ వూహాలు సాగుతుంటాయి.

"అమ్మ" వద్దన్న పనే చేయాలనుకుంటుంది పసిపాప. ఈరోజు బడికి వెళ్ళకుండా ఏ ఎత్తు వేయనా అని చిన్నపిల్లడు అనుకుంటాడు. అప్పుడె హైస్కూలు చదువు పూర్తిచేసి కాలేజిలో అడుగుపెట్టబోయె విద్యార్థి కాలేజి లైఫ్ గురించి తీయని వూహాలు సృష్టించుకుంటాడు. కాలేజి చదువు పూర్తిచేసి సంసార బాధ్యత నెత్తిమీద వేసుకునే యువకుని వూహాలు వేరుగ వుంటాయి. క్రొత్తగా గృహస్థాశ్రమములో కాలుపెట్టబోయే వ్యక్తి వూహాలన్ని తన కాబోయే భార్య రూపురేఖలగురించి వూహిస్తూ మురిసిపోతాడు. అట్లాగ తన కాబోయే భర్తయొక్క అందచందాలు, చేసే వుద్యోగము, ఆ హోదా గురించి పగటి కలలు కంటుంది. అప్పుడే పెండ్లిచూపులకు తయారు అవబోతున్న ఓ "లలన" తన బిడ్డ ప్రయోజకుడవాలని, పేరుప్రతిష్ఠలు సంపాదించాలని, ప్రతి తల్లీ తనబిడ్డగురించి పునాదులు లేని భవనాలు నిర్మించేస్తుంది. ఈ సంసారాన్ని, ఎట్లా ఈదుకురాగలనా అని జీవితముయొక్క లోతుపాతులు తెలిసిన గృహస్థు ఆవేదనపడుతుంటాడు. ఇట్లా ప్రతి మానవుడు ఏదో ఒకదానినిగురించి వూహాగానము చేయకుండా వుండలేడు. వూహించినట్లు జరిగినా జరగకపోయినా వూహించటము మానలేరు. ఇదిమానవస్వభావము. నాముట్టుకు నేను ముందుచూడబోయే ప్రదేశాల గురించి. కలవబోయేవ్యక్తులగురించి వూహించనిదే వూరుకోను. ఇల్లు మార్చవలసినప్పుడు ఆ వెళ్ళబోయే ఇంటిగురించి ఎన్నో వూహించేసుకుంటాను. ఒకసారి ఇట్లాగే ఇంకో ఇంటిని చూసివచ్చి చాల సదుపాయముగా వుంది చక్కటిగాలివస్తుంది అని వర్ణించారే కాని ఆ ఇంటికి చేరటానికి సందులు, గొందులు, మురికికాలువలు ఎన్ని దాటాలో మాత్రము చెప్పారుకాదు. తీరా ఆయింట్లోకి వెళ్ళాక నాలుగోరోజునే ఇల్లుమార్చేవరకూ వూరుకున్నానుకాదు. మా అక్కయ్యగారింటికి ఒకవ్యక్తి వస్తుండేవారు. అతనిపేరు చాల అందముగా విన సొంపుగా వుండేది. పేరే ఇంతబాగుంటె ఆ పేరుగల వ్యక్తి ఇంకెంత అందముగా వుంటాడో అనుకునే దానిని. ఆఖరికి ఆ మహావ్యక్తిని చూడనే చూశాను. నా వూహాలకు ఫుల్‌స్టాప్ పడిపోయింది. "పేరు" ఎంతబాగున్నదో మనిషంత వికృతంగా వున్నాడు. అక్కయ్య తనకు తెలిసిన ఒక ఫామిలీ గురించి ఘనంగా వర్ణిస్తూ మురిసిపోతుండేది. ఆ ఇంట్లో ఆడవాళ్లు దేవకన్యలలాగే వుంటారు అనేది. పైగా వాళ్లు ఇంగ్లీషేగాని, తెలుగుసరిగ్గా మాట్లాడలేరని గొప్పలు చెప్పుండేది. ఎవరికైనాసరే, అందమైన వస్తువులను, వ్యక్తులను చూడాలన్న అభిలాష కలగక తీరదు.

అక్కయ్య ఇంతలా చెప్పే ఆ ఘనత వహించినవాళ్లను ఒక్కసారైనా చూస్తే బాగుండును అనుకునేదానిని. తీరా వాళ్లను చూస్తే అక్కయ్య వర్ణించిన వ్యక్తులు వాళ్ళేనా అనిపించింది. దేవకన్యలను బోలి కాదు అతిసామాన్యంగా వున్నారు. ఇంగ్లీషు మాట్లాడటముకాదు తెలుగే అంతంతమాత్రముగా మాట్లాడుతున్నారు.

తెల్లబోయి తమాయించుకొని. ఇదేమిటే! అక్కయ్యా? అంటె...ఏమో...నేను మాత్రము చూశానా పెట్టానా. వూహించి చెప్పింది నిజమని ఎట్లా నమ్మవూ? అని డబాయించి నా నోరు మూయించేసింది. మా స్నేహితుడు ఒకరు ఇట్లాగే ముందు జరగబోయేవాటిగురించి ఎన్నో వూహించేస్తుంటుంది. ఆమెకు మూడు సంవత్సరములలోపు ఒక ఆడపిల్ల వుంది. ఆ పిల్లకు ఎప్పుడో జరగబోయే పెండ్లిగురించి, కట్నము కానుకల గురించి, పెట్టబోయే నగలు సారె చీరల గురించి రోజుకి ఒక్కసారైనా వూహించుకుని సంతృప్తిపడుతుంటుంది. ఆడపిల్ల పెండ్లి చేయటమంటె మాటలా... ఇప్పటినుంచి ఒక్కొక్క వస్తువే అమర్చుస్తుంటే అమ్మాయి పెళ్ళినాటికి తడుముకోనక్కరేదు. అసలు నెలకింత అని బ్యాంకులో వేస్తుంటె బాగా వుంటుందికదూ, అని ఎప్పుడో జరగబోయే పెండ్లిగురించి ఇప్పటినుంచే బెంగపెట్టుకుంటుంది మా స్నేహితుడు. పోనీ ఇంతలా చెప్తుంది ఇప్పటికి మీఅమ్మాయి పేరన ఏమాత్రము జాగ్రత్తచేసావేమిటోయ్ అంటె అబ్బె...ఏదీ, మళ్ళీనెలనుంచి ఆ ఏర్పాటు చేసుకుంటాము అంటుంది. వెనకటికెవడో నువ్వుగింజ దొరికితే దానిగురించి ఎన్నో ఎన్నో వూహించేశాడట. అట్లావుంటుంది మా స్నేహితుడుయొక్క చర్య. ఇట్లా ఎప్పుడో జరగబోయేదానిగురించి వూహాగానము చేయుట కొందరికి సరదా. ఏ సరదాలు ఎట్లావున్నా, వూహించినవాటిలో కొన్నయినా నెరవేర్చగలశక్తి వుంటేనే కాని వట్టి వూహాలవలన మైండ్ పాడుచేసుకోవటం తప్ప ఫలితం శూన్యము. ★

# రాశిఫలాలు

★ దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి ★

**18-11-1959 బుధవారం మొదలు**
**24-11-1959 మంగళవారం వరకు**

**మేషం:**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈవారం మీరు అన్ని హంగులు యేర్పడి మానసికంగా సంతృప్తిపొందగల అవకాశాలున్నవి. వృత్తిలో గౌరవం, పలుకుబడి పెరగటం మాత్రమేగాక అంతస్తుకు తగినట్లు ధనాదాయంకూడా పొందగలుగుతారు. అయితే శ్రమమాత్రం తప్పదు. ఇంతకు ముందువలె ప్రతిపనిలోను ఇతరుల సలహా నిమిత్తం, సహాయంనిమిత్తం ఎదురుచూడవలసిన అవసరం క్రమక్రమంగా తగ్గుతుంది. కుటుంబంలోనివారి ఆరోగ్యం బాగుండకపోవటంవల్లను, మధ్య మధ్య కలహప్రసంగాలు వస్తూవుండటంవల్లను మీ ఉత్సాహానికి భంగం కలుగుతుంది. కాని వ్యవహార రంగంలో జయప్రదంగా ఉంటుంది. తలపెట్టినపనులు శుభంగా ఒకదారికి రాగలవు. ఉన్నతస్థితియందున్నటువంటి పెద్ద మనుష్యులతో పరిచయం లభిస్తుంది. వారం మధ్యభాగంలో అకస్మాత్తుగా ధనలాభం, ప్రయాణసూచనలు, వస్త్రాలు, ఆభరణాలు మొదలయిన విలువగలవస్తువులు కొంటారు. 23, 24 లలో సంఘకార్యాలు, అధికశ్రమ.

**వృషభం:**

(కృత్తిక 2, 3, 4, పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ప్రస్తుతం మీ మానసిక పరిస్థితి డోలాయమానంగా ఉంటుంది. అయితే జరుగవలసిన పనులు మాత్రం ఆయా సమయాలలో చక్కగా జరుగుతూఉంటవి. క్రమక్రమంగా మీ బాధ్యతలను తగించుకోవటానికి ప్రయత్నించగలుగుతారు. ఇతరుల ప్రోత్సాహం లభిస్తేగాని మీ శక్తిసామర్థ్యాలను మీరు తెలుసుకోవలేకపోవటంవల్ల ప్రతి పనీ ముందు భయంకరంగా తోస్తుంది. అయినా నిబ్బరంతో ఉండే మీ గౌరవ ప్రతిపత్తులను కాపాడుకోగలుగుతారు. బంధుమిత్రులసహాయం లభించటంవల్ల సంతృప్తికరమైనఫలితం పొందగలుగుతారు. ఇతరులవద్దనుంచి ఎదురుచూస్తున్న ధనం ప్రస్తుతం చేతికిరాదు. వారం రెండవ భాగంలో పరస్పరప్రసంగాలతో ఆరంభమైన పట్టుదలలు హద్దు దాటిపోగల అవకాశాలున్నవి. ఈ విషయంలో జాగ్రత్తగా ఉండటం అవసరం. కుటుంబంలో శుభసంతోషాలు జరుగగలవు. 18, 19, 20 లలో ధనాదాయం, వృత్తిలో అభివృద్ధి, మనస్సుకు ఆశ్చర్యము, ఆందోళన కలుగగల వార్తలు తెలుస్తవి.

* * *

**మిథునం:**

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఈ సమయంలో మిమ్ములను గురించి ఎవరు ఏవిధంగా అనుకున్నా మీరు మాత్రం నిగ్రహంతో ఉండి ఇతరులకు జరిగే అపకారాన్ని ఎదుర్కొనగలుగుతారు. అందువల్ల మీకు శ్రమ ధనవ్యయము ఉంటవి. సంఘంలో ఉన్నతస్థితి లభిస్తుంది. మీ వృత్తివ్యాపారాదులలో చిక్కులుగాని కష్టనష్టాలుగాని ఏమీ లేకపోయినా మీ ప్రయత్నాలు కలిసిరాకపోవటంవల్ల నిరుత్సాహం కలుగుతుంది. తలపెట్టిన ప్రతిపనీ మరుక్షణంలో జరుగబోతున్నట్లు కనుపిస్తుంది. కాని ప్రయోజనం తక్కువ. బాహ్యాడంబరం మాత్రం బాగుంటుంది. విద్యావంతులు, సత్పురుషులు మొదలయినవారితో సమావేశం లభిస్తుంది. మొత్తంమీద ఈవారం అంతా తీరుబాటు, మనశ్శాంతి, దేహసౌఖ్యము లేని కార్యక్రమాలు. అయినప్పటికీ ఇంతకుముందు ఇతరులకు చెప్పినమాటను నిలబెట్టుకుని సంతృప్తి పొందగలుగుతారు. పాటివారిలో పేరుప్రతిష్ఠలు పెరుగుతవి. కుటుంబంలో శుభ సంతోషకార్యాలు జరుగుతవి. విలువగల వస్తువులుగాని. ముఖ్యమైన పత్రాలుగాని పోయే అవకాశాలున్నవి.

> **గ్రహస్థితి**
>
> కన్యలో శుక్ర రాహువులు, తులా వృశ్చికాలలో అంగారకుడు, వృశ్చికంలో సూర్యబుధగురువులు, ధనుస్సులో శని, మీనంలో కేతువు, మిథున కటక సింహాలలో చంద్రుడు.

* * *

**కర్కాటకం:**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఈ వారం మీ బుద్ధిబలంతో అనేక చిక్కు సమస్యలను ఎదుర్కొని విజయం సాధించగలుగుతారు. వృత్తిఉద్యోగాలలో అభివృద్ధిప్రయత్నాలు ఫలిస్తవి. అయితే ముందు కొంచెం శ్రమ కనుపిస్తుంది. కుటుంబంలో శాంతి, సౌఖ్యము లభిస్తవి. ఇంతకు ముందునుంచి మిమ్ముల ముందుకు పోనీయకుండా బాధిస్తున్న భయాందోళనలు క్రమంగా తొలగిపోతవి. మీ ఆలోచనలను సక్రమంగా ఆచరణలో పెట్టగలుగుతారు. ఇతరుల వ్యవహార కలాపాలలో మధ్యవర్తిత్వం జరుపుతారు. లోగడ మీరు ఆలోచించకుండా త్వరపడి చేసినపనులు ఈ సమయంలో కొంతవరకు కష్టనష్టాలను కలిగించవచ్చు. వారం మధ్యభాగంలో ఆయుధములు మొదలయినవాటివల్ల బాధ పడవలసివస్తుంది. ఈ సమయంలో ప్రయాణాలు చేయటం అంత మంచిదికాదు. వ్యవహార పరిష్కారాలు, స్థిరాస్తులు కొనే ప్రయత్నాలు మొదలయినవాటికి అనుకూలమైన సమయం. 18, 19 లలో వృథాశ్రమ, మితిమీరిన ఖర్చులు, పడమరదిక్కునుంచి దుర్వార్తలు వింటారు.

**సింహం:**

(మఘ, పుబ్బ, ఉత్తర 1వ పాదం.)

ప్రస్తుతం మీరు ఎవరిని నమ్మటమో, ఎవరిని నమ్మకపోవటమో తేల్చుకోవటం అసాధ్యంగా ఉంటుంది. ధనాదాయం బాగుంటుంది. వృత్తి ఉద్యోగాలలో చిక్కులు తొలగిపోయి మనస్సుకు నెమ్మదిగా ఉంటుంది. బంధుమిత్రులు మీతో చాలా అనుకూలంగా ప్రవర్తిస్తూ ఉంటారు. కాని అకస్మాత్తుగా మీ మీద అపవాదులు తీసుకునివస్తారు. మీరు కొంచెం జాగ్రత్తగా ఉండటం అవసరం. కుటుంబంలో వృథా ఖర్చులు వచ్చిపడుతవి. స్నేహితులకు సహాయం చేయవలసిన అవసరం కలుగుతుంది. సంఘంలో గౌరవం. పేరుప్రతిష్ఠలు బాగుంటవి. కుటుంబంలో అభిప్రాయభేదాలు వస్తూ ఉండటంవల్ల మనశ్శాంతి తగ్గుతుంది. స్థిరాస్తులు మొదలయినవి కొనే ప్రయత్నాలకు అనుకూలమయిన సమయం. మీరు ప్రయత్నించవలసిన అవసరం లేకనే అతిముఖ్యమైన పనులు కొన్ని అనుకూలించగలవు. 23, 24 లలో ఖర్చులభారం అధికం, శుభవార్తలు.

* * *

**కన్య:** (ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ వారం గ్రహబలం అనుకూలంగానే వున్నది. అనేక రకములైన ఆలోచనలు ప్రయత్నాలు చేస్తారు. ఇందులో కొన్ని మాత్రం ఈ సమయంలో కార్యరూపం పొందగలవు. వృత్తికి సంబంధించిన పనులు కొంచెం నిదానంగా జరుగుతూ ఉండటంవల్ల ఉత్సాహం తగ్గగల అవకాశాలున్నవి. ఆదాయం బాగుంటుంది, తలవని తలంపుగా



# రా శి ఫ లా లు



పాటివారి సహాయంతో ఇంతకుముందునుంచీ ఎటూ తేలకుండా ఉంటున్న ముఖ్యవ్యవహారాలు పరిష్కరించుకోగలుగుతారు. నరముల యందు బాధకనిపిస్తుంది. మీ మిత్రవర్గంలోని వారు ఒకరిద్దరు మీతో వ్యతిరేకించటం జరుగుతుంది. మీరుమాత్రం సహనంతో ఉండి విరోధాలు ప్రబలకుండా చూచుకోగలుగుతారు. అందువల్ల మనశ్శాంతిమాత్రం లోపిస్తుంది. పేరుప్రతిష్ఠలు, అడంబరం కాపాడుకోనటం నిమిత్తం ధనవ్యయం చేయవలసివస్తుంది. వారాంతంలో అధికారులతో వివాదంరాగల సూచనలున్నవి. 21, 22 తేదులలో దైవకార్యాలు, ఆదాయంలో అభివృద్ధి.

*   *   *

## తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ప్రస్తుతం నిష్కారణమైన అశాంతితో బాధపడుతూ ఉంటారు. సంఘంలో పలుకుబడి, ధనాదాయము బాగానే ఉన్నా మీ విరోధులు అపవాదులు ప్రచారం చేస్తుండటంవల్ల మీరు నిర్వహించవలసిన పనులకు ఆలస్యం, సందేహాలు కలుగుతూ ఉంటవి. అప్పులు చేయవలసిన అవసరం రావచ్చు. ఇతరుల మాటలను నమ్మి మీశక్తికి మించిన పనులు పైన పెట్టుకోనటం మంచిదికాదు. మీబంధువర్గంలోనివారు మిమ్ములను స్తోత్రం చేస్తూ తమ కార్యం సాధించుకోనటం నిమిత్తం పాటుపడతారు. మెుత్తంమీద ఓర్పుతో ఉండటం అవసరం. అయితే మీ మాటసహాయంతోను, మీవ్యవహారదీక్షతతోను అనేక మందికి ఉపకారం చేయగలుగుతారు. రకరకాల మనుష్యులతోను పరిచయం లభిస్తుంది. అనేక ముఖ్యవిషయాలను తెలుసుకోన గలుగుతారు. సాధ్యమైనంతవరకు డబ్బుకు సంబంధించిన లావాదేవిలలో నిర్లక్ష్యంగా ఉండవద్దు. ఈశ్వరారాధనవల్ల మనశ్శాంతి లభిస్తుంది. ఆర్థిక చిక్కులు తొలగుతవి.

*   *   *

## వృశ్చికం :

(విశాఖ 4 వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

బాహ్యసంబంధమైన అన్ని రంగాల లోను విజయవంతమైన సమయం. సాధారణంగా మీ మాటకు విలువ పెరుగుతుంది. వృత్తి ఉద్యోగాలలో కూడా పైవారివల్ల అనుకూలత, కార్యసిద్ధి పొందగలుగుతారు. కొంతవరకు ఖర్చులు పెరిగినట్లు తోచవచ్చు. అంగుకు తగినట్లు ఆదాయం కూడా పెరుగుతుంది. భార్య ఆరోగ్యం సరిగా ఉండకపోవటంవల్ల కుటుంబబాధ్యతలు మీపైన పడగల అవకాశాలున్నవి. కోర్టుకచేరీలలో ఇతరులవల్ల ఇంతకుముందు ఉంటున్న బాధ తగ్గుతుంది. మీ కార్యదీక్ష, శక్తిసామర్థ్యాలు ప్రస్తుతం చక్కగా ఉపయోగించగలవు. ధర్మకార్యాలు, శుభకార్యాలు మెుదలయిన వాటినిమిత్తం ధనవ్యయం చేస్తారు. మీ స్నేహితులకు మిమ్ములను గురించి ఇంతకుముందు ఉన్నటువంటి అనుమానాలు తొలగిపోతవి. మీరు తలపెట్టిన పనులలో కొంచెం నిదానం కనుపించినా ముందు ముందు మంచి ఫలితాన్ని పొందగల అవకాశాలున్నవి. 22, 23, 24 లలో గౌరవలాభం, శుభవార్తలు, వృత్తిలో శ్రమ, ఆదాయం.

*   *   *

## ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

పరిస్థితులను గమనించుకొంటూ, మీశక్తిమించిన బాధ్యతలను పైనపెట్టుకోనకుండా ఉండటం అవసరం. మీరు ఎంతసహనంతో ఉండామనుకున్నా పరిస్థితుల ప్రాబల్యంవల్ల అకస్మాత్తుగా ఉద్రేకం కలుగగల అవకాశాలున్నవి. వృత్తి వ్యాపారాది కార్యకలాపాలలో అభివృద్ధి, అనుకూలత వుంటవి. కాని ప్రతివిషయంలోను ఇతరులతోపోటీ, విశేష శ్రమ కనుపిస్తూవుంటవి. ధన విషయంలో ఇబ్బంది కనుపించదు. బంధువుల రాకపోకల వల్ల ఖర్చులు పెరగగల అవకాశాలున్నవి. వ్యవహారరంగంలో మీ బుద్ధిబలంతో అనేక చిక్కుసమస్యలను తొలగించుకోన కలుగుతారు. ఇంతకుముందు మీమీద ఉన్నటువంటి ఇతరుల కార్యభారాన్యతలు క్రమంగా తొలగిపోతవి.ఆదాయంకూడా పెరుగుతుంది. కుటుంబంలో సుఖసౌఖ్యాలు లభిస్తవి. దూరమందున్న బంధువులవద్దనుంచి అసంతృప్తికరమైన వార్తలు తెలుస్తవి. 21, 22 లలో అధికశ్రమ, పొరపాట్లుచేయటం.

## మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

గ్రహస్థితి అనుకూలంగా ఉన్న ఈ సమయంలో మీరు మీశక్తి సామర్థ్యాలను, అవకాశాన్ని బాగా వినియోగించుకుని ఉన్నతస్థితిని పొందగలుగుతారు. మీరుచేయు ప్రతిపనీ ఇతరులయొక్క ఆదరంతోను, సహాయంతోనూ మీరు తలచినదానికంటె విశేషంగా ఫలిస్తుంది. సంఘంలో మీమాటకు గౌరవం లభిస్తుంది. మనస్సుకు అనేక ఆలోచనలు వస్తూ ఉండటంవల్ల కొన్ని ముఖ్యసందర్భాలలో ఒక నిర్ణయానికి రావటం జరుగదు. అయితే అదికూడా మీ మంచికే నని నిదానంగా తెలుసుకోగలుగుతారు. శుభకార్య ప్రయత్నాలు అనుకూలించ గలవు. మీకు సహాయం చేస్తామని చెప్పిన పెద్దమనుష్యులు సమయంలో అనుకూలించటం వల్ల మీ ప్రయత్నాలు నిరాటంకంగా ఫలిస్తవి. సభాగౌరవం, ఉన్నతస్థితియందున్న పెద్ద మనుష్యులతో పరిచయం, లభిస్తవి. వారం రెండవభాగంలో దేహసౌఖ్యం తగ్గుతుంది. 18, 19 లలో కుటుంబంలోనివారికి అనారోగ్యం, శ్రమతో కూడిన కార్యకలాపాలు.

*   *   *

## కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఈవారం చాలా ఉత్సాహవంతంగా ఉంటుంది. మీ విరోధులు మీకు అపకారం చేయటానికి ప్రయత్నిస్తారు. కాని అందువల్ల మీకేవిధంగాను ఇబ్బంది కలుగదు. ప్రయాణాలు చేయవలసిన అవసరం కలుగవచ్చు. ప్రస్తుతం ఉపయోగంలేని పనుల యందు మీడబ్బు వినియోగించవలసినట్లు కనిపిస్తుంది. కాని ముందు ముందు అనుకూలం ఉంటుంది. వృత్తి ఉద్యోగాలలో సౌఖ్యం, గౌరవం లభిస్తవి. దూరమందున్నటువంటి బంధుమిత్రులవద్దనుంచికష్టవార్తలు రావటం వల్ల మీప్రయత్నాలకు తాత్కాలికంగా ఆటంకం కలిగే అవకాశాలున్నవి. ధనాదాయం పెరుగుతుంది. కోర్టు కచేరీలలోని పనులు చాలావరకు అనుకూలమార్గంలో జరుగుతవి. మీ భయాందోళనలు తొలగిపోయి మనశ్శాంతి కలుగుతుంది. కార్య నిర్ణయం చేయుగలుగుతారు. ఆస్తివృద్ధి ప్రయత్నాలు తలపెట్టగల సూచనలున్నవి. కాని శీఘ్రంగా జరుగవు. పరోపకారం నిమిత్తం శ్రమపడవలసివస్తుంది. 21, 22 లలో దేహబాధ, శుభవార్తలు.

*   *   *

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

ఈ సమయంలో ఉన్నతస్థితికి మార్గాలు ఒక ప్రక్క కనుపిస్తున్నా మరొక ప్రక్కనుంచి దుష్టులవల్ల అభ్యంతరాలు కూడా వస్తూ ఉంటవి. ఆపులతో కలహప్రసంగాలు వస్తవి. మెుదట్లో మీరు అనుకున్న ప్రతిపనీ శ్రమకరంగానే తోస్తుంది. కాని చివరకు సంతృప్తికరమైన ఫలితం పొందగలుగుతారు. ముఖ్యంగా ధైర్యము, పట్టుదలా అవసరం అనే విషయం మరచిపోవద్దు. అధికారుల స్నేహం, సహాయంతో మీ ప్రయత్నాలు ఫలిస్తవి. మీ దేహ సౌఖ్యం బాగుంటుంది. ఒకటె రెండు సమయాలలో ఇతరుల ప్రసంగాలలో మీరు కల్పించుకోనటంవల్ల విపరీత పరిణామాలు రాగల సూచనలున్నవి. కుటుంబంలో శుభ, పుణ్య కార్యాలు జరుగుతవి. విశేష ధన వ్యయంతో జరుగవలసిన పనులు ఆరంభించటం మంచిదికాదు. వ్యవహార పరిష్కారాలకు అనుకూలమైన వాతావరణం ఏర్పడుతుంది. 23, 24 లలో మీకు ఇష్టంలేని పనులలో ప్రవేశించటం, ఆరోగ్యభంగం, వస్తువులు పోగొట్టుకోనటం.



సౌందర్య
రహస్యపు
చర్చ...

గడచిన పాతిక ఏళ్లాయి తల్లులు వారి కేశముల అందమునకు కారణము తాతావారి పెర్‌ఫ్యూమ్డ్ కోకొనట్ హెయిర్ ఆయిల్ అనే రహస్యమును కుమార్తెలకు చెబుతూ వస్తున్నారు. అహ్లాదకరమైన పూల పరిమళముగల యీ శుద్ధమైన కొబ్బరి నూనె మీ కుమార్తెల కేశములను కూడ ఎంతో సొగసుగ ఉంచుతుంది!




తాతావారి పెర్‌ఫ్యూమ్డ్
## కోకొనట్ హెయిర్ ఆయిల్

ది తాతా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

# కలలో బొమ్మలకొలువు

తీగెలమల్లి కుమారి

సాయంత్రం 5 గంటలకు యింటికి వచ్చాను. వచ్చి రాగానే పుస్తకాలనంచీ బీరువాలో పడేసి, తిన్నగా మా అమ్మదగ్గరకి బయిలుదేరాను. మా అమ్మ వంటింట్లో ఉప్మా తయారుచేస్తూంది. నేను రాగానే కాళ్లు చేతులు కడుక్కొని ఫలహారానికి రమ్మంది. కాళ్ళు కడుక్కొని ఉప్మాప్లేటు ముందర కూర్చొని, వేడి, వేడి వుప్మా కొంచెం తింటూ మా అమ్మతో ఇలా అన్నాను.

అమ్మా! మా స్నేహితురాళ్ళంతా దసరాకి బొమ్మల కొలువు పెట్టుకొంటున్నారే. నేను కూడ పెట్టుకోవద్దే? అని అడిగేను. మా అమ్మ అందుకు సులభంగానే వొప్పుకొంది. అబ్బ! మా అమ్మంత మంచిది యీ ప్రపంచకంలో వుంటుందా అనిపించింది.

అమ్మా! మరి బొమ్మలే? అన్నాను.

మా అమ్మ నాన్నగారితో చెప్పి బొమ్మలు కొనిపిస్తానంది.

అమ్మా! మనింట్లో బొమ్మల కొలువు ఎక్కడ పెట్టుకోవడమే అన్నాను.

మా అమ్మ వాకిటిగది కాళీచేసి సున్నంవేయించి తయారుచేయిస్తానంది. నాకు ఒకటే హడావిడి. గబగబా మా స్నేహితురాళ్ళనందరినీ కలుసుకొని నా బొమ్మలకొలువు విషయం చెప్పేశాను. ఆదినం నా నంతోషానికి అంతేలేదు.

సాయంత్రం 6 గంటలయింది. యింటికి వెళ్ళాను. అప్పటికే మా నాన్నగారు వాకిట్లో పేపరు చదువుకొంటున్నారు. మా అమ్మ పెరట్లో మొక్కలకి నీళ్ళు పోయిస్తూంది.

మా నాన్నగారిదగ్గర నాకు చాలా భయం. మా నాన్నగారు చూడకుండా మా అమ్మదగ్గరకి వెళ్ళాను.



రాత్రి భోజనాలదగ్గర మాఅమ్మ మా నాన్నగారితో నా బొమ్మల కొలువువిషయం అడిగింది. మా నాన్నగారిదగ్గర నాకెంతభయమో, నేనంటే ఆయనకి అంత ముద్దు.

మా నాన్నగారు నన్ను కొలువు పెట్టుకొంటావా? అని అడిగేరు. నేను అవునన్నాను.

భోజనాలయిన తరువాత మా అమ్మ నాకు ఏ ఏ బొమ్మలు కొనాలో నా బొమ్మలకొలువుకు కావలసిన సరంజామా అంతా చెప్పింది.

మా నాన్నగారు నన్ను పిల్చారు. మర్నాడు నన్ను బజారుకు రమ్మని కావలసినబొమ్మ లన్నీ ఎంచుకొనమని చెప్పారు.

కొంచెంసేపయిన తరువాత నేను వెళ్ళి పడుకొన్నాను. నాకు ఎంతసేపటికి నిద్దరాలేదు. ఎంతో రాత్రి వరకూ నా బొమ్మలకొలువే కళ్ళల్లో మెదిలింది.

ఆదినం వుదయమే నిద్దరలేచాను. కాఫీ టిఫిన్ ముగించి, మా నాన్నగారితో బజారుకు బయలుదేరాను. మా నాన్నగారు నా కొలువు విషయమై ఎంతో శ్రద్ధగా వున్నట్టు కనిపిస్తోంది. లేకపోతే ఎందుకు శలవు పెడతారు.

బజారులో ఎన్నో బొమ్మలు పేర్చివున్నాయి. అబ్బా ఆ బొమ్మలు ఎంత బాగున్నాయో?

మా నాన్నగారు ఒక మట్టి బొమ్మల దుకాణందగ్గరకు తీసుకొని వెళ్ళారు.

అబ్బా ఆరాధాకృష్ణుల విగ్రహం ఎంత అందంగా వుందో.

ఆ గాంధీమహాత్ముడి విగ్రహం చూస్తే నాకు ఎంతో ఆనందం వేసింది. శివుడు, పార్వతి, పార్వతి చేతులోవున్న చిన్న వినాయకుడి బొమ్మ ఎంతో బాగుంది. చిన్న బొమ్మలు చూచినా తనివితీరడం లేదు. నాకు కావలసిన బొమ్మలు అన్నీ ఎంచుకొన్నాను. మొత్తం డజను బొమ్మలు పెద్దవి చిన్నవి కలిపి ఒక తట్టలోపెట్టి యింటికి పట్టించుకు వెళ్ళాము. మేము యింటికి వెళ్లేటప్పటికి మా అమ్మ గది శుభ్రంచేసి అయిదువరుసలు బల్లలు పేర్చింది. ఇదివరకేవున్న

# ★ కలలో బొమ్మలకొలువు ★

బొమ్మలు అప్పుడే సర్దడానికి వీలైంది. నా బొమ్మల కొలువు విషయంలో మా నాన్న అమ్మ ఎంతో సహాయం చేయడం చూస్తే నాకు వొళ్ళు తెలియనంత ఆనందం కలిగింది.

ఆ దినం నాకు తీరికే లేక పోయింది. మా అమ్మకి ఒక్కొక్క బొమ్మ అందించి పేర్చడానికి సహాయపడ్డాను. మీద వరసలో ఆ రాధాకృష్ణుల బొమ్మ ఎంతో బాగుందనిపించింది. యింతలో మా నాన్నగారు చిన్న చిన్న మిరప కాయి బల్బులు పెద్ద బల్బులు, నీలం లైటు, ఒక ఎలక్ట్రిక్ వేసేవాడిని తీసుకొచ్చి వేయించారు. రాధాకృష్ణుల బొమ్మ మీద చిన్న లైటు అమర్చాడు.

అన్ని లైట్లు ఆర్పి నీలం లైటు వేశాడు. అబ్బ ఎంత నీలంగా అయిపోయింది గదంతా నా గౌనుకూడా నీలంగా అయిపోయింది.

అరే! ఆ వెలుగుతూ ఆరుతూన్న బల్బులు ఎంత అందంగా వున్నాయో! నా బొమ్మల కొలువును చూస్తే నాకే ముచ్చటవేసింది. ఆ గదినిండా ఎన్నో మంచి మంచి పటాలు పేర్చింది మా అమ్మ.

వాకిటి ద్వారానికి కాళింగి మర్దనం అల్లికతెర కట్టింది.

మా యింట్లోవున్న ప్లాస్టిక్కు సామాను లన్నీ వరసగా పేర్చింది మా అమ్మ. గుడ్లు తిప్పుతున్న పిల్లులు చూడ్డానికి సరదాగా వున్నాయి. కిందటి సంవత్సరం వరకూ నాకు యీ బొమ్మలకొలువు పెట్టకొనే సరదాయే వుండేదికాదు. ఎప్పుడు దసరా పద్యాలు, బాణాలుతోనే కాలం గడిచిపోయేది.

ఆదినం సాయంత్రం మా అమ్మ శెనగలు నానపోసింది. కొబ్బరి కాయలు, అరటిపళ్ళు, బెల్లం అన్నీ వాయినాలకు సిద్ధం చేసింది. మా అమ్మ, నేను బయలుదేరి మా స్నేహితురాళ్ళను పిల్చాం. మా అమ్మకూడా నావెంట బయలుదేరి అందరి యిళ్ళకూ వొచ్చింది. మర్నాడు సాయింత్రం 4 గంటలయింది. అరే కృష్ణవేణి, భానుమతి, భార్గవి, సుజాత, లక్ష్మి, జ్యోతి, నిర్మల, కళ్యాణి, నాగమణి, అందరూ నా కొలువు చూడ్డానికి వచ్చారు. అందరినీ చాపవేసి కూర్చోబెట్టాను.

ఆ పిల్లి గుడ్లెల్లా తిప్పుతూందో అంది లక్ష్మి.

అరే ఆ రాధాకృష్ణుల బొమ్మ మీద లైటు ఎంచక్కా అమర్చారో అంది జ్యోతి.

ఒక్క మారు లైట్లన్నీ ఆర్పేశాను. అందరూ గొల్లుమన్నారు. ఒక్కమారు నీలంలైటు వేశాను.

రాము: 'బామ్మా - అప్పుడే పెడతావేం. ఇంకా బోల్డు టైముంది బండీకి!'
బామ్మ: 'లేకురా నాయనా - చూడు అప్పుడే ఘదయితేను...'
రాము: కాదు బామ్మా - నువ్వూ, అమ్మా పోట్లడుకుంటూంటే ఇందాక నాన్నే ముల్లు గంటముందుకు తిప్పాను!'

అందరూ చప్పట్లు చరిచారు. అబ్బ ఆ నీలం కాంతిలో కొలువు ఎంత అందంగా వుందో అంది సుజాత.

అరే! ఆ వెలుగుతూ ఆరుతున్న లైట్లెలాగున్నాయో అంది కృష్ణవేణి.

అందరూ నా బొమ్మల కొలువుని పొగుడుతూంటే నాకు చాలా ఆనందం వేసింది.

యింతలో జ్యోతి "భార్గవి గారింట్లో కొలువు దీనిముందెందుకూ పనికిరాదు. బొమ్మలే లేవు" అంది.

భార్గవికి ఎంతో కోపంవచ్చింది. వెంటనే ఏడుస్తూ వెళ్ళిపోతూంది.

అందరూ భార్గవి వుడికిపోయి వెళ్ళిపోతూందని చప్పట్లు చరచి చెప్పారు.

నాకు భార్గవిమీద ఎంతో జాలి వేసింది. అందరినీ దెబ్బలాడి భార్గవీ! భార్గవీ! యిదిగోనమ్మా నీ వాయినం తీసుకొని వెళ్ళిపో అని కేకేశాను

అమ్మాయి కమలా! యింకా నిద్దేనా. లేలే జాము ప్రొద్దెక్కింది అంటూ మా అమ్మ లేపింది.

ఒక్కమారు కళ్ళు నులుముకొని లేచాను.

ఏవిటమ్మా భార్గవీ! అని పిల్చావు. తెల్లవారిందాకా కలలేనా లే! లే! అంది మా అమ్మ. పిచ్చి పిల్లా రాత్రల్లా బొమ్మల కొలువు కలల్లాగే వుంది. రాత్రల్లా తెగ పలవరించేవు. కొలువు పెట్టుకోండువు గానిలే? అంటూ పెరటికేసి దారి తీసింది మా అమ్మ.

అయ్యో! అయిదంతాకలా? అనుకొని విస్తుపోతూ విచారంగా మా అమ్మ వెనకాల బయలుదేరి పెరటి కేసి నడిచాను. ★

# అప్రతిష్ఠ

పోరంకి ఆనందం

అది, ఆనాటి ఒక రాజ్యం...అన్ని రాజ్యాలలాగే ఆ రాజ్యానికి కూడా ఒక రాజూ...మంత్రి...ఉన్నారు. ఆ రాజ్యం పేరు కానీ, దాని రాజధాని పేరుకానీ, ఆ రాజుగారి పేరు కానీ, ఆ మంత్రివర్యుడి పేరుకానీ, వాళ్ళ పిల్లల పేర్లుకాని నాకు తెలియవు. పేర్లు తెలియకపోయినా కథ సాగిపోతుంది కాబట్టి చెప్పేస్తాను.

ఆ రాజుకి పల్లెలంటే చాలా యిష్టమట. పల్లెలలో ఉండే ఆ సౌందర్యం, ఆ ఆనందం, తనివితీరా అనుభవించడానికి ఆయన పల్లెలలోనే మకాముపెట్టాడు. ఆయనతో పాటు మంత్రి సైన్యమూ అంతా కూడా అక్కడే ఉండేవారు. వారందరూ ఆ పల్లెకి వచ్చివేసిన తర్వాత అదే ఒక పట్నంగా మారిపోయింది. నిత్యజీవితావసరములైన వస్తువులు మటుక్కు అక్కడ దొరికేవి. పెద్దచదువులులేని ఒక పాఠశాల కూడా ఉంది. పై చదువులు కావలసినవారు ఎటువంటివారైనా పట్నానికి పోవలసినదే!

ఆ రాజుకీ మంత్రికీ చెరొక కొడుకూ ఉన్నారు. ఇద్దరూ ఒకే వయసువారు. ఇద్దరూ చదువులో కూడా సమానమే. ఒక్కొక్కప్పుడు మాత్రం మంత్రి కుమారుడే రాకుమారుని మించిపోయేవాడు. వారిద్దరికీకూడా ఆ గ్రామంలోఉన్న చదువు పూర్తయిపోయింది. రాజుగారు తల్చుకుంటే తమ పిల్లవాడికి కావలసిన చదువులుకల కళాశాలలు ఆ ఊళ్లోనే పెట్టించవచ్చును. కాని రాజుగారు అలా చేయలేదు. దూరాన ఎక్కడో ఉన్న ఒక పట్టణానికి తన కొడుకుని పంపడానికి నిశ్చయించాడు. మంత్రి కూడా తన కొడుకు విషయంలో అందుకే నిశ్చ



యించాడు. వారిద్దర్నీ పంపేటప్పుడు మంత్రి రాకుమారుని, తన కుమారునీ దగ్గరకు పిలచి చెప్పవలసిన విషయాలన్నీ చెప్పాడు. పుష్కలంగా డబ్బిచ్చాడు. అక్కడ ఎలా నడచుకోవాలో బోధించాడు.

"గాలి చక్కగవచ్చు విశాల గృహము
నరసి వేళ కన్నము న్నిద్ర జరుగునటుల
చూచి శ్రమచేసి, మిక్కిలి యూరి జనులు
మెచ్చునట్టుల గాంచుడీ మీర లచట!"

క్షేమ సమాచారాలు తరచుగా తెలియచేస్తూండమనీ ఎప్పుడైనా పది, పదిహేను రోజులు సెలవులు వస్తే యింటికి రమ్మనమనీ, బుద్ధిగా నడచుకుంటూ, చక్కగా చదువుకుంటూ ఆరోగ్యాన్ని కాపాడుకుంటూండమని చెప్పవలసిన వన్నీ చెప్పి సాగనంపారు.

తమ గ్రామానికీ ఆ పట్టణానికీ మధ్య ఒక చిట్టడివి ఉంది. జాగ్రత్తగా ఆ చిట్టడివి దాటి వారిరువురూ ఆ పట్నం చేరుకున్నారు. అక్కడికి చేరినతర్వాత ఒక చక్కని యిల్లు అద్దెకు తీసుకున్నారు. అప్పటి రోజులలో ఈనాటిలా సర్వసదుపాయాలూ కలిగిన 'హొటళ్లు' లేవుగా! వారు స్వయంగా వండుకుని తినడానికి నిర్ణయించుకున్నారు. రాజుగారు ఒక వంటమనిషినికూడా పంపి వుండవలసినది. ఆయన ఏమనుకున్నాడో ఏమో పంపలేదు మరి!

మొదటి ఆరు నెలలూ ఒకరు వంటవండడానికీ, తరువాతి ఆరు నెలలూ మరొకరు వండడానికీ నిర్ణ

యించుకున్నారు. మొదట వండవలసిన బాధ్యత మంత్రి కుమారునిది! మంత్రి కుమారుడు వండుతూంటే రాకుమారుడు చదివేవాడు! అది విని మంత్రికుమారుడు ఆ విన్నవాటిలో కొన్ని విషయాలైనా జ్ఞాపకం ఉంచుకుంటూండేవాడు!

నిత్యం రాకుమారుడు చదువుతూండడం, మంత్రి కుమారుడు వండుతూండడంతో ఇలా రోజులు గడుస్తున్నాయి! రాకుమారుడు చదువుతున్నాడన్నమాటే కాని అతనికా చదువేమీ బుఱ్ఱకెక్కడంలేదు! మంత్రి కుమారుడు వంట వండుతున్నాకూడ ఆ చదువంతా విన్నంతమాత్రాన బుఱ్ఱకెక్కేది! ఎప్పటికప్పుడు ప్రతి విషయమూ జ్ఞప్తి ఉంచుకుంటూండేవాడు. ఎప్పుడైనా రాకుమారుడు తప్పు చదివితే, మంత్రి కుమారుడు "మొన్న అలా చదివి ఈ రోజున యిలా చదువుతున్నావే"మని అడిగి తప్పు సవరిస్తూండేవాడు. అది విని ఆశ్చర్యపోయేవాడు రాకుమారుడు! వంట వండుతూంటేనే అతనికి ఈ పాఠ్య విషయాలన్నీ యింతలా జ్ఞాపకం ఉంటున్నాయే ఇంక వంట మానివేసినతర్వాత చదువు పారంభించితే తనను మించిపోతాడేమోనని రాకుమారునికి భయం వేసింది. అతనిలో అసూయ రగుల్కొంది. మంత్రి కుమారుని తెలివితేటలు చూస్తున్నందువలన నానాటికీ అతనిలోని అసూయాగ్ని ఎక్కువవడమే తప్ప తగ్గడమేలేదు. ఆ అసూయే ఒకవిధమైన కక్షగా మారింది. అతని కక్షకి కారణం, పాపమా మంత్రి కుమారుడు తెలివైనవాడవడమే—ముఖ్యంగా తనకంటె!



దసరాసంచికలో బాలలసంఘం 'ఎ'వర్గం పోటీలో మొదటిబహుమతిపొందిన గోవిందరాజు అరుణ, గురజాడ.

ఒకసారి వాళ్లకు సెలవులు వచ్చాయి. ఇద్దరూ యింటికి బయలుదేరారు. దారిలో చిట్టడివి దాటుతూండగా చీకటి పడిపోయింది. ఆ రాత్రి అక్కడే పడుకోవాలనుకున్నారు. ఒకరు కొంతసేపు నిద్రపోవడానికీ, అంతసేపూ మరొకరు కాపలా కాయడానికీ, ఆ తర్వాత ఇతను నిద్రపోయి అతను మెలకువగా ఉండడానికీ నిశ్చయించుకున్నారు. మరి ఆ చిట్టడివిలో దుష్ట జంతువుల భయం జాస్తి, అందుకని.

మంత్రి కుమారుడు హాయిగా నిద్రపోతున్నాడు; రాకుమారుడు కాపలా కాస్తున్నాడు. అతనిలో ఇదివరలో రేగిన కక్ష ఒకసారి మళ్లీ జ్ఞాపకం వచ్చింది. ఇప్పుడు తమ ఊరు వెళ్ళినతర్వాత మంత్రికుమారుని తెలివితేటలు చూసి తనను అక్కడ ఎవరూ ఆదరించరని భయపడ్డాడు అతగాడు. పైగా రాజకుమారుడైన తనకంటె మంత్రిపుత్రుడు గొప్పవాడు కావడం అతను సహించలేకపోయాడు. ఆవేశం, అహంభావం, అసూయ, అజ్ఞానం అతనిని ఆవహించాయి. ఆ దుష్ట శక్తులకు అతను లొంగిపోయాడు. నెమ్మదిగా కత్తి తీసుకుని మంత్రి కొమరుని ఒక్కపోటు పొడిచాడు. హఠాత్తుగా జరిగిన ఆ దుర్ఘటనకు అంత ప్రమాదపరిస్థితిలో కూడా ఆశ్చర్యపోయాడు మంత్రి కొడుకు. రాకుమారుడు చేసిన ద్రోహం చూసి విచారించాడు. ఈ విషయం తన తల్లిదండ్రులకి ఎలా తెలియపరచాలా అని ఒక్క నిముషం ఆలోచించాడు. కొనప్రాణంతో ఉన్న అతడు మెల్లిగా రాకుమారుడితో యిలా అన్నాడు. "రాకుమారా-నే నెల్లాగా ఆఖరిదశలో ఉన్నాను. నువ్వు నాకో చిన్న సహాయం చెయ్యి...నా తల్లిదండ్రులతో ... మీ అబ్బాయి మీతో 'అప్రశిఖ' అని చెప్పమన్నాడని చెప్పు...చెప్తావు కదూ...!" అంటూ ప్రాణం విడిచాడు మంత్రి కుమారుడు. ఆ మాటలోని అర్థం తెలియలేదు, రాకొమారునికి. తన ప్రయాణం కొనసాగించాడు. తన ఊరికి వెళ్ళినతర్వాత ఏడ్పు నటించి, మంత్రికొమరుని ఆ చిట్టడవిలో ఒక పెద్దపులి తినేసిందని. తాను రక్షించలేకపోయాడనీ తనను తానురక్షించుకోవడమే బ్రహ్మాండమయిందని ఓ కట్టుకథ అల్లి వారిని నమ్మించాడు. మంత్రితో, తన మిత్రుడు అయిన మంత్రిపుత్రుడు పోయేటప్పుడు 'అప్రశిఖ' అంటూ "మా నాన్న ... నాన్న..." అని కూడా అరిచాడని చెప్పాడు. 'అప్రశిఖ' అంటే ఏమిటో అర్థమవలేదు మంత్రికి. ఆ రాజ్యంలోని పండితుల కెవరికీ తెలియలేదు. అది ఎక్కడా ఉన్నమాటలా కన్పించ

## అప్రశిఖ

లేదు వారెవ్వరికీ! రాజు కూడా చాలా విచారించాడు!

కాళిదాసు ప్రతిభ తెలియడం చేత రాజూ మంత్రి కలిసి అతనివద్దకు వెళ్ళి జరిగిన కథ చెప్పి 'అప్రశిఖ' అంటే ఏమిటని అడిగారు. కాళిదాసు తాను చెప్పబోయే నిజంవలన ఎవరూ ఎవరికీ ఏమాత్రం అపకారం చెయ్యబోరని వారిరువురి చేతా ముందుగానే ప్రమాణం చేయించాడు. తర్వాత జరిగిన నిజం చెప్పాడు. ఆ 'అప్రశిఖ' అన్న నాలుగక్షరాలూ ఒక శ్లోకంలోని నాలుగు పాదాల తాలూకు మొదటి అక్షరాలనీ, ఆ శ్లోకం రహస్యం

(55-వ పేజీ చూడండి)

క్రీడారంగం:

# క్రికెట్ పరిస్థితి

ఆస్ట్రేలియా క్రికెట్ జట్టు భారత దేశంలో డిసెంబరు నెలలో పర్యటన చేస్తుంది. అయితే ఈ జట్టువారు మొత్తం అయిదు టెస్టు మాచ్‌లూ, ఇంకొ రెండు మామూలు మాచ్‌లూ మాత్రమే ఆడేందుకు ఒప్పుకొన్నారు. ఈ టెస్టు పోటీల కేంద్రాలలో ఒకటిగా హైదరాబాదు ఎన్నుకోబడుతుందని ఆశించారు. కాన్పూరు క్రికెట్ బోర్డువారు ఒక ఒడంబడికకు వచ్చారని భారతదేశ మాజీ కేప్టెన్ గులాం మహమ్మదు తెలియచేశారు. ఈ ఒడంబడిక ప్రకారం ఒక ఏడాది కాన్పూరు, ఇంకో ఏడాది హైదరాబాదును టెస్టు మాచ్ పోటీల కేంద్రాలుగా పెట్టాలి. క్రిందటి ఏడాది వెస్టిండీస్ జట్టుతో టెస్టు పోటీలకు కాన్పూరు కేంద్రంగా ఎన్నుకోబడింది. అందువల్ల ఆస్ట్రేలియా జట్టుతో జరుగబోయే టెస్టు మాచ్‌లలో ఒకటి హైదరాబాదులో జరుగుతుందని అందరు ఎదురు చూచారు. అయితే ఆల్ ఇండియా క్రికెట్ బోర్డువారు, కాన్పూరు క్రికెట్ బోర్డుకు, హైదరాబాదు క్రికెట్ బోర్డుకు జరిగిన ఒడంబడికతో తమకు సంబంధం లేదని తిరిగి కాన్పూరులోనే రెండవ టెస్టుమాచ్ జరిగేందుకు గాను నిర్ణయించారు. ఏ రంగంలోనైనా ఆంధ్రప్రదేశం హక్కులకొరకు పోరాడే సమర్థులు ఎవరూ లేరు.

వచ్చే టెస్టు పోటీలలో మంజరేకర్ మోకాలు శస్త్రచికిత్స చేసుకొన్నందువల్ల ఆడటానికి వీలులేదు. ఆక్స్‌ఫర్డులో చదువుకొంటున్న అబ్బాసలీ బేగ్ కూడా బహుశ ఈ పోటీలలో పాల్గొనడని తెలియవచ్చింది. సుభాష్ గుప్తే ఆటలో నుంచి విరమిస్తున్నట్లు విన్నాం. దేశంలో యిప్పుడు స్పిన్ బౌలర్లకు లోటులేదు. కొంచెం అనుభవం గడిస్తే గుప్తే తమ్ముడు బాలు గుప్తే ఈయన స్థానాన్ని ఆక్రమించగలడు. ఎటొచ్చి మంజరేకర్, అబ్బాసలీ బేగ్‌తో సమానులైన బాట్స్‌మన్ ఎవరూ దేశంలో లేరు. వయస్సులో చిన్నవారైనా ఆటలో చాలా ప్రజ్ఞను కనబరుస్తున్న మద్రాసు ఆటగాడు మల్హోత్రా సింగుని, బొంబాయి ఆటగాడు అజిత్ వాడేకర్‌ని ఎన్నుకొంటే వీరే రెండుమూడు ఏళ్ళలో ప్రఖ్యాత ఆటగాళ్ళు అయేటందుకు అవకాశాలున్నాయి.

ఇతర దేశాలతో భారతీయ బాట్స్‌మన్ వైఫల్యానికి ముఖ్యకారణం ఫాస్టు బౌలింగును ప్రతిఘటించలేక పోవడమే. దేశంలో ఫాస్టు బౌలర్లు లేనందువల్ల, బాట్స్‌మన్ అలవాటుకోసం బాగా బంతిని విసిరేవారిని చూసి, వారిచేత బంతులను విసరించుకోవాలని బొంబాయి ఎసోషియేషన్ సెక్రటరీ ఎల్. పి. జైన్‌గారన్నారు. ఫాస్టు బౌలింగులో ముఖ్యంగా బంతిని బాగా పైకిలేపవచ్చు బంతిని బౌల్ చేయకుండా విసురుతే అది అంతగా విలువపడదు. మొత్తానికి ఈ ప్రాక్టీసు అంత లాభకరంగా ఉండకపోవచ్చనిపిస్తుంది.

## హాకీ

మ్యూనిక్‌లో జరిగిన అంతర్జాతీయ ఉత్సవంలో భారత హాకీ జట్టు పాల్గొన్నది. అయితే భారతజట్టు ఈ పోటీలో అగ్రస్థానాన్ని ఆక్రమించలేకపోయింది. పశ్చిమ జర్మనీ హాకీజట్టువారే ఈ పోటీలో మొదటి స్థానాన్ని పొందగలిగేరు.

భారతజట్టు ఈ పోటీలలో పశ్చిమ జర్మనీతో, బెల్జియంతో ఇంగ్లండుతో డ్రా చేశారు. వీటి మూలంగా అగ్రస్థానాన్ని పొందలేకపోయారు.

పశ్చిమ జర్మనీతో జరిగినపోటీలలో రెండు పక్షాలవారు చెరొక గోలుచేశారు. అంతకు ముందే ఒకసారి భారతజట్టు నెదర్లాండ్సుతో ఓడిపోవడం మూలంగా ఈ పోటీని అనేకమంది ప్రేక్షకులు ఆసక్తితో చూశారు. ఆట మొదలు పెట్టిన 20 నిమిషాలలో జర్మన్ ఆటగాడైన బుడింగర్ గోలుచేశారు. ఆట సగం అయేటప్పటికి జర్మనీ జట్టుదే పైచేయిగా ఉంది. రెండవ సగంలో భారతజట్టు ఒకే గోలును చేసి పోటీ డ్రా చేశారు. ఈ గోలును ఉధామ్‌సింగ్ చేశారు. దీని తరువాత భారతీయులు ధైర్యంతో ఆడేరు. ఈ పోటీ కూడ 'డ్రా' అయింది. రెండు పక్షాలవారు రెండు గోల్సు చేశారు.

ఈ పోటీల ఫలితంగా ఇతర దేశాలలో ఆట స్థాయి ముఖ్యంగా ఇంగ్లండులోనూ జర్మనీలోను బాగా అభివృద్ధి పొందిందని తెలుస్తూంది. ఇదే కాకుండా భారతజట్టు ఫార్‌వర్డ్సు మునపటివారంత నైపుణ్యం ప్రదర్శించలేకపోతున్నారు. ఇంతకుముందు చాలాసార్లు భారతదేశానికి ఆడిన కె. డి. సింగ్ (బాబు) బల్బీర్‌సింగు, ఆర్. యస్. జంటిల్ లను జరగబోయే ఒలింపిక్ పోటీలలో భారతదేశం తరఫున ఆడమని అడగవలసి ఉంటుంది.

ఈ పోటీలలో అగ్రస్థానాన్ని ఆక్రమించిన పశ్చిమ జర్మనీ జట్టుకు అంతర్జాతీయ హాకీ సమాఖ్య 'లూటీ' కప్పును బహూకరించారు. "ప్రపంచంలోకెల్లా ఉత్తమమైన హాకీ జట్టు"గా పశ్చిమ జర్మనీ జట్టుకు లూటి కప్పును బహుకరించారంటూ మ్యూనిక్ నుంచి వార్త వచ్చింది. భారత హాకీ సమాఖ్య అధికారి ఒకరు దీనిని ఖండిస్తూ యూరపులోకెల్ల గొప్ప జట్టుగా పశ్చిమ జర్మనీ జట్టుకు "లూటీ" కప్పు బహూకరింపబడినదని వివరించారు. ఈ ఖండన మరీ హాస్యాస్పదంగా ఉంది. మ్యూనిక్‌లో జరిగిన పోటీలలో భారతదేశానికి ద్వితీయస్థానమే లభించింది. అగ్రస్థానం పశ్చిమ జర్మనీదే. అనేక సంవత్సరాలనుంచి వచ్చే కీర్తిని నిలబెట్టుకోలేకపోవడం కష్టంగానే కనిపిస్తుందందరికి. అయితే ఓడిపోయ్యాక ఓటమిని అంగీకరించక పోవడం అంతకంటే అధ్వాన్నం.

* * *

అఖిలభారత విశ్వవిద్యాలయ ఫుట్‌బాల్ పోటీలలో ఫైనల్సు ఉస్మానియా జట్టువారు కలకత్తా విశ్వవిద్యాలయం జట్టువారిని ఒక గోలు తేడాతో (స్కోరు 1-0) ఓడించారు. ఈ పోటీలలో హమీద్ చాలా బాగా ఆడారు. ఈయన అఖిల భారత జాతీయ ఫుట్‌బాల్ టోర్నమెంటులో హైదరాబాదుకు ఆడుతున్నారు.

ఇటీవల హైదరాబాదులో రాజస్థాన్ క్లబ్ ఆధ్వర్యాన జరిగిన పటేల్ బాడ్‌మెంటన్ పోటీలు జరిగాయి. ప్రఖ్యాత భారతీయ ఆటగాళ్ళు, విదేశీయ ఆటగాళ్ళు పాల్గొన్నారు. ఈ పోటీలలో డెన్మార్కు దేశస్థుడైన ఎర్లెండు కాప్స్ పురుషుల సింగిల్సు, ఫైనల్సు గెలిచారు. ఫైనల్సులో కాప్స్ భారత ఛాంపియన్ నందూ నటేకర్‌ను ఓడించారు. ★

—రావు.

---

## చదరంగం

### 12 వ సమస్యకు పరిష్కారం

1. - - - ఏ—ఏ4 షా
2. రా × ఏ, ఏ—ఏ6 షా
3. రా—గు 5, బ—ఏ3 షా
4. రా—శ 4, బ—గు4 షా
5. రా—రా 5, మ—రాశ ఆటకట్టు.

# బ్రూక్ బాండ్ టీ




## ఇతర టీలను మించిన మంచి టీ

BB 329 K

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

# ఉత్తరాలు

(2 వ పేజీ తరువాయి)

గున్నవంటే అతిశయోక్తికాదు. చిన్న వ్యాసంలో ఎన్నెన్నో పాటలు పాఠకులకు వినిపించేటట్లు చేశారు.

ఆర్. కె. రావు,
(గడిగనూరు.)

* * *

ఎన్నాళ్ళనుంచో మమ్మల్ని ఊరిస్తున్న శంకర్-జైకిషన్‌ల స్వరలహరి ఈ నాటికి దీపావళిసంచికలో సాక్షాత్కరించింది. శంకర్-జైకిషన్‌ల సంగీతం ఎంతమధురంగా ఉంటుందో ఈవ్యాసంకూడ అంత మధురంగా నేఉంది అనిచెప్పాలి. బసంత్ బహార్‌లో "జజా రెజా" పాటగురించివ్రాస్తూ, జైకిషన్ తబ్లావాయిద్యంలో ప్రవీణుడుగాబట్టే ఆయన ఘనతఅని పేర్కొన్నారు. కాని తబ్లా వాయిద్యంలో శంకర్ ప్రవీణుడనివిన్నాము. నిజానిజలు పత్రికద్వారా తెలియబర్చగలరు.

చామర్తి సుబ్బారావు, (కాకినాడ.)

* * *

వ్యాసకర్త ఒకవిషయం వ్రాయడం మరచిపోయేరు. శంకర్-జైకిషన్‌లు తమ సంగీతానికి క్రొత్తమెరుగులు దిద్దడానికి ఎలా ప్రయత్నిస్తారో, అలాగే నూతన గాయకులకు ప్రోత్సాహమిచ్చి వృద్ధిలోనికి తీసుకొనివస్తారు. దానికి ఉదాహరణగా వారు పది సం॥ క్రితం సి. హెచ్. ఆత్మకు "నగీనా"లో పాడుటకు అవకాశమిచ్చేరు. మరల క్రితం సం॥ సుబీర్ సేన్ అనే యువ బెంగాలీ గాయకునికి 'కఠ్ పుత్లి' సినిమాలో పాడుటకు అవకాశము నిచ్చి అతను వృద్ధిలోనికి రావడమునకు సహాయపడ్డారు.

ఎస్. శ్రీకృష్ణరావు, (శ్రీకాకుళం.)

* * *

స్వరలహరి శీర్షికలో శంకర్, జైకిషన్‌ల పై ప్రచురించిన వ్యాసము ఎంతో చక్కగా ఉన్నది. భైరవి రాగం వారి స్వరకల్పనలకు కామధేనువు వంటిదన్న విషయాన్ని రచయిత ఎంతో చక్కగా వివరించారు. వ్యాసం చివరలో వ్రాసినవాక్యాలు ఎంతో చక్కగా ఉన్నాయి. నిజంగా లతాపాడిన చోరీ చోరీలోని రసిక బలమా అన్నపాట, మైనషే మేహులంలోని తుజన్ సంగ్ అన్నపాట, లవ్ మేరేజిలోని కాహే ఝూమ్ ఝూమ్ రాత్ ఎ సుహానీ అన్నపాట వాటికి సమకూర్చిన సంగీతం వింటూంటే వళ్ళు గగుర్పొడుస్తుంది.

ఐ. ఎస్. సుబ్రహ్మణ్య శర్మ (కోటిపల్లి)

## గోరింటలు

చిత్రగారు వ్రాసిన మా ఇంటి చిన్న తోటలో నీలగోరింట (బాల్సం)లో "వీటిని కొందరుముసుగోరింట అని కూడా అంటారు" అని వ్రాసినారు. అది వాస్తవముగ సరిగాదు. ముసుగోరింటఅ నేది వేరే ఇంకొక రకమయిన పూలచెట్టు. దీనిలో ముద్దపూలు, వివిధ రంగులయిన పూలు లేవు. ఈ వ్యాసము చాలా బాగున్నది. వీరు వివిధ రకములయిన పూల చెట్లను పేర్కొన్నారుగాని, వాటి పెంపక విషయము తెలుపలేదు.

మునిపల్లి వెంకటేశ్వరరావు
(నాగార్జున సాగర్ డాం)

## "పోర్టులకా"

చిత్రగారు పాఠకులన్నట్లు పోర్టులకా (గడ్డిగులాబీ) గురించిన ముచ్చట చారను యావదాంధ్ర దేశము నందంతట ఉన్నది. ఈవిషయముపై బాపట్లనుంచి ఒకరు ఒక ఆంగ్ల దినపత్రికా ముఖమున వేసిన ప్రశ్నకు, కలకత్తానుండి ఒకరు ఈగడ్డి గులాబీ తియ్యగా కారిణి కాదని రూఢిగా తెలియజెప్పారు. కనుక ఎవరునూ ఈ అందమైన పూలమొక్క గురించి ఆందోళన చెందనవసరము లేదు.

మరొకవిషయం: సచిత్ర వారపత్రికలో సూటకించినట్లుగా కాక, ఈ మొక్క మా ప్రాంతమందు ఉదయం ఎనిమిది గంటలకు వికసించి మధ్యాహ్నం పన్నెండు గంటలకు ముకుళించుచునని వాపుచున్నది. దీనికి వాతావరణంలోనున్న మార్పు కారణమా?

జంగా కాత్యాయనీదేవి, (ఏలూరు.)

* * *

పవని నిర్మల ప్రభావతిగారు వ్రాసిన "అతిశయం మితిమీరుతున్న అతివల మాటలు తీరులు" అను వ్యాసము చాలా బాగున్నది. ఆంధ్రదేశంలో పుట్టి ఆంధ్రులమై ఉండి కూడా ఈ రకంమాటలతీరు అదీ మాస్తుంటే వంటినిండా తేళ్ళు జెర్లు ప్రాకుతున్నట్లుంటుంది,

కె. సుజనకుమారి—(చీరాల.)

* * *

"—అతివలమాటల తీరులు", అన్న వ్యాసం చాలా బాగుంది. ఇటువంటి ఉత్తమమైన వ్యాసం వ్రాసిన వీరికి నా హృదయపూర్వక ధన్యవాదాలు. వీరి వ్యాసంలోని వనితలను ఈ మధ్య నేనూ చాలామందిని చూచాను. కొందరలా మాట్లాడుతున్నంతసేపూ, ప్రాణం పోతుందేమోనని నాకు భయం. ఇంతకీ ఆవిడ ఏం చదివింది అంటూ హీలాంట్టి వ్యాని తల్లను ప్పింప్పి వ్వాలి?

శ్రీమతి మూర్తి. ఆర్. (విజయవాడ.)

* * *

నిజంగా అతిశయం మీరిన మగువల మాటలతీరును చక్కగా స్వభావసిద్ధంగా చిత్రించేరు. అదే ఒక సోదరుడు రాసి ఉన్నట్లైతే మాఅతివల ఆత్మాభిమానం దెబ్బతినేది. అయినా ఉన్నవి ఉన్నట్లు రాయటం చాలా ముదావహం పైగా అతిశయం మీరుతున్నవారికే కేవలం అది వర్తిస్తుంది గనుక పేచీలేదు.

సుదేవి (కొటబొమ్మాళి.)

# అప్రశిఖ

(52-వ పేజీ తరువాయి)

వెల్లడిచేసేదనీ చెప్పాడు. ఇది ఏమాత్రం నమ్మలేకపోయాడు రాజు. మరి తన కొడుకుమీదే పడిందకదా అభాండం! ఈ విషయం ఋజువుచేసితీరాలని ఆదేశించాడు రాజు. ప్రాధేయపడ్డాడు మంత్రి.

కాళిదాసు అందుకు సమ్మతించి పారిద్దర్నీ తిన్నగా చిట్టడవిలో మంత్రికుమారుని శవం పడిఉన్న చోటకి తీసుకొచ్చాడు. ఆ శవాన్ని చూసేటప్పటికి ఏడుపొచ్చింది మంత్రికి. అయితే కాళిదాసు మాటలు కొంపతీసి నిజమేమో అనిపించింది రాజుకి. ఆ తర్వాత కాళిదాసు కాళికాదేవిని ప్రార్థించి ఆ మంత్రికుమారుని పునర్జీవితుని చేశాడు. అతడు నిద్రనుంచి లేచినట్లుగా లేస్తున్నట్లుగా లేచాడు. లేస్తూనే

"అనేన తన పుత్రస్య
ప్రసుప్తస్య వనాంతరే
శిఖామాక్రమ్య పాదేన
ఖడ్గేనాపి హతం శిరః"—

అన్నాడు. అంటూనే కాళిదాసుకీ, తండ్రికీ రాజుకీ నమస్కరించాడు. రాజూ మంత్రీ అతని శక్తిసామర్థ్యాలను చూసినమీదట కాళిదాసుకి జోహార్లు అర్పించారు. సముచితంగా సన్మానించారు. ★

# సినిమా

మధ్యాహ్నం రెండున్నరవేళ రాజశ్రీ ప్రొడక్షన్స్ ఆఫీసు టెలిఫోను, సారంగపాణి వీధిలో నాగేశ్వరరావు ఇంటి ఫోనును పలకరించింది. రెండూ ఐదారు నిముషాలు కబుర్లు చెప్పుకున్నాయి తరవాత రాజశ్రీ టెలిఫోను హడావుడిగా ఇంకా ఐదారు ఫోన్లను పలకరించింది. కంపెనీవాన్లూ, రెండుకార్లూ, ఓటాక్సీ మాంబళం నాలుగు వీధులా పరుగులెత్తాయి.

సాయంత్రం నాలుగున్నర కల్లా రాజశ్రీ వారి కొత్త చిత్రం యూనిట్ సందడితో వాహినీస్టుడియో రెండోఫ్లోరు కళకళలాడింది.

ఆపూట నాగేశ్వరరావు, రాజసులోచన, కాల్షీట్లు లేక ఖాళీగా ఉన్నారట. అరుదైన ఈ అవకాశం చూసి రాజశ్రీ నిర్మాత అశ్వత్థనారాయణ, ఇంకా మిగతవారు దొరుకుతారా అని ఆలోచనవచ్చి వాకబుచేశారు. దొరుకుతా...నాగయ్య, కె. వి. ఎస్. శర్మ, ప్ర... సూర్యకాంతం కూడా ఆ పూట ఖాళీగానే ఉన్నారు.

## వార్తావరణం

నిర్మాతలపాలిట ఇన్ని పండగలు ఒక్కసారి అనుకోకుండా జతపడితే (అనుకున్నవే చెడిసే రోజుల్లో) ఇక ఇల్లలకడం ఎంతసేపూ. గంటసేపులో సెటు సెట్టుమీదవాళ్ళులూ సిద్ధమయ్యాయి. తీసేది పెళ్ళిసీను. పెళ్ళివారుగా వందమంది చిన్న నటులను నిముషాలమీదా, కార్లమీదా తీసుకొచ్చేశారు.

హడావుడికి తగ్గ సమృద్ధితోనూ ఉత్సాహంతోనూ దర్శకుడు సి. ఎస్. రావు గంటలో ఆ సన్నివేశాలు తీశారు. రాజశ్రీవారి కొత్త చిత్రం 'శాంతి నివాసం'లో ఇవి కనుపిస్తాయి. దీనికి రచయిత సముద్రాల జూనియర్. సంగీత దర్శకుడు ఘంటసాల.

### ప్రపంచయాత్ర

రాజసులోచన మెడలో పుస్తె ముడిపడేసి ఇవతలికి చక్కా వచ్చారు నాగేశ్వరరావు.

"ఇవాళికిది చాలుట" అంటూ కుర్చీలో కూర్చున్నారు.

(58 వ పేజీ చూడుడు)



సాహిణీవారి 'బండరాముడు' చిత్రంలో రేలంగి, సూర్యకాంతం, రాజనాల, విశ్వనాథం మొదలగువారు.

## చిత్రసమీక్ష

# జెమినీవారి పైగామ్

చాలా కాలంగా చాలమంది ఎదురు చూస్తున్న జెమినీవారి సాంఘిక చిత్రం 'పైగాం' గతవారం బొంబాయి మరాటా మందిర్‌లోను, నగరంలో మరి కొన్ని సినిమాలలోను విడుదలఅయింది. ఆశగా ఎదురుచూచిన చిత్రాలకు, నిరాశ కలిగించే దురలవాటు ఉంది. 'పైగాం' ఈ సంప్రదాయం తప్పించి, పైగా ప్రేక్షకుడికి సంతృప్తి కలిగిస్తుంది. నిర్మాణం, దర్శకత్వం చివరకు ప్రదర్శన కార్యక్రమ నిర్వహణం కూడా జెమినీ పేరుకు తగ్గ స్థాయిలో ఉన్నాయి.

కథావస్తువు సరికొత్తదేమీ కాదు. కథ ఏమంత కొత్తది కాదు. అయినా శ్రామిక పారిశ్రామిక వివాదం ప్రధానంగా రూపొందిన ఈ చిత్రంలో కథనం అంతా కొత్తగా ఉత్తేజకరంగా ఉంది. ఖ్యాతి గడించిన వారు నిర్వహించినట్లు ఉంది. లోగడ ఈ సమస్యపై చెప్పిన కథలకన్న బాగుంది. ఇందులో హీరో ఒక రిక్షావాలా. అతన్ని ఒక అందమైన పైపిసుపిల్ల, ఒక పెద్దమిల్లు యజమానికూతురూ పోటాపోటీలుగా ప్రేమించి అతనికోసం ఎంతకైనా తెగించేటట్లు తిరుగుతూ ఉంటారు. ఇదంతా చూస్తేగా కథంతా ఇలాగే వచ్చే సినిమా కథలా, అచ్చు జెమినీ సినీకథలా ఉందని అనిపిస్తుంది. కాని నిజానికి ఎబ్బెట్టుగా తోచే ఈ సన్నివేశాన్ని అన్నివిధాలా సమర్థించి నమ్మకం కలిగించే పరిస్థితులను కల్పించి విమర్శకు ఆస్కారం లేకుండా తీర్చి దిద్దారు దర్శక రచయితలు. ఆ రిక్షావాలా పూర్వాశ్రమంలో చదువుకున్నవాడే. తరువాత మరలూ, మరమ్మతులూ తెలుసుకొని అందులో ప్రావీణ్యం గడిస్తాడు. ఆ ధరిమేనా కాలేజీ చదువు సాగించడానికి మార్గాంతరం లేక, రిక్షా లాగుతూ డబ్బు గడిస్తాడు ... ఈ విధంగా ఇలా మనం సంభ్రమ చకితులం అయిపోయేలా అన్ని అంశాలను కమ్మేసుకొన్నారు. అయితే అన్నీ ఇలా కమ్ముకురావలసినంత అప్ఘకంగా ఉన్నాయా అన్నది ఎవరిమట్టుకు వాళ్లు తేల్చుకోవలసినదే. ఇకపోతే సినిమా సంప్రదాయాలనుబట్టి చూస్తే ఒక్క లోపం గోచరిస్తుంది. క్రౌర్యానికి నిలయం అనిపించే మిల్లు యజమాని కుమార్తె (విశేషణం ఈ మాటలో దేనికి వర్తిస్తుందో మాకు తెలియదు) హీరోయిను కావడం. ఇదికూడా కొంచెం సర్దితే ఈ చిత్రం మరింత తృప్తి కలిగించేది.

పైగాం చిత్రంలో ప్రఖ్యాత నటీనటులు పలువురున్నారు. దిలీప్‌కుమార్, వైజయంతిమాల, రాజ్‌కుమార్, పండరీబాయ్, మోతీలాల్, జానీవాకర్. ఇంతమంది కలిసినందుకు ఫలితమూ బాగుంది. దిలీప్‌కుమార్ చాలా సమర్థంగా నటించాడు. అతని కంఠస్వరం, దానిని అతను ప్రయోగించిన విధం, బాక్సాఫీసు పాయింటయిన క్రింది పెదవి, అతనిపట్ల సినిమాలు తీసేవారికీ, చూసేవారికీకూడా ఉన్న మోజు (ఇదీ అతని ఘనతేనని అంగీకరించాలి) అతని కృషి రాణించడానికి ఎంతో తోడ్పడ్డాయి. అతను ధరించిన పాత్రకూడా స్వతస్సిద్ధంగా బలం కలది. కథబలానికితోడు, కథనశిల్పంలో దర్శకుడు, కెమెరా, మిగతా అన్ని హంగులూ అందరూ మనుషులూ ఒకేలక్ష్యంతో కృషి చేశారు— తెరమీద దిలీప్‌ను సాధ్యమైనంత ఎక్కువసేపు చూపడం, సాధ్యమైనంత అద్భుతంగా చూపడం. అతను కనబడే దృశ్యాలనూ వాటికి ఇటూ అటూ ఉండే ఇతర దృశ్యాలనూ చూస్తే ఈ తేడా స్ఫుటంగా బోధపడుతుంది. తెరమీద దిలీప్ రాకపోకలకు దేశంమీద పెద్దనాయకుడి రాకపోకలకు జరిగేటంత సన్నాహాలూ చేశారు. ఆయన పలుకే బంగారం కాబట్టి, ఆయన మాటలాడుతున్నప్పుడు సమస్త ప్రపంచమూ నిశ్శబ్దమైపోయి చెవులు రిక్కించుకు వింటుంది. ఈ విధంగా దిలీప్ ఇందులో 'అపూర్వ'మైన నటన ప్రదర్శించి ప్రేక్షకులను ముగ్ధుల్ని చేశాడు.

ఈ సదుపాయాలు లేకపోయినా, ఇంచుమించు ఇంత సమర్థంగానూ నటించి ఇంత గొప్పగాను కనిపించిన మరిద్దరు నటులు మోతీలాల్, రాజ్‌కుమార్. ఈ చిత్రం సంతృప్తి కలిగించడానికి చెప్పుకోతగ్గ ముఖ్య కారణాలలో వీరినటన ఒకటి. దిలీప్‌తో కలిసిఉన్న సన్నివేశాలలో కూడా వీరతని కేమీ తీసిపోకుండా నిలచారు. తారలలో వైజయంతిమాలది అగ్రస్థానం. అందానికి, నటనకూ కూడా ఆమెకు తీసిపోకుండా నిలచిన బి. సరోజాదేవిది ద్వితీయస్థానం. జోకర్ జాన్‌వాకర్ అద్వితీయుడనిపించుకున్నాడు.

సి. రామచంద్ర సంగీతం ఈ చిత్రానికి శోభనుకూర్చిన అలంకారం. రెండుమూడు పాటలు అత్యంతమనోహరంగా ఉన్నాయి. వైజయంతిమాల నృత్యానికి కూర్చిన సంగీతం, చిత్రంలో ఆయా సన్నివేశాలకు సమకూర్చిన నేపథ్యవాద్య సంగీతం సినిమాలో అరుదుగా తటస్థపడేస్థాయిన ఉన్నాయి. రచయిత రామానంద్ సాగర్ సంభాషణలు బాగున్నాయి. దర్శకనిర్మాత ఎస్. ఎస్. వాసన్, అసాధారణమైన దక్షతతో ఈ చిత్రాన్ని లోపరహితంగానే కాక, సంతృప్తికరంగా రూపొందించి ప్రశంసాపాత్రులయ్యారు. చూడతగ్గచిత్రం. —టచ్‌స్టోన్.



శ్రీరామాఫిలింస్‌వారి 'భక్తఅంబరీష' చిత్రంలో రామకోటి, చదలవాడ, రంగారావు, కాంతారావు.



'భక్త అంబరీష' చిత్రంలో శ్రీరంజని జూనియర్

# వార్తావరణం

(56-వ పేజీ తరువాయి)

ఒక్క సీనుకోసం ఇంత హడావుడేమిటని ఎవరో అన్నారు. ప్రొడక్షన్ సాంకేతికబాధ కాలంలో మునిగి తేలుతున్న ఇంకెవరో జాలిగా నవ్వారు.

"నామటుకు నేను, కాళీగా ఒక పూట కూడా గడపాలని తలచుకోలేను. ఎవరెప్పుడు పిలిస్తే అప్పుడు వెళ్ళి పనిచేయడమే నా పని. 60 డిసెంబరునాటికి తెమలాలికదా" అన్నారు నాగేశ్వరరావు.

1960 డిసెంబరు నాటికి తనుఉన్న చిత్రాలన్నిటిలోను తనపనిముగించుకొని జనవరిలో ప్రపంచయాత్రకు బయల్దేరుతున్నారు నాగేశ్వరరావు. పర్యటన నాలుగైదు నెలలు ఉంటుంది. మా దత్తగ దేశాలు అన్నీ చూసి రాదలచుకున్నారు.

అందువల్ల, ఈలోగా తానుపాల్గొనే చిత్రాల నిర్మాతలకు తనవల్ల విడుదల ఆలస్యం కాకుండా అన్నీ ముగించడం ఆయన లక్ష్యం. అప్పటికి సరిగ్గా నూరుచిత్రాలు పూర్తిఅవుతాయి.

నాగేశ్వరరావు ప్రస్తుతం నటిస్తున్న తెలుగుచిత్రాలు (-ంచుమించుఅన్నీ తమిళంలోనూ తయారవుతున్నాయి) జయదేవ, కాళిదాసు, పెళ్ళికానుక, శాంతినివాసం, ఎండమావులు, బాటసడాంటే, (కొత్తచిత్రాలు) చిరాగ్ కహాఁ రోష్నీ కహాఁ కథ ఆధారంగా తీసేచిత్రం, శ్యామలి ఆధారంగాతీసే మరో చిత్రం. ఇవికాక అన్నపూర్ణావారి కొత్త చిత్రం—బహుశా తషేగఫుర్ అనే బెంగాలీ నవల ఆధారంగా తీసేది.

## కొత్త చిత్రాలు

దేవేంద్రగోయెల్ తీసిన చిత్రం చిరాగ్ కహాఁ రోష్నీ కహాఁ హిందీలో బహుళజనాదరణ పొందింది. ఇప్పుడు దీన్ని జైలక్ష్మి పిక్చర్స్‌వారు తెలుగులో నిర్మిస్తున్నారు. నాగేశ్వరరావు, సావిత్రి ముఖ్యపాత్రలు నిర్వహిస్తారు. దర్శకుడు తాతినేని (ఇల్లరికం) ప్రకాశరావు.

## వార్తలు

భక్తజయదేవ చిత్రంలో అంజలీదేవి నాయికపాత్రను నిర్వహిస్తోంది...

నేషనల్ ఆర్ట్‌థియేటర్స్‌వారి 'సీతారామ కళ్యాణం' చిత్రానికి గాలిపెంచల నరసింహారావు సంగీతదర్శకుడుగా పనిచేస్తున్నారు... అన్నపూర్ణావారు పిల్లలకోసం ఒక చిత్రం నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నారు...'పెళ్ళిసంబడు' చిత్రం నిర్మాత చోడవరపు సీతారాం కొత్తచిత్రానికిసన్నాహాలు ఆరంభించారు. సంగీత దర్శకుడు రమేష్ నాయుడు.

జననీ ప్రొడక్షన్స్‌వారు జీవనయాత్ర అనే సాంఘికం తీయబోతున్నారు. రచయిత శ్రీరామచంద్. దర్శకులు రమణారెడ్డి, మహతి.

కె.పి.ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి తొలి చిత్రానికి 'కన్న కొడుకు' అని పేరు పెట్టారు. జగ్గయ్య, గిరిజ, కృష్ణకుమారి, రమణారెడ్డి, బాలకృష్ణ పాల్గొంటున్న ఈ చిత్రానికి కృష్ణారావు దర్శకుడు. రచయిత శ్రీ రామచంద్. సంగీతం ఎస్. పి. కోదండపాణి.

ప్రకాష్ ప్రొడక్షన్స్ వారి 'రేణుకా మాహాత్మ్యం' ఈ నెల 16 న విడుదల అవుతోంది. జగ్గయ్య, గుమ్మడి, జి. వరలక్ష్మి నటించారు. రచయిత డి. వి. నరసరాజు. దర్శకుడు ప్రకాశరావు.

అశ్వరాజ్ వారి 'దీపావళి' అగ్రశ్రేణి నటులతో తయారవుతోంది. సావిత్రి, ఎస్. వరలక్ష్మి, కృష్ణకుమారి, రామారావు, రంగారావు, గుమ్మడి, కాంతారావు, హరనాథ్ పాల్గొంటున్నారు. రచయిత సముద్రాల. దర్శకుడు రజనీకాంత్. సంగీతం ఘంటసాల.

జగన్నాథ్ దర్శకత్వాన చంద్రికావారు నిర్మిస్తున్న 'శ్రీ కృష్ణ రాయబారం' చాలవరకు పూర్తి అయింది. రచయిత మల్లాది రామకృష్ణశాస్త్రి గుమ్మడి, రాజనాల, రఘురామయ్య, కాంతారావు, ఎ. వి. సుబ్బారావు, సంధ్య, హేమలత నటిస్తున్నారు.

హైదరాబాద్ మువీస్‌వారు తెలుగులో 'జల్సారాయుడు' అనే చిత్రం నిర్మించబోతున్నారు. హిందీలో విజయవంతంగా పోతున్న 'జాల్ సాజ్' అనే చిత్రం కథ దీనికి ఆధారమని తెలుస్తోంది. నిర్మాత పి. గంగాధరరావు ('మా యింటి మహాలక్ష్మి'). దర్శకుడు తాపీ చాణక్య.

తెలుగు చిత్రాల నిర్మాణంలో సేలం కూడా క్రమంగా ప్రముఖ స్థానం వహిస్తోంది. ఇదివరలో అక్కడినుండి నాలుగైదు చిత్రాలు వచ్చాయి. ఇప్పుడు మోడరన్ థియేటర్స్‌వారు, సహస్రశిరచ్ఛేద అపూర్వ చింతామణి అనే పేరుతో ఒక చిత్రంతీస్తున్నారు. ఇది 'ఆయిరంతలవాంగియ అబూర్వ చింతామణి' పేరిట లోగడ తమిళంలో అసాధారణ విజయం సాధించింది. ఇప్పుడు తెలుగుచిత్రంలో జగ్గయ్య, గుమ్మడి, రమణారెడ్డి, గిరిజ, ప్రమీల నటిస్తున్నారు.

## ఇల్లరికం రజతోత్సవాలు

ఎల్లరకాల ఇల్లరికాలనూ ఉత్సాహకరంగా కలిపి తాతినేని ప్రకాశరావు తయారుచేసిన కాక్ టెయిల్ -ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి 'ఇల్లరికం' గతివారం ఆంధ్రలో రజతోత్సవాలు జరుపుకొంది. రోజులుమారాయి తరువాత ఇంతటి ఘన

విజయం సాధించిన సాంఘిక చిత్రం ఇదే. కొన్ని విధాల ఈ చిత్రానిదే తెలుగు చిత్రాలలో గొప్పరికార్డు అవుతోంది.

ఈ సందర్భం పురస్కరించుకొని, ఆ చిత్రం నిర్మాత అనుమోలు సుబ్బారావు గతవారం శాంతోమ్‌లోని ఓషియానిక్ హోటల్ ఆవరణలో పెద్ద విందు చేశారు. తెలుగు నటీనటులూ, దర్శకులూ, నిర్మాతలూ, టెక్నీషియన్‌లూ పలువురు వచ్చి ఈ చిత్రంలో పాల్గొన్న వారందరినీ అభినందించి శుభాకాంక్షలు తెలిపారు.

అతిథులకు 'ఇల్లరికం' నటులు జమున, గిరిజ, ఎ. నాగేశ్వరరావు స్వాగతం చెప్పారు. విందుకుముందు, నాగేశ్వరరావు, చిత్రంలోని నటీనటులనూ, దర్శకుడనీ, టెక్నీషియన్‌లనూ డిస్ట్రిబ్యూటర్‌లనూ (నవయుగ). ఎగ్జిబిటర్లనూ పరిచయం చేశారు. నిర్మాత సుబ్బారావు వారందరికీ పూలమాలలు వేసి సత్కరించారు.

ఈ చిత్రాన్ని ఇంతగా ఆదరించిన ప్రేక్షకులకు తామంతా కృతజ్ఞులమని నాగేశ్వరరావు అన్నారు.

## ఆదినారాయణ రావు సన్మానం

1958 వ సంవత్సరానికి ఉత్తమ సంగీత దర్శకుడుగా బొంబాయి ఫిలిం విమర్శకుల సమితి బహుమతి నందుకొన్న ఆదినారాయణరావు గౌరవార్థం, గతవారం తెలుగు పరిశ్రమలోని ప్రముఖ నటీనటులు ఆతిథ్య సంఘంగా ఏర్పడి విందు చేశారు. ఎస్. ఐ. ఇ. టి. స్త్రీల కళాశాల థియేటర్‌లో జరిగిన ఈ సభకు మద్రాసు ప్రధాన న్యాయమూర్తి పి. వి. రాజమన్నార్ గారు అధ్యక్షత వహించారు.

పి. శాంతకుమారి, సావిత్రి, రాజసులోచన, ఆదినారాయణరావుకు తిలకం దిద్ది హారతి ఇచ్చారు. ఎ. నాగేశ్వరరావు, ఎన్. టి. రామారావు, జగ్గయ్య, ఎస్. వి. రంగారావు రేలంగి వెంకటరామయ్య, గుమ్మడి వెంకటేశ్వరరావు, సాలూరి హనుమంతరావు, వీణ రంగారావు, మొదలగువారంతా పూలమాలలు వేసి, పట్టు వస్త్రాలతో, శాలువలతో సత్కరించారు. తరువాత ఎస్. వి. రంగారావు సన్మాన పత్రం చదివి సమర్పించారు. శ్రీ రాజమన్నార్ మాట్లాడుతూ, ఔత్తరాహ సంగీతాన్ని దక్షిణాత్యులు అనుకరిస్తున్నారన్న వాదు ప్రచారంలో ఉన్న ఈ రోజుల్లో శ్రీ ఆదినారాయణరావు తన సంగీతంతో అక్కడే విజయం సాధించి అఖిల భారత బహుమతిని వారివద్దనే అందుకోవడం మనకు గర్వించతగ్గ విషయమన్నారు. తరువాత తాపీ ధర్మారావు, నాగయ్య, సి. పుల్లయ్య, రంగారావు, జెమినీ గణేశన్ మొదలగువారంతా ఆయనను అభినందిస్తూ మాట్లాడారు. జగ్గయ్య వందన సమర్పణతో సభ ముగిసింది.

## నాటకం

డి. వి. నరసరాజు గారి నాటకం 'నాటకం'ను, ఆంధ్రసమితి (చెన్నపురి) నాటక శాఖవారు ఇటీవల మద్రాసు కృష్ణ గాన సభలో ప్రదర్శించారు. ఎ. నాగేశ్వరరావు అధ్యక్షతన జరిగిన ఆ సభలో పింగళి నాగేంద్రరావు, డా॥ జి. రాజారావు ఔత్సాహిక నాటకాల స్థితిగతులపై మాట్లాడారు.

ఒక అమ్మాయి ప్రేమకథలో, కాబోయిన విలను ఉత్సాహం కొద్దీ హీరో అవాల్సిన ప్రేమ సంభాషణలు గడగడ చదివేసేస్తూ, పక్కగదిలోంచి అదంతా విన్న పెళ్ళికొడుకు మనసు విరిగే పర్యంతం అవుతుంది. అప్పుడు సూత్రధారి రఘుపతి, అతను విన్నదంతా ఒక పెద్ద నాటకంలో భాగం అని నమ్మించడం కోసం నిజంగా ఓ నాటకం రాసి ఆడి, మొత్తంమీద ఓ పెద్ద నాటకం ఆడించి పెళ్ళి అడ్డంకిని కడతేర్చడం ఇందులో వృత్తాంతం. ఔత్సాహిక నాటక ప్రేక్షకులందరి గౌరవాభిమానాలూ చూరగొన్న రచయిత నరసరాజు గారు, హుషారైన మాటలాటలతో మనుషుల్ని ఆడించి



ఉత్తమ సంగీతదర్శకునిగా [illegible] ఆదినారాయణరావును గతవారం మద్రాసు [illegible] ఘనంగా ఏర్పాడి సన్మానం చేశారు. (ఎడమనుండి:) శ్రీయుతులు నాగయ్య, ఎ. నాగేశ్వరరావు, ఆదినారాయణరావు, అంజలీదేవి, రేలంగి, జగ్గయ్య మొదలగువారిని ఈ చిత్రంలో చూడవచ్చు.



విక్రమ్ ప్రొడక్షన్స్‌వారి "మహిషాసుర మర్దని"లో గుణవతిగా జానకి.

# బొంబాయి లేఖ

ఓంప్రకాశ్ కొత్తచిత్రం 'చాచా జిందాబాద్' నిర్మాణం మొన్ననే పూర్తి అయింది. ఇది ఓమ్ స్వంతకంపెనీ 'లైట్ అండ్ షేడ్' పేరిట తీసినదే. ఓసారి వచ్చి చూసి పొమ్మని ఓమ్ గతవారం పిలవగా ఈ చిత్రం చూడడం జరిగింది.

చాచాజిందాబాద్ కన్నుకథకు తీసుకున్న ఊహ అద్భుతమైనది. దాన్నిబట్టి దాని చుట్టూ అల్లిన కథకూడా చక్కగా ఉంది. ఇందులో తొలిసారిగా అనితాగుహకు చాలా పెద్దవేషం దొరికింది. ఆమె అందుకు తగ్గవిధంగా జాగ్రత్తగా నటించింది. హీరో కిషోర్‌కుమార్ తన కుషారైన అల్లరితో చిత్రం అంతటా ఆడుతూ పాడుతూ తిరిగినా అనితాగుహను కూడా మనం మెచ్చుకుంటాం. జాగీర్‌దార్, రాజ్ మెహ్రా ఇందులో ఉన్నారు. దర్శక నిర్మాత ఓమ్‌ప్రకాశ్ కొత్తగా హాయిగా కనిపించే తరహా హాస్యంతో అలరించాడు. సంగీతం మదనమోహన్ అని చెబితే చాలు అనుకుంటాను.

దర్శక నిర్మాత రాజ్ రిషి, కొత్తచిత్రానికి 'లాకీర్ కె ఫకీర్' అని పేరుపెట్టారు. ఇప్పుడు తీస్తున్న 'ఏక్ కె బాద్ ఏక్' పూర్తికాగానే ఇది ఆరంభిస్తారట. ఇందులో పరిచయం చేయబడుతున్న కొత్తనటి శారద, 'లాకీర్'లో కూడా ముఖ్యపాత్ర నిర్వహిస్తుంది. అందులో హీరోగా ఒక కొత్త నటుడిని పరిచయం చేస్తారు. 'లాకీర్' చిత్రానికి ఎస్. డి. బర్మన్ సంగీతం సమకూర్చుతారు.

* * *

ఆర్. బి. ప్రొడక్షన్స్‌వారి సంగీత చిత్రం 'జాదూగర్ సయ్యాం'కు సంగీత దర్శకుడు జిమ్మీ గతవారం రెండు పాటలు రికార్డు చేశారు. చిన్న నటులతో, కొద్ది బడ్జెట్‌తో తీస్తున్న ఈ చిత్రంలో కృష్ణకుమారి, సమర్ రాయ్: మారుతి, పి. కైలాస్, స్వప్నా, గులాబ్, అమీర్ బాయ్ కర్ణాటకీ,, సాధన అనే కొత్త నటి(ఫిల్మాలయవారి నటి సాధన వేరు) పాల్గొంటున్నారు. దర్శకుడు కె. జె. పార్మార్.

* * *

వ్యాపారంలో గాని, జీవనవ్యాపారంలో గాని ఏ క్షణానికాక్షణం అందరిచేత ఔననిపించుకుంటూ పోవడానికి ఒకముఖ్యసూత్రం అన్నవేళకు అన్నపనిని చేయగలగడం. ఇది తెలిసినవారు, పదిగంటలకు ఒకచోటికి వెళ్ళాలనుకుంటే తొమ్మిదీ అరవై నిముషాలకు అని గుర్తుంచుకొంటారు. ఏది ఏమైనా ఆ అరవయ్యో నిముషానికి అక్కడ ఉంటారు.

సినిమాలోకంలో మటుకు తొమ్మిదిఅంటే 11 అనీ, పదిఅంటే పన్నెండున్నర అనీ వ్యవహార నిఘంటువు చెబుతోంది. చాలామంది, వేళకు రావడంఅంటే సిగ్గుపడతారు. గతవారం రామన్‌స్టుడియోలో ఏషియాటిక్‌వారి చిత్రం పతంగ్ సెట్ మీద ఏడోగంటకల్లా రాజేంద్రకుమార్ సిద్ధంగా కూర్చునివుండగా చూసి, పైనచెప్పిన అభిప్రాయాలన్నీ చెరిపేసుకోబోయాను, కాని తొందర తగదని ఆగివుండగా హీరోయిను మాలాసిన్హా ఇంకా రాలేదని తెలిసింది. ఇంతకీ ఆమెమధ్యాహ్నం ఇంకోచోట షూటింగ్‌కు వెళ్ళడానికనే నిర్మాతలు ఈపూట ఇంతపెంద్రాళే ఈ కాల్షీటు ఏర్పరచి అందర్నీ పిలచారు. అయినా మాలాసిన్హా ఏడుకు రావలసింది, తొమ్మిదిన్నరకు వచ్చింది. ఆమె సాధారణంగా వేళకువచ్చే ఆర్టిస్టుఅనే మంచి పేరు ఉంది. అయినా ఇలాటి పొరబాటు ఒక్కసారి జరిగినా చాలు. అందరికీబాధా చికాకూ నిర్మాతకు నష్టం కలగడానికి. రాత్రిపన్నెండున్నరదాకా పేకాట ఆడుతూ నిద్రపోలేదు కాబట్టి ఉదయం త్వరగా మెలకువ రాలేదు కాబట్టి...అనేవి అద్భుతమైన సంజాయిషీలు కాజాలవు.

ఇంతకీ మాలాసిన్హా ఆలస్యానికి కారణం ఏమిటో తెలియరాలేదు. ఏమైనా, ఎంతటి కారణంవున్నా. తోటి నటులు టెక్నిషియన్లు ఆమెకోసం మూడుగంటలు కాసుకు కూర్చోవేలా చేయడం సబబు కాదు. ఎవరికైనా అంతే.



# వార్తావరణం

ఈ నాటకాన్ని నడిపారు. మొన్నటి ప్రదర్శనంలో నటులూ ఇందుకు తగ్గ స్థాయిలో ఉత్సాహంగా నటించారు. ఉన్నవారిలో సూత్రధారి రఘుపతిగా రావికొండలరావు, హాస్య పాత్రధారి శివశంకరంగా ప్రసాద్, ప్రశంసనీయంగా నటించారు. అమ్మాయి ఊర్వశిగా రాధకుమారి నటించింది. కృష్ణాజీ, రామచంద్రరావు, రామశేషయ్య, పి. జె. శర్మ పాల్గొన్నారు. నాటక ఆడినా ఆడక పోయినాకూడా ప్రేక్షకులను నవ్వించి అందరిదృష్టినీ ఆకట్టుకున్న శివశంకరం విశేషించి అందరి ప్రశంసలూ అందుకొన్నాడు.

## త్యాగరాజభాగవతార్ మృతి

నటుడికి సంగీతంలో ప్రతిభ విధాయకంగా ఉంటూవచ్చిన రోజులలో తమిళ సినిమాను పరిపాలించి, ఆఖరుకు గానం కూడా అక్కరలేదన్న భావం నిలబడుతున్న రోజులతో ఆగిపోయిన తమిళ నటగాయకుడు త్యాగరాజభాగవతర్ మృతి (నవంబరు 1) సంగీతప్రియులందరికీ సంతాపం కలిగించింది.

1945 వరకూ దాదాపు పదేళ్ళపాటు త్యాగరాజభాగవతర్ తమిళ చిత్రసీమలో ఉచ్చదశలో ఉన్నారు. ఆయన చిత్రాలలో అంబికాపతి, చింతామణి, హరిదాసు, అశోక్‌కుమార్ ఏడాదినుండి రెండుసంవత్సరాలవరకూ నడచి అనన్యసాధ్యమనిపించుకున్న విజయాన్ని సాధించాయి. తెలుగు దేశంలోకూడా ఆనాడు ఈ చిత్రాలు ఆదరణ పొందాయి. ఆయన శాస్త్రీయ సంగీతంలో కూడా ప్రజ్ఞ గడించారు. తరచు గానసభలు చేసేవారు. మరణకాలానికి ఆయన వయసు 50 సంవత్సరాలు. ఆఖరుచిత్రం 'శివకామి' విడుదల కావలసిఉంది.





# అనుమాన పిశాచం



(13-వ పేజీ తరువాయి)

తలుపు తెరుచుకోగానే మధు రెండు అంగల్లో హాల్లోకివచ్చి వరండాలోకి రాబోయి అప్పుడే కడుపునిండా భోంచేసి భుక్తాయాసంతో సతమతపడుతూ పడుకోటానికి చోటు చూచుకుంటూ వస్తున్న ఓ లావుపాటిబామ్మగార్ని దభీమనిఢీకొన్నాడు. ఇద్దరూ కట్టకట్టుకొని, రాత్రంతా నిద్రలేక గుర్రుపెట్టి నిద్రపోతున్న వాళ్ళమీద పడటంతో వాళ్ళు మేల్కొని, చెరిగిన కొప్పు, మొహంనిండా రక్తపుచారలతోను, చిరిగిన వస్త్రంతోను హడావిడిగా పరుగెత్తుకొచ్చిన శోభనపు పెండ్లికొడుకును చూచి ఆశ్చర్యపోతూ చూస్తూంటే, 'మా అమ్మేదండీ' అన్నాడు కంగారుగా లేస్తూ. దాంతో వాళ్ళు కొంచెం తెప్పరిల్లుకొని, 'దొడ్లో ఉన్నట్టున్నారు పోయి చూడు నాయనా' అని, మధు అటువైపు పరుగెత్తగానే, ఏం జరిగిందో చూద్దామని శోభనపు గదివైపుకు పరుగెత్తారు.

పెరట్లో కూర్చుని కబుర్లుచెప్పుకుంటున్న వియ్యపురాళ్ళిద్దరూ "అమ్మో పెళ్ళికూతురు పిచ్చిమనిషే! మనం మోసపోయాం" అంటూ వచ్చిన మధు వేషంచూచి నిశ్చేష్టులయి ఒక నిముషం తరువాత గదిలో పెళ్ళికూతురు దగ్గరికి పరుగెత్తారు. మధు వాళ్ళతో వెళ్ళాడు.

పగిలిన గాజుముక్కలు, విసిరేసినపూవులు మీద పోసుకుంటోందా పెళ్ళికూతురు. అందర్నీ చూడగానే వాళ్ళమీద విసరటం మొదలుపెట్టింది వెకిలినవ్వు నవ్వుతూ. అందరూ దూరంగాపోయి నిల్చొని విస్తుపోయి చూస్తూ తలోకమాట అన్నారు.

విషయం విన్న బ్రహ్మయ్య, కుటుంబరావుగారు అక్కడికి పరుగెత్తుకొచ్చారు. పెళ్ళికూతుర్ని చూచి బ్రహ్మయ్య కోపంతో రుద్రుడయ్యాడు. ఒక నిముషం స్తబ్ధులై నిల్చొన్న కుటుంబరావుగారు, భార్య సీతమ్మ కూతురిదగ్గిరికెళ్ళి చేతులు పట్టుకొని 'ఏమిటమ్మా ఇదంతా, ఏం జరిగింద'ని అడిగితే గట్టిగా వెకిలినవ్వు నవ్వటంతప్ప వాళ్ళకేమీ సమాధానందొరకలేదు. బ్రహ్మయ్య, వెంకాయమ్మ 'మేము డబ్బులేనివాళ్ళమని మోసపుచ్చి పిచ్చిదాన్ని అంటగట్టార'ని వియ్యంకుడ్ని, వియ్యపురాల్ని అనరాని మాటలు అన్నారు. కుటుంబరావుగారు, సీతమ్మ 'మాకేమీ తెలియదు. రోజూ బాగానే ఉంటోంది. ఎందుకు ఈమాదిరి అయిందో మాకు తెలియదు. తొందరపడవద్ద'ని బ్రహ్మయ్యని కాళ్ళా వేళ్ళాపడి బ్రతిమాలుకున్నారు.

స్థిమితంగా ఉండాల్సిన పెండ్లింట్లో అర్థరాత్రివేళ జరుగుతున్న హడావిడి చూచి ఆనందించిపోవాలని ఇరుగుపొరుగువాళ్ళు వచ్చి అంతా తెలుసుకొని ఆయింట్లో అందమైన అమ్మాయి ఉండేదని, ఆ అమ్మాయి కిష్టంలేని పెళ్ళి చేయటంవలన విషం మింగి చచ్చి దెయ్యమయిందని ఇదివరకున్న వాళ్ళనికూడ ఇట్లాగే బాధపెడితే వాళ్ళు వెళ్ళిపోయారని చెప్పి బ్రహ్మయ్యని వెంకాయమ్మని తొందరపడవద్దని నచ్చచెప్ప ప్రయత్నించారు. ఎవరెన్ని చెప్పినా వినకుండా 'ఆ అమ్మాయికి చిన్నప్పటినుండి ఉన్న పిచ్చే. మాకు చెప్పకుండా మీరు, నా ప్రియమిత్రుడు అని నమ్ముకున్న నా చిన్ననాటి స్నేహితుడు చంద్రయ్య కలిసి దాచిపెట్టి దొంగపెళ్ళి చేశారు. నేనెక్కడడుగుతానోనని సెలవు లేదని పెండ్లికి రాకుండా తప్పించుకున్నాడు చంద్రయ్య. ఎట్లా తప్పించుకుంటాడో చూస్తాను. మీకూ మాకూ ఇక సంబంధం లేదు' అంటూ—కుటుంబరావుగారు ఎంత బ్రతిమిలాడుతున్నా వినకుండా భార్యని, కొడుకును తీసుకొని బ్రహ్మయ్య ఊరికి వెళ్ళిపోయాడు అప్పటికప్పుడే. తతిమ్మా వాళ్ళందరూ తరువాత వెళ్ళిపోయారు.

కుటుంబరావుగారికి అర్థమయింది ఆయిల్లు ఎందుకు చవగ్గా వచ్చిందో. వాతావరణం ఆ ఊళ్ళో బాగుంటుందని, పిల్లల చదువు సాగుతుందని పైగా చవగ్గా వచ్చిందికదాని అనుకోకుండా కొనేశాడు నెల్లాళ్ళక్రితం. పెద్దకూతురు లత పెండ్లికూడ స్వంతయింట్లోనే చెయ్యాలనే ఉద్దేశ్యంతో ఇంటికి సున్నాలు, రంగులు వేయించి పదిహేను రోజుల క్రితమే ఆ ఇంట్లో ప్రవేశించారు. ఎవర్నీ అడక్కుండా కొన్నందుకు తన్ను తానే నిందించుకొన్నారు కుటుంబరావుగారు. తన యింట్లో మొట్టమొదటి శుభకార్యం ఎంతో బాగా జరపాలని అనుకుంటే ఇంత గొడవ జరిగినందుకు క్రుంగిపోయారు. వెంటనే డాక్టరును పిలిపించారు. జబ్బేమిటో తెలుసుకుందామనే ఉద్దేశ్యంతో. డాక్టరు లతనిపరీక్షచేసి 'వంటికి సంబంధించిన జబ్బు ఏమీ లేదు. ఇదేదో గాలికి సంబంధమైనదే. భూతవైద్యుల్ని పిలిపించి బాగుచేయించండి నా వల్ల కాద'ని వెళ్ళిపోయారు.

తన కూతుర్ని పట్టిన దెయ్యాన్ని పోగొట్టించటానికి ఎక్కడెక్కడనుండో పెద్దపెద్ద భూతవైద్యుల్ని పిలిపించి ఎంతో డబ్బు ఖర్చుచేసి చిట్టచివరకు ఆ దెయ్యాన్ని ఇంట్లోంచే పోగొట్టించగలిగారు ఆరునెలలకి.

దెయ్యం వదలిపోయిన తరువాత లత జరిగిందంతా తెలుసుకొని క్రుంగిపోయింది, తన తండ్రికి జరిగిన అవమానానికి. తన కూతురు కాపురం చక్కపడుతుందని, రెండవకూతురుకి వచ్చే సంబంధాలు తిరిగిపోవని కుటుంబరావుగారు ఎంతో పొంగిపోయారు.

ఊరుకు వెళ్ళిపోయినతరువాత మధుకి మనసు మనసులో లేదు. తానొకటి తలిస్తే దైవమొకటి తలచింది. అసలుపెళ్ళే చేసుకోనన్నవాడు తల్లితండ్రుల ఆనందంకోసం తను పెళ్ళిచేసుకొని వాళ్ళఆశలు నెరవేర్చాలని అనుకుంటే కథ అడ్డంతిరిగింది. అది తలచుకొని తలచుకొని పూర్తిగా క్రుంగిపోయాడు మధు. బ్రహ్మయ్య, వెంకాయమ్మ కొడుకులోని మార్పును చూచి భయపడి దగ్గర ఉంచటం మంచిదనుకొని మధుకు సెలవులయిపోయి ఉద్యోగంలో చేరటానికి వెళ్ళేటప్పుడు తామకూడ బయలుదేరి వెళ్ళి ఒక యిల్లు అద్దెకు మాట్లాడుకొని ఉన్నారు.

ఒకరోజున కుటుంబరావుగారి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. పండుగకు కొడుకును తీసుకొని భార్యాసమేతంగా వచ్చి కొన్నాళ్ళు ఉండి తమ్ము ఆనందింపచేయాలనీ, కూతురికి ఇదివరలో ఉన్న లక్షణాలు ఏమీ లేవనీ, అన్నీ బాగుచేయించామనీ, ఇప్పుడు ఆరోగ్యంగా ఉందనీ, గతంలో జరిగినది మరచిపోయి తప్పకుండా రావాలనీ వ్రాశారాయన. కోడలికి పట్టిన దెయ్యం పోయిందని వాళ్ళూ వీళ్ళూ చెప్పగా బ్రహ్మయ్య, వెంకాయమ్మలు విని ఉండటంవల్ల మెత్తబడి, కొడుకును అత్తగారింటికి వెళ్ళమన్నారు. కాని మధు ససేమిరా వెళ్ళనన్నాడు. కొడుకురానన్నాడని వ్రాస్తే బాగుండదని తనభార్యకి వంట్లో కొంచెం సుస్తీగా ఉండినందువలన రాలేకపోయామని పండుగ వెళ్ళిపోయినతరువాత బ్రహ్మయ్య జాబువ్రాశాడు వియ్యంకుడికి.

లతకి నయమైందని తెలిసికూడ పండుగకి రాకపోవటంతో కూతురికాపురం నిలబెట్టటానికి ఇది పద్ధతికాదని వియ్యంకుడికివియ్యపరాలికి నచ్చచెప్పి కూతుర్ని దిగబెట్టి వద్దామనే ఉద్దేశ్యంతో కుటుంబరావుగారు, సీతమ్మ లతను తీసుకొని వియ్యంకుడుగారిం



# అనుమాన పిశాచం



టికి వెళ్ళారు.

గుమ్మం ఎక్కుతున్న కుటుంబరావుగారు, సీతమ్మ, లతను చూచి హఠాత్తు ఆగమనానికి బ్రహ్మయ్య, వెంకాయమ్మ ఆశ్చర్యపోయినా తమాయించుకొని కొంచెం ముభావముగానే కుశలప్రశ్నలు వేశారు. కుటుంబరావుగారు విషయం తెలియపరచగానే బ్రహ్మయ్య కొంచం నసిగాడు కొడుక్కిష్టంలేదని.

కుటుంబరావుగారు 'అటువంటి లక్షణాలేమీ లేవు, అంత అనుమానంగా ఉంటే మేముకూడ అమ్మాయితో మూడురోజులుంటాము. అటువంటిదేమైన జరిగితే తీసుకొనివెళతాము' అన్నారు. ఈ పద్ధతి వాళ్ళిద్దరికీకూడ నచ్చటంతో సరేనని ఒప్పుకున్నారు. అంతమాత్రానికే కుటుంబరావుగారు, సీతమ్మగారు కూడా ఎంతో సంతోషించారు.

కాలేజీనుండి తిరిగివచ్చిన మధు అత్తమామలను, లతను చూచి అదిరిపడ్డాడు. కుటుంబరావుగారే ముందు మధుని పలకరిస్తే 'ఔను' 'కాదు' లతో సమాధానములిచ్చి సంభాషణ పూర్తిచేశాడు అప్పటికి. తరువాత మధుతో షికారుకువెళ్ళిన కుటుంబరావుగారు అల్లుడితో విషయం తెలియపరచి 'లతకు అటువంటి లక్షణాలు ఏమీలేవు. ఇంకా మూడురోజులుంటాం కాబట్టి అటువంటిదేమైనా జరిగితే తీసుకొనివెళ్తాం. దీనికి అమ్మ నాన్నగారు సమ్మతించారు. మీరూ సమ్మతిస్తే బాగుంటుంద'ని అంటే మౌనమే అర్ధాంగీకారం అన్నట్లుగా ఏమనకుండా ఊరుకున్నాడు.

అనుకున్న ప్రకారం కుటుంబరావుగారూ సీతమ్మా మూడురోజులుండి ఏ గొడవా జరగకపోవటంతో లతను దిగవిడిచి నాల్గవరోజున ప్రొద్దున్నే వెళ్ళిపోయారు. కోడలు మళ్ళీ మామూలు మనిషయినందుకు బ్రహ్మయ్య, వెంకాయమ్మ ఎంతో సంతోషించారు.

నాల్గవరోజున మేడమీద గది ఏర్పాటు చేసింది వెంకాయమ్మ కొడుకు కోడలు ఉండటానికి. తల్లి ఎంతచెప్పినా వినకుండా అక్కడ పడుకోనని పట్టుపట్టాడు మధు. తండ్రి కోప్పడ్డంవరకు వచ్చేసరికి లత గదిలో పడుకుంటే తను ఆరుబయట పడుకోవచ్చుగదా అని అనుకొని ఒప్పుకున్నాడు.

మధు—లత పైకిరాకముందే చాప దిండు తెచ్చుకొని ఆరుబయట పడుకున్నాడు; గదిలో పడుకుంటే మళ్ళీ దెయ్యం ఎక్కడ హడలుగొడుతుందోనని. ఇంతలో మెట్లెక్కుతున్నట్లు మట్టెలశబ్దం వినబడితే కళ్ళు మూసుకొని పడుకున్నాడు, నిద్రపోతున్నవాడికి మల్లే. లత మధు నిజంగానే నిద్రపోతున్నాడనుకొని గదిలోకి వెళ్ళి పాలు పండ్లు అక్కడపెట్టి మధు దగ్గిరకి నిల్చోటం అప్పుడే కళ్ళు తెరచిన మధుకు కనిపించి 'లోపలికివెళ్ళి పడుకో' అన్నాడు. చలిగాలి వస్తోంది లోపలికివచ్చి పడుకోమని అనలేక అనలేక అంది. మొదటిరోజున రభస జ్ఞాపకం తెచ్చుకొని కుంగిపోతూ లత కూడా వచ్చి బయట పడుకుంటానన్నది. 'నీకు బయటపడుకోవాలని వుంటే వచ్చి పడుకో నేను క్రిందికిపోయి పడుకుంటా' అన్నాడు కొంచం కోపంగా. లత

మాటకు ఎంతో బాధపడింది, తను నిజంగా భర్తను బాధపెడుతున్నానా అని ప్రశ్నించుకొని. మధు కిందకివెళ్ళి పడుకుంటే అత్తమామలు అంతకుముందు కోప్పడినట్లుగా మళ్ళీ కోప్పడతారని తనే లోపల పడుకోవటానికి నిశ్చయించుకొని, భర్తను రగ్గు కప్పి తను లోపలికివెళ్ళి దుప్పటివేసుకొని కింద పడుకుంది.

మధుకి నిద్రపట్టలేదు. ఏ నిముషానికి దెయ్యం వస్తుందోనన్న భయం, ఏంచెయ్యాలని ఆలోచనతో సతమతమవుతూంటే ...రాన్ని ఓ చేతికర్ర కనుపిస్తే దానిని తెచ్చుకొని దగ్గరపెట్టుకొని ఆలోచిస్తూనే నిద్రపోయాడు.

కడుపుమీద ఏదో గుచ్చుకోటంతోను మెల్లగా తగలటంతోను మధుకు మెలకువ వచ్చి కళ్ళు తెరచిచూస్తే అంతా చీకటి. దెయ్యం వచ్చింది కాబోలు తన భరతం పట్టటానికనుకొని రగ్గు పక్కకినెట్టి కర్ర దగ్గరపెట్టుకొని పడుకున్నందుకు తన్ను తాను అభినందించుకుంటూ 'ఆంజనేయస్వామికీ జై' అని మనసులో అనుకొని లేచి కూర్చుని చూచాడు. చీకట్లో రగ్గు కదలటంతప్ప ఏమీ కనపించలేదు. 'ఓహో నాక్కనిపించకుండా వుందామని కప్పుకొంది ఆహా! దెయ్యం తెలివా'ని కర్రతో ఈ దెబ్బతో దెయ్యం గియ్యం పారిపోవాలని ఒక్క వేశాడు బలంకొద్దీ. తను వేసినదెబ్బ వేలమీద పడటంతో ఆ శబ్దాని కదుగకొని ఒక నల్లపిల్లి రగ్గులోంచి 'మ్యావ్' అంటూ బయటికి రావటం చీకట్లో మధుకి అస్పష్టంగా కనిపించి, ఇంత గోలచేసింది పిల్లేనా అనుకొని తన అనుమానానికి తానే నవ్వుకొని అనుమానం పెనుభూతం అంటారు యిందుకే కాబోలనుకొని ఆవులించి మళ్ళీ ముసుగుతన్నాడు.

సూర్యకిరణాలు మొహంమీద పడేటప్పటికి మెలకువవచ్చింది. కిందకివెళ్ళి పళ్ళుతోముకొని కుర్చీలో పేపరుచదువుతూ కూర్చున్నాడు. లత కాఫీ తీసుకొనిరావటంగమనించి అక్కడపెట్టి వెళ్ళమన్నాడు తలవంచుకొనే.

లత ఏపనిలోనైనా సహాయం చేద్దామని వెళితే మధు అక్కడినుండివెళ్ళిపోయేవాడు. భర్తకు తనమీదవున్న విముఖతను గమనించి ...గా నొచ్చుకుంది. తాను భర్తకు కనబడకుండానే అతనికి చెయ్యగలిగిన పనులు చేస్తూ తనపై భర్తకుగల అనుమానం ఎప్పుడు తొలగిపోతుందా అని ఆవేదనపడిన రోజుల లెక్క భగవంతునికెరుక.

కొంతకాలం జరిగిపోయింది. అది వర్షాకాలం. మధు మామూలుగానే బయట పడుకున్నాడు. సగంరాత్రివేళ చిన్నచిన్న చినుకులు మొదలుపెట్టాయి. వర్షం రాదులే అనుకున్నాడు మధు. చిన్న చిన్న చినుకులల్లా పెద్దవై వర్షం మొదలుపెట్టింది. మధు చిక్కుల్లోపడ్డాడు. ఏం చెయ్యటానికీ తోచలేదు. కిందికి వెళ్ళి గదిలో జలుకొడుతోందని చెబితే లతను రమ్మంటారు. అప్పుడు ఎటూ, ఒకే గదిలో పడుకోవాల్సివస్తుంది. కాబట్టి యిక్కడే ఒకమూల లతకి తెలియకుండా రహస్యంగా పోయి పడుకుంటే సరిపోతుందనుకొని చప్పుడు చెయ్యకుండా కర్ర తీసుకొని వెళ్ళి గోడకానించి కిటికీకి ఎదురుగా పక్క వేసుకొని రగ్గు కప్పుకొని పడుకున్నాడు. కొంచెం దూరంలో లత కింద దుప్పటి వేసుకొని పడుకొని వుంది. బెడ్ రూమ్ లైట్ గాలికి రెపరెపలాడుతోంది.

చాలాసేపువరకు నిద్రపట్టక సతమతమవుతూ కొంతసేపటికి మగతనిద్రపోయాడు. కర్ర మీదపడటంతో మెలకువవచ్చి మధు రగ్గు లాగటంతో పూర్తిగా జాగ్రదావస్థకు వచ్చాడు. బెడ్ రూమ్ లైట్ ఆరిపోయింది. కిటికీ తలుపులు గాలికి అటు ఇటు కదులుతున్నాయి. గాజుగ్లాసు ఫెళ్ళున విరిగింది. మంచినీళ్ళ చెంబు దొర్లి నీళ్ళు మధుమీద పడ్డాయి. కొంచం దూరంలో లత పడుకున్నచోట ఏదో నల్లని ఆకారం తనవైపుకి వస్తుండేసరికి మధుకి కాళ్ళు చేతులు చల్లబడ్డాయి. దడకూడ మొదలుపెట్టింది. చేసిన గొడవంతా చాలనట్టు దెయ్యం తనని రక్కటానికూడ వస్తోందని నిర్ణయించుకొన్న మధు రగ్గుతో సహా లేచి తలుపు తెరిచి బయట పడి కిందకి కంగారుగా దిగటంలో వర్షం కురిసి వుండటంవలన మెట్లమీద జారి డొల్లి బుచ్చికాయలా కిందికి దొర్లాడు.

ఆ చప్పుడువిని లేచివచ్చిన వెంకాయమ్మ నల్లటి ఆ కారాన్ని చూచి దొంగనుకొని 'ఏవండోయ్ దొంగండి త్వరగా రండి' అని కేకలుపెట్టింది. హోరున వర్షం కురుస్తుండటంవలన అక్కింట్లో పక్కింట్లో వాళ్ళకి వినపడలేదు. లేకుంటేవచ్చేవారేమో. బ్రహ్మయ్య మెలకువగా ఉండటాన ఊడిపోతున్న గోచీని దోపుకుంటూ కర్రతీసుకొచ్చాడు కొట్టటానికి.

ఇంతలో మధు తెప్పరిల్లుకొని లేచి 'అమ్మా నేనే దొంగకాదు. మళ్ళీదెయ్యం పట్టింది. నేనిహ ఏమైనాసరే అక్కడపడుకోను' అన్నాడు. చిన్నపిల్లాడిలా దెయ్యం పట్టిందనేసరికి వెంకాయమ్మకి కాళ్ళూ చేతులు వణికాయి. బ్రహ్మయ్య దగ్గరలో చీపురకట్టను తీసుకొని దీని అంతేమిటో తేలుస్తానని పైకివెళ్తుంటే అతన్ననుసరించి మధు వెంకాయమ్మ మెల్లిగా పైకివెళ్ళారు.

గుమ్మం దగ్గరకెళుతూ వుండగా కుర్చీలు బరాబరా ఈడ్చినట్లు, చెంబు దొర్లినశబ్దం విని వెంకాయమ్మ కెవ్వున కేక వేసేసరికి బ్రహ్మయ్య భార్యనోరుమూసి మెదలకుండా రమ్మని సైగచేశాడు. ఈ లోపల లైటు వెలిగింది. 'నీ దుంపతెగ ఉండు నీపని చెబుతా, రోజూ ప్రాణాలు తీసేస్తున్నావ్' అన్న మాటలు వినబడేసరికి, చీపురుకట్ట సరిగ్గా పట్టుకొని ఓరగావున్న తలుపునెట్టి లోపలికివెళ్ళిన బ్రహ్మయ్య, వెంకాయమ్మ, మధు నోరుతెరచుకొని చూస్తూ వుండిపోయారు. నోట్లో ఎలుకను కరచుకొనివున్న నల్లపిల్లిని లత మధు రాత్రి తనదగ్గర పెట్టుకున్న కర్రతో కొట్టబోయి, గుమ్మంలో నిల్చొన్న భర్త అత్తమామలను చూచి కర్ర కిందపడేసి పమిటచెంగు కప్పుకొని పక్కకు తప్పుకొన్నది. నోరు తెరచుకొని చూస్తున్న భర్త చేతిలోని చీపురుకట్టను అవతల పారేసి 'అమ్మాయ్ లతా! లోపల వర్షం కురుస్తోందా? కురుస్తోంటే కిందికివచ్చి పడుకుంటారేమోనని అడుగుదామని వచ్చాము' అన్నది వెంకాయమ్మకి ఏమితోచక.

ఈ హఠాత్ ప్రశ్నకు లత ఉక్కిరిబిక్కిరై 'అబ్బే ఏమీలేదండి' అన్నది ఒకమూల నీళ్ళు కారుతున్నా. 'అయితే పడుకోండమ్మా మేము వెళతాము' అన్నది వెంకాయమ్మ భర్తను రమ్మని సైగచేస్తూ.

మధు ఏం జరిగిందాని ఆలోచిస్తూ అక్కడే నిల్చుండిపోయాడు. కొంచెంసేపు ఆలోచించగా పిల్లి చేసిన గొడవంతా అర్థమయి 'ఓసి! యింతేనా' అనుకున్నాడు. మధు పడుకున్న తరువాత పిల్లి లోపలికివెళ్ళి ఎలుకను పట్టుకోబోతే అది మధు రగ్గులో దూరటంతో రగ్గుమీద గోడకానించి పెట్టిన కర్ర మధుమీద పడింది. పిల్లి పరుగెత్తటంలో నీళ్ళ చెంబు దొర్లి నీళ్ళు మధుమీద పడటం గాజు గ్లాసు ఫెళ్ళున విరగటం నిముషంలో జరిగిపోయాయి. గోడకు తగిలించిన కోట్ స్టేండ్ మీదవున్న లత నల్లచీర గాలికి సగం కిందికిజారి ఎగరటం దెయ్యంఅనుకొన్న తనఅనుమానాలకి సరిపోయిన వనుకున్నాడు. ఎందుకనో మధుదృష్టి లతవైపుకి మళ్ళింది.

జరిగిన రభసవల్ల కాబోలు ఒకమూల ఒదిగి నిలుచుని వెక్కి వెక్కి ఏడుస్తున్న లతను చూసేసరికి మధుకి జాలివేసింది. తీగకు మానువలె కొండంత అండగా లత పక్కన వుండవలసినది పోయి తాను ఒక న్యాయాధికారిగా నిలబడి భార్యను దోషిగా చూచాడు. పూర్వము జరిగిన విషయాలకు లత ఏమాత్రము కారణము కాకపోయినా మధు లతే కారణమన్నట్లుగా వ్యవహరించి నిర్లక్ష్యము చేస్తూ వచ్చాడు. తప్పించుకొని తిరుగుతూ వచ్చాడు యిద్దరికీ కూడ బాధగా వుండేవిధంగా. ఒకపక్క జాలి మరియొకపక్క ప్రేమ మధును లతదగ్గరకు తీసుకొనిపోయాయి. లతని దగ్గరకు తీసుకొని గడ్డం పైకెత్తి ఒక చిరునవ్వు నవ్వాడు. లత కన్నీటిలోంచే అతనివైపు తృప్తిగా చూచి నవ్వింది. 

# ఆంధ్రపత్రిక గళ్ళనుడికట్టు 6



## ఆధారాలు

### అడ్డం

1. పిరిపట్టినకొండ పుణ్యక్షేత్రం.
3. కాళిదాసు నాటకానికి, ఠాగూరు కావ్యానికి నాయిక.
5. తెలుగువారి పొలాలకు, త్యాగరాజుకీ దీని కృప చాలును.
7. ప్రముఖ హాస్యనటుడు.
9. ఎటుచూసినా వదనం కనిపిస్తుంది.
11. నయాగరా నేమంటారు?
13. చెక్కిలి అపాయం సుమా!
14. తెలుగువారు అవే మన పద్యాలు అనుకొనేట్లు చేసినకవి.

### నిలువు

1. లక్ష్మీదేవి మనస్సు భార్య.
2. ఆటలోనైనా మొత్తం కావలిస్తే ఎక్కవలసిన మెట్లు.
4. దిరిసెనపువ్వు.
6 చమత్కారమే నాలుగో ఉపాయం.
8 పార్వతి పేరు సినిమా తార.
10. చతురంగంలో పనికొచ్చే జంతువు.
12 తిక్కన సమకాలికుడైన ఈకవి అంగుకే తన పద్యాలు బావుంటా యనిపించు కున్నాడా?

## 5-వ నుడికట్టుకు జవాబులు



| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 క | ■ | 2 కా | రు | ■ | 3 చె | 4 వి | ■ | 5 వి |
| 6 ను | డు | వు | ■ | ■ | ■ | 7 న | క | లు |
| క | ■ | కా | ■ | ■ | ■ | య | ■ | వ |
| ■ | 8 చ | వు | 9 క | ■ | 10 ఆ | ము | దం | ■ |
| ■ | ■ | ■ | 11 ల | వ | క | ■ | ■ | ■ |
| ■ | 12 కా | 13 ను | క | ■ | 14 లి | 15 తె | వి | ■ |
| 16 త్తు | ■ | డి | ■ | ■ | ■ | లం | ■ | 17 గో |
| 18 పా | డు | క | ■ | ■ | ■ | 19 గా | డు | పు |
| ను | ■ | 20 ట్టు | మె | ■ | 21 వీ | ణ | ■ | రం |

# పుస్తక సమీక్ష

## ఉన్మత్తుడు

ఏకాంకిక : రచయిత : భాగవతుల ఉమామహేశ్వరశర్మ, ప్రకాశకులు: ఆంధ్ర విజ్ఞాన సమితి, జెమ్‌షెడ్‌పూరు, పాకెట్ సైజు, 61 పేజీలు. వెల. 50 న. పై. లు.

"గృహస్థా! అయ్యో గృహస్థా!
నీ కిదేమి దురవస్థ!...
ఆయవ్యయముల సమీకరణకై
బుర్ర పగలగొట్టుకుంటున్నావా..." అనే 'నేపథ్యగానం' గలనాటిక ఇది. ఇదేకాక, "భయం భయం బ్రతుకు భయం, క్షణం క్షణం భయం భయం" అనే 'నేపథ్యగానం' కూడా కలదు! ఈ 'నేపథ్యగానాల'బట్టే మనం ఇది సామాన్యకుటుంబీకునికి, (అంటే "గుమాస్తా" అనే అర్థం) సంబంధించిన నాటికగా తెలుసుకుంటాము.

రాజా అనే అతను గుమస్తా. గుమస్తాకొటి అతనికి భార్యా, ముగ్గురు పిల్లలూ వుండాలి; 'జీతం చాలకపోవటమూ', 'పూరి కొంపలో వుండటమూ' కూడా గలవు!...

ఈనాటిక కేవలం ఒక గుమస్తా జీవితాన్ని తెలుపుతుంది. అంటే, అతనుపడే బాధల నన్నమాట. ఈ రకం ఇతివృత్తం పాతదే ఐనా - ఇది ఏకాంకిక - నాలుగుదృశ్యాలున్నై...పదిహేడు పాత్రలున్నై!...

నాటకాలుగాని, నాటికలుగాని ప్రదర్శనయోగ్యమైనవిగా వుండాలి. ఉన్నప్పుడే అవి రాసిన ఫలితం. లేకపోతే 'రేడియో నాటిక'ల్లాగా రాసుకోవచ్చును. ఆడితే గంటకాలం పట్టే ఈ నాటికల్లో, మూడు సెట్లుకావాలి, నాలుగు రంగాల్లో ఒకటి ఆఫీసు, రెండు, మూడు, పూరికొంప, నాలుగు-"బందరు కాలవకట్ట. దూరాన మునిగిపోయిన లంకలోని ఇళ్ళకప్పులు మాత్రం అవుపడుతూ వుంటాయి. ఒక చెట్టు కింద"...ఇదొక సెట్టు! ఇవేకాక మధ్యలో 'గుసగుసవాతావరణం' 'హోరుగాలి' 'కారుమబ్బులు కమ్ముకు రావటం' మొదలైన 'ఎఫెక్ట్సు' కూడా కావాలి!...

గంటనాటికకోసం పదిహేడుగురు పాత్రధారులూ, మూడుసెట్లూ, ఎఫెక్టులూ - సంపాయించటం సులభంకాదు. అయితే ఒక సలహా ఇచ్చారు. మొదటి దృశ్యంలో వచ్చే ఐదుపాత్రలూ మళ్ళీ రావుకాబట్టి, ఆ పాత్రధారులే నాలుగోదృశ్యంలో వచ్చే ఐదు పాత్రలనూ ధరించవచ్చును!

ఏమైనా, ఈనాటికలో సంభాషణలు సజంగావున్నై. చక్కని ఇతివృత్తం [illegible]కుంటే మంచి మంచి నాటకాలు ఈ [illegible]యిత రాయగలరనే ఆశకలుగుతున్నది.

—సుకుమార్




Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd. by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



దా గు డు మూ త లు

ఫొటో: ఎ. సంపత్ కృష్ణ.